డగితేనేఁడు। సుస్థిరగుణరత్న చూరబోయితివె। నరలోకమెల్ల శూన్యంబ
య్యెనేఁడు। పరమార్థతత్త్వంబు బయలయ్యెనేఁడు। నామనోరథము భిన్నం
బయ్యెనేఁడు। నామనోవల్లి చిన్నతనొందెనేఁడు। నాభక్తియుక్తి సన్నంబ
య్యెనేఁడు। నాభాగ్యశక్తి హీనతనొందెనేఁడు। నాయిలువేల్పు కిన్నర బ్ర
హ్మిదేవ। నాయాత్మతత్త్వ కిన్నరబ్రహ్మిదేవ। నాగుణాధార కిన్నరబ్రహ్మి
దేవ। నాగుణభావ కిన్నరబ్రహ్మిదేవ। నామనోల్లాస కిన్నర బ్రహ్మిదేవ।
నామనోవాస కిన్నరబ్రహ్మిదేవ। నాదివ్యకీర్తి కిన్నరబ్రహ్మిదేవ। నాచర
మూర్తి కిన్నరబ్రహ్మిదేవ। నాసత్యమూర్తి కిన్నరబ్రహ్మిదేవ। నాసత్యనిత్య
కిన్నరబ్రహ్మిదేవ। నాకులాపాది కిన్నరబ్రహ్మిదేవ। నాకళావేదికిన్నరబ్ర
హ్మిదేవ। నాకల్పవృక్ష కిన్నరబ్రహ్మిదేవ। నాకులాధ్యక్షకిన్నరబ్రహ్మి
దేవ। హాకిన్నరన్న యహంకారదూర। హాకిన్నరన్న సదాచారపూర।
హాకిన్నరన్న దూరీకృతక్లేశ। హాకిన్నరన్న పూరీకృతాత్మేశ। హాకిన్నరన్న
నిరంతరసౌఖ్య। హాకిన్నరన్న మహాగణముఖ్య। హాకిన్నరయ్య దయా
రమణీయ। హాకిన్నరయ్య శివానందశయ్య। హాకిన్నరయ్యనాయయ్యనా
జియ్య।హాకిన్నరన్న నాయన్న నాచెన్న। యనివిలాపించుచునడలుచుశోక।
వనధిదేలుచుదుఃఖ వహ్నిగ్రాఁగుచును। పొగలుచుబురబుర పొక్కుచు
దద్దఱి వెగచుచు వెడవెడ వెక్కుచుబట్టు। వనరుచుదుఃఖ వివశచిత్తుఁడగు
చు।బనువుచునిర్మాఢ్కిబసవన్న యుండ॥ నవసరంబునపణిహారిబాచయ్య।
శివదేవుమదమత్త సింధురంబైన। మడివాలు మాచయ్య మందిరంబున
కు। వడినేగికిన్నరువార్త విన్పింప। నచ్చటికొడయులు వచ్చిరే బసవ। డొ
చ్చెల్ల నేమిసేయుచు నున్నవాఁడు। ప్రస్తుతంబేమి యేర్పడజెప్పుమనిన। మ
స్తకవిన్యస్తహస్తుఁడైయతఁడు। మాదిరాజయ్యగారాదిగాభక్తు। లాదట
చోలశంబై యున్నవారు। బసవన్నకిన్నర ప్రభుగాఁగలించి। యసమశోకా
క్రాంతుఁడైయున్నవాఁడు। నావుడుకలకల నవ్వియేమేమి। రావచ్చునా భ
క్తరాజియక్కడికి। బసవఁడుకిన్నర ప్రభుఁగౌఁగలించి। యసమశోకాక్రాం
తుఁడైయున్నవాఁడె। బాపురెజంగమ ప్రాణవిలీన। బాపురెజంగమ ప్రాణ
సంధాన। బాపురెజంగమ ప్రాణప్రయాణ। బాపురెజంగమప్రాణసత్రా
ణ। చాంగురెజంగమసమసుఖాయత్త। చాంగురెజంగమసమదుఃఖచిత్త।

పట్టినబాసలు పట్టుపడంగ। నెట్టనప్రాణంబు బట్టియున్నాడు। మాతిచేర్చి
యొక్కొక్కమాటుబసవనికి। నుతభక్తిరసము కన్నులనెక్కొనొక్క। వ
లుకుదుర్ఘటమైన శాపతత్పాప। బోలివోనకుండంగబూరించునతడు। మ
రచేనే మనుజంగమ ప్రాణమనిన। నరబాసయిదియేమి నిశ్చేష్టుడగుట।
వనసులగుండుట వగచుటయిట్లు। పనిగొనజంగమ ప్రాణులగుణమే। బా
సలుగీసలు పదటిపాల్గాగ। జేసియేమనికాలుజ జేయుచున్నాడు। బాపు
రేజంగమ ప్రాణులీభంగి। వాపోవ్రుదురే ముండమోపులభంగి। కటకట
మెచ్చునే కల్లినాధుండు। యిటవిందుమేభక్తిహీనంపువార్త। కేవలభక్తు
డె కిన్నరబ్రహ్మ। దేవ్రుడాతని దేవదేవునిగూడు। కొనియెబోయాతనిగూ
ర్చువారలకు। జనునెయ్యెడ్వంగ సంసారులవగిది। బాసదప్పుటయె సద్భ
క్తిగాబూని। బూసింపనేరము పొచ్చంబులాడి। తోడేద్వనేరముదురటి
ల్లయట్ల। పాడంగనేరము బసవుచరిత్ర। వనరంగనేరము వచ్చిమాచే
యు। పనులేమిదానికి బసవండుచాలు। బొమ్మన ఫణిహారి భోరున వచ్చి।
యమ్మహాగణరాజి కొంతంత మ్రొక్కి। కొంకుచువణకుచు గొసరుచుమే
ను। శంకింపగరతలాబ్జంబులుమొగిచి। మాచిదేవప్రభు మాటలన్నియు
ను। సూచింపబసవన్న శోకంబడంగి। బిట్టులిక్కపడలేచి పిమ్మటదెలసి। నె
ట్టనతనబాస నెరసునాయిటయు। ప్రాణంబుకిన్నర బ్రహ్మిదేవయ్య। ప్రా
ణంబునంద సంబంధించెనంత॥ ప్రాణబంధములగు బాసలుదెలుప। ప్రా
ణంబుతో నెల బసవయ్యయుండు। యొకటిదలంప వేరొకటిఘటించె। నక
టయేమనవచ్చు నరలేనిభక్తి। మర్మకర్మములాడ మాచయ్యయెరుగ। న
ర్మిలిజను బసవయ్య యెరుంగు। నటమీదిపనులు మహాదేవుడెరుగు। ని
టువంటివెయ్యెడ యెరుగమేమనుచు। గణకూటమంతయు గలకలంబెస
గ। గణుతింపవిన జూడగాచోద్యమనుచు। పణిహారివెండియు బన్నుచుడు
నేంగి। మడివాలుమాచయ్య యడుగులకెరగి। బసవన్న వార్త యేర్పడవి
న్నవింప। నసదృశానందాంతరంగుడైపొ గి। బాపురేజంగమ ప్రాణవిలి
న। బాపురేజంగమ ప్రాణసంధాన। బాపురే జంగమ ప్రాణ ప్రయాణ।
బాపురేజంగమ ప్రాణసంత్రాణ। నల్లవోజంగమానల్పసప్రాణ। నల్లవో
జంగమా నవరతప్రాణ। చాగురేజంగమ సంతతప్రాణ। చాగురే జంగ

మనసహజనప్రాణ। మజబాపుజంగమ మంగళప్రాణ। మజ బాపు జంగమ
మంగళప్రాణ। మజబాపుజంగమ మార్గప్రయాణ। చనుచను బసవనజం
గమప్రాణ। యనజెల్లు ననజెల్లు నఖిలలోకములు। వినవొప్పు వినవొప్పువి
శ్రుతభక్తి। యనుపమం బనుపమంబంచు నక్షణము। కల్లినాథునిభద్ర గ
జమిదియనగ। కల్లినాథునిచేతి కరవాలమనగ। కల్లినాథునిరత్న ఘంటిక
యనగ। కల్లినాథునిహస్త కటకంబనంగ। కల్లినాథునిపేర కన్యకయనగ। క
ల్లినాథునియంక కాండితండనగ। కల్లినాథునిగూర్మి కట్టనుంగనగ। కల్లి
నాథునిచెలి కాడితడనగ। మడివాలుమాచయ్య మహనియ్య మహిమ।
కడుబెడంగనియన్నగా మునువిన్న। పరవాదులలఘుసద్భక్తులుసెలగ। పు
రిభవుల్ దూలగ శంభుడుమదిగలగ । వీరత సొంపెక్క విజయత ధక్క।
సూరతదివి నిక్కనుజనులు మ్రొక్క। చూపరుల్ గీర్తింప సురలుశంకింప।
పాపులుగంపింప ప్రభుపవర్తింప। కడకవట్రిల్ల నక్కటికరంజిల్ల। మృదుభ
క్తిమేలెల్ల మిన్నుగజల్ల। కేళికల్ సేయ సంకీర్తనల్ మ్రోయ। కాలగ
ర్వము బాయు గణకోటిడాయ। యేతేరనాశ్చర్య మింపుసొంపార। ఖ్యాతి
దిక్కులగూర గడురయంబార। నాథభక్తజనులు నన్యోన్యనమస్కృ। తా
భిగమన సమహోలింగనముల। దనివిచనగవారు దాసుహర్షించి। యనుప
మరతి దద్గణాజ్ఞాపన। మడివాలుమాచయ్య మరిభక్తతతికి। బుడమి స
ర్వాంగముల్ బొందంగమ్రొక్క। ప్రమథపురాతన భక్త దివ్యాంఘ్రి
కమలాంతరంగుడై గ్రక్కునగదిసి। కిన్నరబ్రహ్మయ్యగీర్వాణవంద్య। సన్ను
తకీర్తి సాహసౌద్రమూర్తి। ప్రాణమిత్తుండగు బసవన్న బాస । యే
ణాంకధరుపురి కేగ్లైగవచ్చు। బసవుండుశివునాజ్ఞ వరిపూర్తిగాక । య
సువులునినుగూర్చ వదిమెట్లువచ్చు। గణము లెవ్వారు నెరుంగక యుండశి
వుడు। గుణనిధినిన్నెట్లు గొనిపోవవచ్చు। బసవండుజంగమ ప్రాణవ్రతో
క్తి। ససలారనీయొంద నడుగుసడంగ। ననమాత్రుభక్తిమహాత్మ్యమంతయు
న్నూ। బసవకుమారుని సజ్జనయుడగు। వల్లైనభక్తి శూన్యంబగు..గతి। నిల్లే
ల చెల్లుమీ యిచ్చఁబోవ। కావునబసవన్న కలకాలమెల్ల। నీవును బసవ
సన్నిధినుండబాడి। వేలెమ్మనుడుసవలీలగిన్నరుడు। లోలతకలగని మేలు

కొన్నట్లు। క్రమ్మనలేచి యక్కజముపట్రిల్ల। నమ్మాచిదేవుని యడుగుల కె
ర్గి। బసవండు నంతలోపలన యేతెంచి। యనలారమాచయ్య। యడుగు
లకెరగి। నాముగ్గురును నసంఖ్యాతగణాంఘ్రి। తామరసములకు ద్యల్లీల
మ్రొక్క। అంతనత్యద్భుతాక్రాంతులైలింగ। వంతులందరు మడివాలు
మాచయ్య। వీక్షించి సద్భక్తి వెలితిగాకుండ। రక్షింప శిక్షింప రాజవు
గాన। కలియుగరుద్ర సాక్షాద్వీరభద్ర। కలితగుణోన్నిద్రకరుణానముద్ర।
జితభవకదన సంస్మితచారువదన। గతమదమదన సంగతదయాసదన। శ్రి
తభక్తవర్గ వశీకృతభర్గ। హితవీరమార్గ బహిష్కృతస్వర్గ। పరవాదిజయ
శౌండ బహుళప్రచండ। శరణరత్నకరండ శమితవేదండ। నిహతబిజ్జల
గర్వ నిచితగాంధర్వ। మహితగుణాఖర్వ మన్నితపర్వ। తర్జితసంసార ద
ళితవికార। నిర్జితాహంకార నిఖిలైకవీర। న్యాయనిష్ఠుర వాక్య నరవకా
శక్య। అయుతౌత్సుక్య యుదాత్తశివైక్య। దుర్దాంతశీలవిధూతాఘజాల।
మర్దితలయకాల మాపడివాల। సాహిత్యబిత్సౌఖ్య సజ్జనముఖ్య। మా
హేశ్వరప్రఖ్య మాచిదేవాఖ్య। దండితనీచవిఖండితాచౌచ। మండితాం
తఃశౌచ మడివాలుమాచ॥ ముదలింపమనసులు గదలింప జడత। వదలిం
పబాసలు బొదలింపభక్తి। గీలింపశివునాజ్ఞ తూలింపఖలుల। దూలింపజగ
ము నిర్మూలింపగీర్తి। గూడింపబిజ్జలు నోడింపగజము। బీడింప జగము
లల్లాడింపదుష్ట। శిక్షింపశిష్ట రక్షింపంగమముగ। టాక్షింప వ్రతులఁ బరీ
క్షింపజాలి। పనివడివచ్చిన ప్రమథేంద్రమూర్తి। ఘనతరభువన ప్రకాశిత
కీర్తి। బసవన్నగిన్నెర బ్రహ్మయ్యనివ్వు। డసదృశభక్తిమహాత్వంబు మెర
య। సంజీవితులజేసి జగతి బేర్కొంటి। ముంజేతికంకణంబున కద్దమేల। వ్య
క్తంబయిన భవన్న్యాయ నిష్ఠురహ। శ్రోత్రులు చెవుల కత్యుష్ణంబు లయ్యు।
పథ్యమై మీఁద సద్భలసిద్ధులొసగు। తథ్యమిట్టిద పదార్థంబు లుపచన। కా
లంబునందుడకవే తెరిక తెరికస। నోవిపక్వాన్నంబులుడికినజావ। ఛవిసెయ
గాక రసనగాల్పకొరకె। శివభక్తియుక్తుల శిశులునట్ల। యుడికించివిదలిం
చి యుడికిఘట్టించి। మడుచుటమైలలు మడుగుసేయగనో। యలిగియొకా
వున నట్లమీఁశిశు। మలినంబు బాసి యుమ్మత్కీర్తితో। న తెలుపొందె

బసవన్న దీప్తప్రతిష్ఠ। కల్పించె ప్రమథుల కవితల కెక్కె। మాయిరపుర
వచోమృతమధనమున। నీయుపఖ్యాతమాహాత్మ్యతమాన। స్థాలస్థాలము
నను ద్వ్యత్సివానంద। లాలితకల్పవల్లరిభాసురాంత। రితపల్లవితకోరకితకు
సుమితఫ। లితపరంపరల సల్లీలవర్తిల్లె। నంచుమాచన గొనియాడుచున
తిప। మంచితరతి బసవయ్యనాత్మ యయ్య। విరతి శయాపాంగ నిత్య దయా
మృ। తరపపయోధిమధ్యమున దెల్పంగ। బసవేశుడుండెసద్భక్తులు దాను।
ననదృశలీల మున్న నుచునిప్పాట। నాకాంతపతుల సింహాసనాసీను। లైరొ
లువున్న మహాభక్తవరులు। తయునివ్వటిల్లంగదండనాయకుని। పటుమా
ద్యులందంద బరవుచున్నాడు। కూడుకొనియె చంద్రచూడుండు జూడ।
జూడకిన్నరనీవు తోడనేయేగి। మాచిదేవయ్య సమగ్రదయాన। మాచిన
తన వచ్చుటిదియంతనేడు। జంగమంబే తెంచి చనుమాత్రలోన। సంగద
ప్రాణంబు లరిగియాజంగ। మమ్ముగ్రమ్మరుదాము మగుడనేతెంచి। నమి
తమహాత్వమేమనవచ్చు బసవ॥ శివశివజంగమ స్వీకృతప్రాణ। శివశివజం
గమా శ్రితనిజప్రాణ। హరహరజంగమా యతనిజప్రాణ। హరహరజం
గమాన్వితవృతప్రాణ। బాపురేజంగమ పరివృతప్రాణ। బాపురేజంగమ
ప్రాణయుక్ప్రాణ। మజబాపురే జంగమస్ఫురత్ప్రాణ। మజబాపురేజంగ
మస్థిరప్రాణ। నల్లవోజంగమోన్నత నిజప్రాణ। నిత్యజంగమలింగ నిష్ఠిత
ప్రాణ। సత్యజంగమలింగ సంచితప్రాణ। భవ్యజంగమలింగ పరిచిత ప్రా
ణ। దివ్యజంగమలింగ దీపితప్రాణ। ప్రకటజంగమలింగ బంధురప్రాణ। స
కలజంగమలింగ సంయుతప్రాణ। జంగమైకప్రాణ సౌఖ్యసంధాన। జంగ
మైకప్రాణ సతతావధాన। ధనమునివేదింప ధరవచ్చుగాక। తనువు నివే
దింప దానెట్లువచ్చు। తనువునీవచ్చు బోదానదానియతి। మనమునివేదిం
ప. మరియట్లువచ్చు। మనమునీవచ్చు బోమచ్చికవలన। నెనయ బ్రాణం
బు దానెట్లియ్యవచ్చు। భావింపనిజవీర భక్తివిస్ఫూర్తి। నీవచ్చు బ్రాణం
బు నిలగొల్పమాటు। జంగమంబంద నిజప్రాణచర్య। సంగతంబుగ నెట్లు
సంధింపవచ్చు। వారకమునుటంగుటూరిమాచయ్య। గారి మువ్వురిభా
ష గడునొప్పినాడు। మల్లియుణ్ణ నరుదర సులక్షణదయ్య। నీతమగుభా
ష మున్నును జెప్పబడియె। కూడిమిమ్మైగొండ గుడికేళిరాజు। గారి భావ

ముజెప్పగా నిలబరగ। నేమించిన త్రేశు చామయ్యభాష। భూమిలో నది
యయ యద్భుతమనబరగ। లాలనమతి కమలాదేవిభామ। ఘోళనం బసని
ప్పె మేదినిమీద। వానరలింగప్రాణులును ప్రాణలింగులును నాగదో
ల్లియు వినబడుగాన। ప్రాణలింగులుగవ రాజంగమంబు। ప్రాణంబుగాజ
ను భక్తులుగలరె। భంగిగాజంగము లింగంబుప్రాణ। లింగమన్ బాస జె
ల్లైంగదానీకు॥ ననుచు వొండియు బసవనవంశనాథు। ఘనభక్త మండలి
గౌరవింపంగ। జంగమప్రాణినా సద్భక్తబరగ। భంగిగాసంగన బసవన్న
నాడు। వసుధజంగమపారవశ్యసద్భక్తి। యనలారమీకు లోకారాధ్య నే
డు। ననుచువేమారాధ్యులును సూరసాని। ఘనుపండితేంద్రు నొక్కట
గొనియాడి। బసవపురాణాను భవసుఖాంభోధి॥ ననమానులీల నోలాడు
చునుండె॥ పండితారాధ్య ప్రబంధశృంగార। పండితారాధ్య ప్రబంధ ప్ర
పూర। పండితారాధ్య ప్రబంధానుసార। పండితారాధ్య ప్రబంధవిహార।
పండితారాధ్య ప్రబంధోరుహార। పండితారాధ్య ప్రబంధచిత్సార। పండి
డితారాధ్య ప్రబంధసత్కార। పండితారాధ్య ప్రబంధావతార। పండితా
రాధ్య ప్రబంధనిస్తార। సూరకవీంద్ర మందారశుభప్ర। కారవినుమి దీక్షా
ప్రకరణము॥ ఇదియసంఖ్యాత మాహేశ్వరదివ్య। పదపద్మసౌరభ భ్రమ
రాయమాణ। జంగమలింగ ప్రసాదోపభోగ। సంగతసుఖసుధా శరధినిమ
గ్న। సుకృతాత్మ పాలకురికి సోమనాథ। సుకవిప్రణీత భాసురతరదండ। నా
యకబసవాంక నభ్యాతగుణాగ। ఖ్యాయతకీర్తి దిగంతత్రిలోక। గురుపండి
తారాధ్య చరితంబునందు। కరమిట్లు ప్రథమప్రకరణమొప్పారు॥

సాంబశివార్పణమస్తు.

* బసవపురాణము పీఠికకలశిన కథనంబున ప్రథమప్రకరణంబు ప్రథమాశ్వాసమని వ్రాయించితిమి॥ ఇచ్చటనుంచి ద్వితీయప్రకరణమని వ్రాయబడును॥



శ్రీగురవే నమః.

శుభమస్తు - అవిఘ్నమస్తు.

# పండితారాధ్యచరిత్ర

౦

శ్రీవృషాధీశ సంచితదయాభావ। భావుకమంత్రీశ పాల్కురిసూ
ర। అంత వెండయుః పండితారాధ్యదేవు। దంతకాంతకమూర్తి యట్లో
క్కనాధు। క్షిప్రంబతానును శిష్యవర్గంబు। సుప్రభాతమున నుత్సుకత మే
ల్కాంచి। పసలిచుక్కలుదివి మాయకమున్న। యనమశంఖధ్వనులలర
కమున్న। యభవాలయంబుల నలరుదీపములు। ప్రభచేడి వెలవెల బార
కమున్న। పరగవెన్నెల పరపరగాకమున్న। సరసిజంబులు మొగి విరియ
కమున్న। జిగిచెడికలువలు మొగుడకమున్న। మొగిచకోరములు నోర్మా
యకమున్న। సొక్కియకోకయుడ సుఖయింపదలచి। జక్కవల్కవగూడి
జనకటమున్న। దినమణితనపూర్వ దిక్పతిమీద। మనసెత్తి పిదపాలి మరు
వకమున్న। తోలుకోడికనువిచ్చి నిలిచిమైపెంచి। జలజలరెక్కలు పడలిం
చినీల్గి గ్రక్కునగాలార్చికంఠంబులిచ్చి। ముక్కునసీకలుజక్కల్పికదువు।
లెక్కించి మెడసాంచి నిక్కిమిన్‌జూచి। కొక్కుటోకర్రని గూసినయట్లు।
ప్రబ్బతనాథ ప్రబ్బతనాథయనుచు। నుబ్బనికోళ్లు గూయుదుకటమున్న।
యనురాగలీలనాత్మారామమునకు। జని పుష్పములుగోయు సమయంబు
నందు। పూనికిచ్చిద్దళంబున శివుబూన్ప। గానమరేంద్రత్వ మీనుచు ను
న్న। పరమమహత్వ సంపదగలయట్టి। కరవీరపుష్పముల్ గమిగాంగ గో
షి। శ్వేతునకాకపువ్వు। చేతప్పిపదుడు। ప్రీతితో దాశివార్పిత మున్నమా
త్ర। గావలుడనక మూతంబిచ్చినట్టి। నేవంతి కుసుమముల్ జెచ్చెరగోసి।
చేతులుశివునంద నేత్రులుట్టగవి। సీతులైపూన్పదుజాతులసైనః ఖ్యాతుల
కెక్కు సజ్జాతుల జేయు। రీతులగల విరిజాతుల్గోసి। ముక్కంటిపాదాబ్జ
ములకర్థిఁదమ్మి। నెక్కించుమనుజుని ఘులదమయట్లు। తెల్లంబునిర్మల

తేజిష్ణు జేయు। మల్లికాకుసుమముల్ మాపటికునిచి। యాదటద్రోలుమేవ
సంబాధ దేహు। పాదముల్ దముబూన్ప బడునంతనథము। జాతుల నైవ
ను సన్మతినగ్ర। జాతులగా జేయు జాతుల గోసి। తెంచి వైచిన చెంచు
దేవుని పురికి। బంచిన మారెడు బత్తిరిగోసి। అర్కపదంబు దాహరు
బూన్ప నిల్వ। అకరాప్రసూనంబు లత్యర్థిగోసి। కపళపువ్వ సహస్రము
న్నకెనమైన। కనకంపువిరులు నాకాంతమైగోసి। హరియొక్క పువ్వనకై
తపకన్ను। పరిజేశిశివుబూన్ప చక్రంబుకన్ను। నప్పుడశివునిచే నిప్పించి మ
హిమ। నొప్పారు తామర లొకకొన్నిగోసి। వెల్లపువ్వంబుల నుల్లనంబా
డు। నల్లగల్వలు సమ్మున్నతి గొన్నిగోసి। పరిమళాగతభృంగ పత్షాపనిహ
తి। చిరిగిన రేకుల చిద్రపువ్వములు। ముడిసితుమ్మెదలు పుష్పోడిగ్రోల వధ
లి। పడియున్న యాస్వాయం పతితపువ్వములు। తనబసరులెదెట్లు దా్రివ
లావెడలి। మొనలువ్రాతారిన మొగ్గపువ్వములు। కడివోవనళులానగా
రెకు వెడలి। యుడుదెనైన పర్యుషితపువ్వములు। నపవిత్రమని నివియా
దిగా గలుగు। నుపహతపువ్వంబులో వివర్జించి। భర్గునిబూన్పనిప్పలము
లెయనుచు। నిర్గంధయుతపువ్వ నిచయముల్ దక్క। యుగ్రుని బూన్ప న
యోగ్యంబులనుచు। నుగ్రగంధపు పువ్వులొ విసర్జించి యాతతంబుగ బ్ర
హ్మకై బొంకినట్టి। కేతకి పువ్వముగ్ కీడని మాని। అల్లనాడు మరునకమ్మై
నయట్టి। మొల్లపువ్వంబు లట్లొల్లక మరియు। నక్కజంబుగ బెట్టి నందయు
న్నని। రొయొక్కపువ్వునగగు నొక్కఫలంబు। యాపువ్వుగొనివచ్చి యశ్రభ
వుబూజింప। నేపారగోటివే లిత్థఫలంబు। లనుచు పుష్పము లన్నియును
గోసికొనుచు। ననుభక్తి నేతెర నంతనిక్కడను॥ మహానియ్యసద్భక్తిమతి

## వెలిగొండ మహాదేవయ్యకథ

వెలిగొండ। మహాదేవుడొకి ంతమనలిమేల్కాంచి। యెవ్వారినడనాడ సరె
గియంతకును। కొ్రివ్విరుల్ గోయుదురో గూడననుచు। దాంట్లునుగొనిల
శాత్రంబుల్మీద। తెంట్లోసపరిగాఢ్ల ద్రివ్వనో యనుచు। మలయాని
లము వెంట నలివచ్చినట్టి। యలిపిందుము పరిమళ్ళాడునో యనుచు। తుమ్మె
దల్ సన్నివాతులు ద్రొల్చితొల్చి। కమ్మని వేగంపుంగమిదునో యనుచు।

విచ్చినపద్మముల వాసనఁ గ్రోలిక్రోలి। యచ్చపావనఁ దెలివచ్చెనో యను
చు। దనివొవఁ బ్రదమరాదర బిల్వపత్రి। చును జగిమూరఁగొనునో మన్ని
యనుచు। తొడరిభృంగములు పువ్వులపొల్పుఁ గాల్ప। గడివోయి రేకులు
గ్రందునోయనుచు। చనిపుష్పములు గోసికొనివచ్చునంత। బసబోవునో
శివార్చనము పొద్దనుచు। వంతయు జగతియు వరపుష్పములు। కొంతయు
సంభ్రమాక్రాంతుఁడై యరుగ। కొల్లశివార్చన కరణముల్ దాంక। కా
ళ్లును రెండు నక్షణమగుత్తులకు। కడిఖండలుగఁ గొట్టి కలుషంబుపుట్టి। మృ
దునిముందర బెట్టి మురపడబట్టి। భవమునకొరగట్టి ప్రతిలేనియట్టి। శివభ
క్తి దుదిముట్టి చింతవోదట్టి। ఆసలతలుగొట్టి యరగేనిగట్టి। బాసలుచేపట్టి
పరగుచున్నట్టి। తెరగుగలంతయు నెరిగియద్భుతము। దురగలింపగభక్తి
నెరకులుపొంగ। మతివీరరస సముద్ధతి మతిక్రేక। నతి సంభ్రమాక్రాం
తుఁడై పండితయ్య। పొదలుభృత్యాచార మిదిగాక భక్తి। యిదిగాక వీరత్వ
మిదిగాక యుచిత। మిదిగాక ధన్యత్వ మిదిగాక నేరు। పిదిగాక సౌభాగ్య మి
దిగాక యనుచు। చనుదెంచి మహాదేవ శరణునికొంచి। కనుగవహర్షాశ్రు
కణములుదొరుగ। నాయయ్యగంటిరా నాతండ్రిగంటి। నాయన్నగంటి
రానాస్వామిగంటి। యిట్టుండవలవదా పుట్టినఫలము। యిట్టుండ వలవ
దా పుట్టినజలము। తిరుగు నెమ్ముట్టిన ధీరుండుగలన। మురగు నెమ్ముట్టిన శూ
రుడెవ్వలన। బాపురా భక్తప్రతాపవిలాస। బాపురా భక్తప్రలాప నివా
స। సల్లవో ధర్మ సనాతనకీర్తి। పల్లవో కర్మ వినాశనమూర్తి। వీరభృత్యా
చార విషమైకవర్తి। సారభృత్యాచార సంపత్ప్రపూర్తి। బహుళభృత్యా
చార పథచక్రవర్తి। సహజభృత్యాచార సరయుతావర్తి। గహనభృత్యా
చార గతభవజూర్తి। విహితభృత్యాచారవినయవిస్ఫూర్తి। ధీరతనీకొప్ప
తెగువనీకొప్పు। వీరతనీకొప్పు వెరవునకొప్పు। స్వద్వృత్తి నీకొప్పు చల
మునీకొప్పు। సుద్వృత్తి నీకొప్పు యుక్తినీకొప్పు। నెరవడినీకొప్పు నేర్పు
నీకొప్పు। గురుభక్తి నీకొప్పు బుబ్బనీకొప్పు। యిట్టిభృత్యాచార యిట్టి
విచారు। యిట్టిసాహసకర్మ యిట్టిసద్ధర్మ। యిట్టియుదారత్వ మిట్టివీరత్వ। యి
ట్టియుద్ధతభక్తి యిట్టియుద్యుక్తి। యీమహిలోగన్న యితరులకన్న। దే
మహాదేవన్న భూమప్రసన్న। నక్కటేని భవదీయ్య చరితంబు జయ్య। పరు

జూచి మ్రొక్కుచును। బలిసీశ్వరుండు జలకమాడినట్టి। జలముల నెల్ల
విషములకు మందు। భ్రమ వెలయించు శివ శ్రీచరణసంతు। లయునకు దీపతై
లంబయౌ పథము। కనువిచిత్రవచోభక్త గణములకనుచు। దడయక మృదు
దీప తైలంబు దెచ్చి। వడిబేగ్గి ముసుదెంబి వైచినయట్టి। యడుగుల యం
దు గుల్ఫాంతంబులయందు। గ్రక్కున బూసి తునక్కలను గుత్తులుసు। జ
క్కాల్వనిగుడించి సంధించియొత్తి। యాన క్తిభక్త హస్తార్పితభూతి। బ్యా
సిపై జల్లి యద్భుతము నెక్కొనగ। నా మహాదేవయ్య నంతభక్తులకు। భూ
మిసర్వాంగముల్ బొంద మ్రొక్కించి। పాదంబులిమ్మహా భక్తులునీకు। నా
దట కృప జేసిరన్న లెమ్మనుచు। కరమర్థి లేనెత్తి కౌంగిట జేర్చి। యనుదొం
దనదులు ఘోయనిజయ బెట్ట। ధ్రువకీర్తి మల్లికార్జున పండితయ్య। శివ
భక్తులకు ప్రదక్షిణముగా బనుప। నెరిపిమాపరు మ్రొక్కి నిక్కంబు ద
క్క। హరుదయాలతజుట్టు హర్షంబుబుట్ట। దివిప్రముఖులుఃజూడ ధృతిదోలు
కాడ। సవినయంబొంద ప్రసన్నత జెంద। వీరతయొలయు సుద్ధాత్తత వెల
య। ధీరతబెంపార తేజంబుగూర। పరసమయులు వ్రీల బంధముల్ దూ
ల। హరుభక్తులుప్పొంగ సురలుగలంగ। పండితయ్యనుతింప ప్రత్యయం
బొప। దండితనము వోల ధైర్యంబుసాల। భృత్యతసంధిల్ల బిరుదువట్రిల్ల। స
త్యంబుదనర నాశ్చర్యంబువనర। నతియకీర్తి పాపతయమూర్తిః। య
క్షణంబునను ప్రదక్షిణంబుగను। నడచెసద్భక్తులు నడుచుదొల్లింటి। నడ
యుంటిదనిచూప నడచినయట్లు। నడచెనీశ్వరు ప్రసన్నతజేయబూని। నడ
లుట్టిదనిచూప నడచినయట్లు। నడచె నద్వైతుల నడుదల మెట్టి। నడుచు
మార్గముచూప నడచినయట్లు। నడుచు గర్వంబులు నీరములై పరవ। నడు
ద్గుమార్గముచూప నడచినయట్లు। నడచెభవాంబుధి కడకాలదన్ని। నడు
చున్మార్గముచూప నడచినయట్లు। నడచెభక్తగణంబు కదలఁదోద్వృత్తి।
నడుచున్మార్గముచూప నడచినయట్లు। నడచెగాలిచు నపునర్భవసరణి।
నడుచుమార్గముచూప నడచినయట్లు। తెల్లంబుగా మహాదేవయ్యయం
త్రి దొల్లిటియట్ల యద్భుతలీలదనర। గొంకులుపోకలో వంతలుగాక। పొం
కంబుదప్పక పొందులుసెడక। కడికిలబడక తొక్కుడుగాక బిగువు। వడ
లకయుదికిన వాయువేగపడక। శ్రుతులుగురులు నెరినీచపోక। గుత్తులువం

గళ రొత్తంతలేక। క్రక్కరుపడిక వరంబులుగ్రక్క। గ్రొక్కరోమముదు
ల్లకక్కజింపుగుచు। పాదముల్ద్రొల్లింటి భాతినెయమర। నాదటభక్తగ
ణాళిహర్షించి। ముట్టినచో ప్రాణమున కాసపడక। దిట్టమైపాదముల్ దె
గగొట్టికొనిన। యీమహాదేవయ్య యిద్ధమహాత్మ్య। మేమని గొనియాడ
నేమివర్ణింప। నప్పుడుదుత్తునక్కలై నపాదంబు। లొప్పారశివునిచే నిప్పించిన
ట్టి। యూర్జితపుణ్యుడు పార్జితయశుడు । తర్జితాఘుడు మల్లికార్జునపండి
తారాధ్యులమహాత్మ్య మదియెట్లువొగడ। గౌరీశుడే యెరుంగుగాక యిద్ధ



రణి॥ మున్నరవాద్దడి మువ్వురిలోన। నెన్నంగబడిన మహేశ్వరోత్తము
డు। సనఘుడుకళియంబ యనుగణనాథు। డనయంబు జంగమార్చన సే
యునెడను। యెప్పుడుజంగమం బేతెంచునింటి। కప్పుడరాముట్టి యడుగు
లుగడిగి। పాదోదకంబులు ప్రాచించికొని యేదెసగావింప డితర సత్క్రి
యలు। ఆదటభక్త పాదోదకంబిశు। పాదోదకములకు ఫలమెక్కుడనియు।
నాదటభక్తిపాదాంబుసేవనము। నాదిమలత్రయ హరణమౌననియు। నా
దటభక్తిపాదోదకంబులు భ। వాదిరోగములకు నౌషధంబనియు।సనమా
త్మభక్తదివ్యాంఘ్రిజలంబు। లసమపాతక రాసులడగించుననియు। నఖిలే
శు భక్తదివ్యాంఘ్రిజలంబు। లఖిలధర్మంబుల కాలయంబనియు। నారు
ద్రభక్తదివ్యాంఘ్రిజలంబు। భూరిసంపదలకు బుట్టినిల్లనియు। పరమేశుభ
క్తుల చరణోదకంబు। పరగదృష్టాదృష్ట ఫలహేతువనియు। సర్వేశుభక్తు
ల చరణోదకంబు। సర్వజంతువులకు నిర్వాణమనియు। సకలేశు భక్తుల
చరణోదకంబు। సకలతీర్థములకు జనయిత్రియనియు। పలుతీర్థములు గృం
క బరచుటకంటె। నిలభక్తపాదాంబువులు గొనటిరువు । యెట్లన్నతీర్థం
బులెంగుటభార। మట్లునుగాక స్వర్గాదిఫలంబు। లారుద్రభక్తపాదాంబు
వుల్ దావి। భారకుమియులేదు ప్రాపింపముక్తి। యరయత్క్షిరోదకన్యా
యమన్ మాట। పరవరనయ్యోని పాదోదకంబు। దావివిన ప్రాప్స్వమౌత
ల్లిచన్ జాలు। గావున పాదోదకము యెక్కుడనియు। ప్రవిమలమగుభక్త
పాదోదకంబు। శివతీర్థమనిశ్రుతుల్ జేసెదుగాన । నివ్వటిల్లగభక్త నిచ
యపాదాంబు। లెవ్వానిధన్యుగా జేయాప్తుజేయు। నివ్వటిల్ల గభక్తనిచయ

చును। కానవుగాక సాక్షాల్లింగమూర్తి। బానిసకొడుకని భావింపఁజను నె।
యదాశ్రిపరావళ్ళారుని జూచిచూచి। క్షుద్రకర్మముయిట్లుగాఁడు నె తెగడ। క
లియుగరుద్రునిశ్శంకు జూచిచూచి। మలినాంగిగాఁడు నమతిమాలినడువ।
ప్రత్యక్షరుద్రుని సర్వజ్ఞుఁ జూచిచూచి। యత్యనుచిత మాదిసగు నీదుమూర్తి।
రెండవరుద్రుని శ్రీయుఁ జూచిచూచి। చండాలు రాలమునే జనుని నిందింప।
ర్మూపుదాల్చిన యీశ్వరుని జూచిచూచి। పాపికొడుకు నేపలుమాటలా
డ। కర్మసంహారు దేహాకృతి జూచిచూచి। కమ్మాకగాఁడని కొరులాడంగ।
జంగమలింగంబు చనఁ జూచిచూచి। వెంగలికూఁడని తెగిగాదలప। మల్లిద
ళముభాతి। మసలిమిన్నేరు। మల్లగాంద్రకు నెందు మాళ్ళిపై గలదే। ఖండే
ందుమృణాళంబు గతిగిరీటమున। ఖండేందుధరుల కుండునె చెవుఫు। మున్నం
దు చిటివ్రేళ ముద్రికయగుచు। నున్నాడె యహీనుఁడీ పన్నలకెల్ల। సోల
యకార్గ్గులలోపలిమంచుమనక। పొలుపునఁ నాసలి కన్గలదె మన్నల్యలకు।
పండ్రనె రెండు బంధుభావమున। నుండునె కుత్తుక నారులకు వినము। ప్రక
టింపనిలుపుట్టి బానిసకొడుకు। నకు నిట్టిరుద్రచిహ్నాలు సంభవిలునె। మ
ల్లడుపీడంచు మరిగెడు తెంక। మల్లడెసిరిగిరి మల్లడుగాంగ। నిన్ను నీ వెరుగ
క వెన్నెక్కి-కొవ్వి। కన్నులగానక కరకంఠమూర్తి। నాడలు గల్గ జూచి
యొదునిగాఁ జూచి। జడమతిగాఁ జూచి శరునిగాఁ జూచి। జనితుగాఁ జూచి సంసా
రిగాఁ జూచి। గానకాని బానిసకొడుకుగాఁ జూచి। యదుగులకర్ఘ్యఫణ్యాం
బులువోయ। కడచేసినంతన యెరుగమిదప్పు। పాతకమొప్పునీపాపంబు
దుర్వి। నీతియున్యాయంబు నేరమియగ్గు। కర్మమజ్ఞానవాధర్మమాగడము।
దుర్మార్గవర్తన ధూర్తదనంబు। ద్రోహంబు కోపంబు దుష్టతనంబు। మో
హంబు నేకమై మించనిన్నొకట। యేమిచేసినఁబోవునె కోపమనుచు। భా
మినినప్పుడ వడగొట్టి రెంకు। చేతులుగట్టిడా చేతదారిట్టి। దాత్రిపై నిడిబా
డితము రెత్తిప్రాచి। పనిట్టులకుమోపి గూసంబుఁ జూచి। పానసార
యూకించి మరివ్రేయదడవ। మనికట్టులకుదెగి మరిమిట్టిపడియె। వనితచే
తులు రెండు తునాలైయు తా మలవాత్మకు పాదమన్ననంబునకు। జలజు
లువోయునీ చండిచేతులకు। నిది పెద్ద యేయంచు మదిగలియంబ। ముదము
గోపము చెంపు మూప్పిరిగొనగ। పదతిరాళ్లనుజల్లి పగ్గంబుగట్టి। పెడలికి నీ

ద్వించె దొడగివాచరుడు। కులగతియుసితొలకు కూరిమి లేక। యిలువడి గలద
నియెడు బ్రేమ లేక। ప్రజలగన్నదియును పక్షంబు లేక । నిజ్జమూవ్రు రాలను
నెనరింత లేక। మతినభిమానియన్న న్న లేక। హితురాలుదనక నుహితము
ను లేక। మాటిమాటికిఁ జూచు మక్కువ లేక। యాటదానిని జంపుటవ నీతి
యనక। శివభక్తి యుక్తి పెక్కువసతిచేతు। లవిచారమున నరి కవలవై చు
టకు। హరుభక్తు లత్యద్భుతాక్రాంతులగుచు। నెరవిగీర్తింపుచు నిజమ్మ
ట్లకాదె॥ యిసుకలింగంబుగా నిలజేసి నిలిపి। పసులగావఁగబోయి పాలుని
త్యంబు। శివునకు క్షీరాభిషేకంబుగాంగ । ప్రవిమలసద్భక్తిపై జెట్టిబిడుక।
నేలరా మొదవుల పాలెల్ల నేల। పాలు జేసెదవంచు గాలదన్నుడును । తం
డ్రియని యెనెమున్న ఛెండేశుడవుడు। గండ్రలుగా గొట్టె కాళ్లను మరియు॥
యొంటపెంట్రుకనిల్పి యిలలింగమనుచు। బాటించి మేకల పాలు నిత్యంబు।
శివునకు క్షీరాభిషేకంబుగాంగ। ప్రవిమలసద్భక్తిపై జెట్టిబిదుక । నెలరా
మేకల పాలు నిత్యంబు। శివునకు క్షీరాభిషేకంబుగాంగ। ప్రవిమల సద్భక్తి
పైజెట్టిబిదుక। నేలరా మేకల పాలెల్ల నేల। పాలు జేసెదవంచు గాలదన్ను
డును। గండ్రలుగా గొట్టె కాటకోటండు। దండ్రియని యెనెమున్న తలయు
నుగాళ్లు॥ యిమ్మహి వెండియు నిద్ధసద్భక్తి। నమ్మిళితాచార సారనిష్ఠ్వ।
మునీశ్వరార్థమై ముద్రింపలోన। నున్న పక్వాన్నంబు లువిదమ గొన।
రాకుండ తలుపోర వాకిలి జేసి। యాకాంత దమకించి యందొక్క బూరె।
బిట్టితివ్వచుడునా పట్టిబోనీక। పట్టి ఖండింపదె పరమనిష్ఠురత ॥ మరియున
ట్టులచోడ మండవేశ్వరుడు। కరకంఠుభక్తుడ ఖండితకీర్తి। పరరాష్ట్రప
తులపై పతిదండువోవ। తరుణియా చోడ భూవరునగ్రమహిషి। తాను మం
బు పుట్టిదు గడు మతిమాలి। కామాంగనాశను గాదెలగొల్చు। తనబంధు
వులకును తల్లిదండ్రులకు। మునుమిడి కొలువంగ ముక్కంటిపోయి । అల
రెడుమ్మాగాదియుల్ల కొల్చుచునత। నిలవీటి బోయె సీ క్కడి దండు। నగు
దునా వ్రుమచోడమహిపతి వేగ। మగుడి యింటికి జని మగువ రావించి। కొట్ట
ర్వుప్పించి కొలుదు దెవ్వరికి। బెట్టించితదియేమి బుట్టెనా వ్రునును । దేవ
తామాంబైన దేశముల్ విడిచి। నీవరుదన్నిల్ల నిమ్ము గురించి। యుదగ్రుచుదోం
టి ఖాభాన్నముల్ దలచి। వడిగాళ్లు మొగములు వాధివచ్చుదును। తామ

మైనను-చోడ జనపతియత్త। మామలవారెల్ల మవనిరిభువిని। యను నవ
ఖ్యాతిని కగుననినాఁగు। గొనికొలిపించితి కొలుచునాపుడును। యింతిసీవు
ట్టినయింటివారయ్య। నంతయు నేలమాయత్త వారయ్య। నేలదుర్ధశనొంద
నిందరనవని। పాలురుజేసెద వడతిదప్పించు। మనవుడు దమతమ యజ్జల
వారి। దనవారి దనతలిదండ్రులవారి। నరసిమాచయ్య పెద్దయ్యల వారి।
యిటునిట్టవారినిపొరునింటివారి। చుట్టాలపక్కాలచోడని కడకు। నట్టున్న
భంగినేయతివరప్పింప। నలరుచుభూమీశు డందరినొక్క। యిలుసొరనడి
పించి యీశుగావియల। దొడ్డలుగొన్న యాదొడ్రహులకెంత। పెద్దగాద
నిపొంగి తద్దగోపించి। తుండములవలలు ముత్తినియలుగాఁగ। పండదరిగిన
ట్లు వారివధించి। గర్భిణియగునాతి గర్భంబుచ్రచ్చి। యర్భకునకునంతయ
లుగుడుమనుజ। నాథనేండుమువేండు మన్ననీప్రమధ। నాథు డయ్యర్భకు
నకు నడ్డపడఁగ। భర్గుభక్తుడు బంధువర్గంబునతివ। వగ్గుగాచోడ భూవరుడు
గొట్టండె॥ మరియునుద్రావిడ మండలంబునను। యరలేనిశుద్ధశివాచార
పరుడు। తరుణివాల్మీకేశు దానర్థిజూడ। వచ్చుచునయ్యుమేశ్వరునకుమీ
దు। బుచ్చియుచెంగల్వ పువ్వుమూర్కొనుడు। యాచెల్వనాసికం బప్పుడ
గోసి। వైచుడుపూజారి వడుగురప్పించి। ముట్టినకేలుండము క్కెమిసేయు।
జెట్టిషాడేరుగునె శివభక్తిపథము। అట్టుగాదనిపువ్వు ముట్టినచెయ్యి మొ
ట్టమొదలికిని గొట్టడేద్రవ్వ। గావునలింగజంగమ దూషకులను। బోవంగ
నిత్తురె పొరిగిండ్రిగాక। తల్లిదండ్రులనైన దయలేకచంప। జెల్లుశైవాగ
మస్థితివిచారింప। రతిమాతరః పితరః శ్చైవయనగ। హేతులాంధ్రనగవ
చ్చు నేనిందుతులను। ననుచుభక్తానీక మాకళియంబ। ననుకీర్తిసేయు న
య్యవసరంబునను॥ లాలితకీర్తి పిళ్లయనాయనారు। శ్రీలింగమూర్తిదే

## పిళ్లనయనారుకథ

శికగుణాధారు। అతులితప్రమథగణాశ్రయాచారు। డతిశయశుద్ధ శివైకవి
స్తారు। డవికలవిధి[illegible]షేధాగణదూరు। డపఘాతజైన బౌద్ధాది ప్రచారు।
డుద్ధతరుద్రసముదితావతారు। డిద్ధప్రతాపిసదేశాంగవీరు దెసకంబుద
ళుకొత్త హేమాసనంబు। ననమొమై యొప్పు ముత్యములపందిరియు। ఘ
నతరధవళ శంఖంబులమహిమ। ఘనధవళచ్ఛత్రచామరంబులును। నాత

త వేద శాహ్యవమయనూము। కేతునామోరియు విఖ్యాత కాహళులు।
వాతపూరణములు వద్రిగాిలువృషభ। కేతనాసీకముల్ గీతనాదములు।
నేపారనన్నియునిద్ధభక్తి ప్రతాప హేతువులునై దనకున్గొప్పారి। జనుదే
రకళియుంబ చెక్కనవెదుకు। దనిభక్తిమెచక్క జాగిలిమ్రొక్కి। యెడ్తే
రమదిగూర నింపుసాంపార। దోడ్తెచ్చిమరియు భక్తులకల్లు మ్రొక్కి।పా
దముల్ గడిగి తత్పాదోదకములు। వాదట శ్రీసించు నవసరంబునను।
యింతవృత్తాంతంబు నెరిగియంతయును। సంతోషచిత్తుడై సంస్తుతింపుచు
ను! కళియుంబనందంద కౌగిటజేర్చి। కళియుంబకాంత నక్కడికి రావించి।
శివదేవుసద్భక్త సింహంబులకును। భువిసమస్తాంగముల్ బొంద మ్రొ
క్కించి। అనుపక్తిబిళ్లనయనారు సద్భక్తి। దవర దానును భక్త తతికల్ల
మ్రొక్కి। చేతులు దెగిన యచ్చేతులుగూర్చి। ఖాతిపైజల్లి యద్భుతము
నెక్కొనగ। నోతల్లి నీరెండుచేతులు నెత్తి। ఖ్యాతిగా మ్రొక్కుమా భక్త
లకనుడు। హస్తముల్ దోల్లింటి యట్లనొప్పారె। మస్తకంబున నెత్తి మగు
నయు మ్రొక్కి। సకలసమయులు మస్తకతటన్యస్త। ముకుళితహస్తులై మొ
గిబ్రస్తుతింప। నాయడనంత భక్తాళియునొచ్చి। యీయయ్య మహిమకు నీ
దియెంత పెద్ద। నరయగుమారుని యశంబునందు। ధరబుట్టి పార్వతి స్తన్య

## పెల్మ్రనికథ

ప్రశక్తి। సర్వజ్ఞుడనబడి జైనబౌద్ధాది। చార్వాక వాదుల గర్వం బడంచి।
స్మృథురకు నేగుచో మరి వెలమఠొక్క। దథముదై చిరకాల మతివ నర్థించి।
యిలటముండగగూంతు లేద్వార మొరగి। పిలిపించియొరులకు బెండ్లిండ్లు సే
యు। కడబుట్టి కూతురి క్రమమెల్ల నెరిగి। దడయక క్కడికైన తనుగొనిపో
మ్మయసావలవ దనయన్నలునీకు। భాసథప్పిరియొక్క బదుమనీదైది। య
నుచు నిర్వ్యాకుగూడి యర్థరాత్రంబు। చనచననతిఘోర సర్పంబుగరచి। వె
లమందువచ్చిన వేనవెవ్విధుల। బలవరించుచున్న బాలనాలించి। దయ
పుట్టనంత పిల్లయనాయినారు। వయిబడనొవగడే ప్రాణమాతనికి॥ యిది
యునుగాక వాగీశనైనారు। నదమలభక్తియుసంపద మెరశి। మృదుచేతనొ
కకూడు బడసియాబాల। రొడయపిల్లకకాని యొరులకీనవగ। ధనయ వెం
డియును సంతటమృత మొంద। దవ్యాపాపయుక్తైన దప్పనీననుచు। కడవ లో

వలబెట్టిపడిబాంతియున్న।యడబిల్లనాయనారెంగుదెంచుడును। అమితన
ద్భక్తి సాష్టాంగుడై మ్రొక్కి సముచితసత్కారసంపదనిపి। యటమున్న
తొమ్మిది యబ్దములోగాన। కటములోపల యెముకలు జిక్కియున్న। తన
పుత్రినెమ్ములా స్థానమధ్యమున। నుసిచిసకీడుదనియొకకూంతుగంటి। వచ్చె
నా బాసనీకిచ్చితిబాల। యచ్చెరనేమైన జేసిరాగ్మనుడు। ననుమక్తిబిల్లనయ
న్గారునద్భక్త। జనమండలికిమ్రొక్కి జనుదెంచిభక్తి। కల్యంబుదనరారు
గడవలోనున్న। కల్యముల్ ముట్టి భస్మంబుపైజల్లి। ఘటము వెల్వడియప్డ
కన్యకనిలిచె। పటుహూపగుణహావ భావంబులమర। నటుగాన బిల్లనైనారి
మహాత్మ్య। మిటువంటిదనవచ్చునే యీశ్వరునకు। ననుచుభక్తావళి యద్భు
తంబంది। వినుతింపలోకముల్ విభ్రాంతినొంద। నలిలేగి బిల్లయనయనా
రునాడు। కలియంబకాంతకు గరములిప్పించె। నప్పాట నీపండితారాధ్య
దేవు। లిప్పించెపాదంబు లీశుచేనేడు। తెల్లంబుగామహాదేవయ్యగారి। క
ల్లవారునుజూడ నిలనల్లుకాళ్ల। అసమాత్మభక్త సయ్యామిదసరయ్య। య



దసరయ్యకథ

సదృశభక్తిక్రియాధురీణుండు। తరితసంసారుండు దురితదూరుండు। భరి
తయశుండు సచ్చరితాశ్రయుండు। హింసేతరుండు గుణోత్తంసుడుశుచిరితి
వ। తత్సుదాచారావతంసుడత్తముడు। ప్రోత్సారితాఘుడుద్యత్యాకృతు
డుశి। వైరాత్సవావాసుండు చిత్సభాశ్రయుడు। ధీరుండుభక్తి శృంగారుండు
గతసి। కారుండలోకాను సారుడుత్తముడు। స్వీకృతశరణు దూరీకృతా
ద్యుడుదృ। ణీకృతలోకుడ పాకృతకర్మి। రమణదయాదాన శమదమయ
మని। యమముఖ్య శైవధర్మములు వాడిల్ల। సంతతగురులింగ జంగమా
ర్చనని। రంతరభక్తిమై నాచరించుచును। హరపూజనార్థమైయర్థిఁపుష్ప
ముల। కరుగంగనొకనాడు నెరవిదుర్జనులు। యింపారఘనయూర ఫీశ్వర
భక్తి। పెంపునవీరలెపెర్గలవారు। జితకోపులైసర్వ జీవదయాప। ర్గతనుతి
కెక్కు సువ్రతులటువీరు। యేతరిదమహితం బెరుగకసర్వ। భూతహితము
కోరు బుధులటువీరు। తారునొచ్చియునొంప దగవుగాదనుచు। సైరింప
జాలు సజ్జనులటువీరు। అదిగాకదృష్టించియటువీరుచూడ। నెదిరిచిత్తంబు
లు యట్టానొయనుచు। నొత్తిమాటాడరెయొరులెవ్వరేని। నొత్తురోయని

తారు నోడవరు సెలగి। జంతువు లెడనెడ జచ్చునోయనుచు। నంతంత బరి
కింప రటయడుగిడరు। చెనసియుద్ధము షాలిజీవులబడునె। యనుచు జేతులు
వీవర లై యేచుచోట। యున్నియు జెప్పంగ నేలయీాయయ్య। మున్న దా
నును బుష్పములుగోయ జెట్లు। హా నెచ్చెనొచ్చితి మనుచుండ జిహుము।
చో నెత్తురటువంటి షోనలుగార। యిచ్చెట్లువట్టిన నిట్లువక్కెడిని। యిచ్చె
ట్లువట్టిన నిట్లువక్కెడిని। యిచ్చెట్లునొప్పించు టిదిహింసయనుచు। బెలు
వంబుగా పూల చెట్టులచుట్టు। నలికిగాలికి చాపలడ్డంబుగట్టి। తడవుగా నొం
డొండ ధరదమయంత। భడినసుమంబు లెవ్వడు గొనివచ్చె। తానట్లశివు
బూన్చుగానియాచెట్ల। నైనను నొప్పింపడటె యహింసాత్మ। యిదిసర్వ
సామాన్య మిదిభక్తులెడకు। మదిభక్తియట్టిదో పొదలువిశ్వాస। మెట్టి
దోయింక నహింసాపరాత్వ। మెట్టిదో సైరణ యెట్టిదో కరుణ। యెట్టిదో
శాంతత యెట్టిదో క్షాంతి। యెట్టిదో మనమిది యెరుగుదమనుచు। చండిని
తరసభాస్థలి వేరులునట్టి। రెండుచేతులు నేని మొండి రావించి। అప్పుడుతలను
న్నతైయుండగోరిగి। ముప్పిరియగుదొడ్డ మొలత్రాడుగట్టి। తడిపిభస్మ
ము మేన తలమొగంబునను। కటుదట్టముగబూసి కొల్దోమికడిగి। వలయు
చో రుద్రాక్షములు దొడ్డపటిక। ములుగట్టిమొగుగెక్క బలువరుస బ్రా
మిడిగిత్తగద్దెన గురుకుత్తుగగట్టి। మెత్తనివస్త్రముల్ మీాదటజుట్టి। చక్క
గానీక్రియ జంగమవేన। మెక్కించిపురి జనులక్కజమంద। నోడ్డమి దసర
య్య నుత్తమాంగంబు। దండిమైనీ రెండు మొండిచేతులను। పొడువుము
వెరవత పొమ్మనిన్నారు। పొడవడాయయ్య నావుమనతడపుడ। నిరనిర
నీల్గుచు సీకుచువీపు। విరిచికొనుచు కాళ్లు విరియదన్నుచును। తనుదా
నజూచుగు తలయుద్రిప్పుచును మునుమిడిమోరియుచు మురకటించుచు
ను। భుజములు వెచ్చుచు బొంగుచు దాను। గజబిజింపుచు జట్టకంబులాడు
చును కొల్లువారుచునీడ గోకరింపుచును। ప్రల్లపల్కుచు వెడబాటవా
డుచును। పండిగిల్కుచుగూడ పరవుచు రెండు। మొండులు గిరువుచు దం
డ్డయచ్చుచును। గాలిలుచుబిగియుచు గతులుద్రొక్కుచును। సోలుచుతా
యముల్ జూపుచుగదిసి। శరణార్థియనబోయి వేరపరినాల్క। దిరుగక
వల్చెయు దీర్ఘాయువనుచు। చక్కనీవంతలో జంగమవేష। మెక్కించి

కొన్న నన్నేలభజింప। మాదసరయగారు మాదసరయ్య। మాదసరయ
లింగమాదసరన్న। యేమి దేవా మమ్ము నరుగవావనక। నేము నప్పట
గోల నెంగు దేరంగ। లెక్క సేయవుపోక చిక్కవునిలిచి। యెక్కడబోయె
దరేటకార్యమనవు। పలుకవువరకుసేయవు మహాదేవ। మలసెదు గబ్బిం
తవలెననునీవు। మెల్లడనన్ను నీవెరుగవేమొండి। మల్లలింగంబందు) మ
హీనట్లుగాక। వచ్చినప్రబ్బత నాధునికొడక। గ్రచ్చరనేమత్తిగాండవెచెప్పు
ము। మరలిజూచినగొంత మాటంబుచెడునె। శరణాధిపయనిన పెంపరగు
నెగొంత। గ్రక్కునబరతెంచి కాళ్లపై పడిన। నక్కిలిపడునె నీయయగారి
తనము। మదమరిమాతోడ మాటలాడినను। పిదపగు నేభక్తి పెద్దరికంబు।
యేలనీకన్నుల మొడికినింత। చాలమొహముకాక గేలిజేసెదవా। దయ
యుసైరణశాంతతయును సద్భక్తి। భయమును నయమును భక్తినిర్ణ
యము। గలవాడవనిజూడగా వచ్చినట్టి। ఫలమెల్లగ టిమి పలుమాట లే
ల। యంనుదన్నిట్లు ధట్టించుచున్న। పంచితలింగలాంచనధారిగాంచి।క
రముజ్జుడనకతితపటుండనాక। చిత్తమదాందీశూత చేలన్కుడనక। భండీడన
కకదుదుండరియనక। రెండుచేతులులేని మొండివీడనక। అంగహీనుండన
క నల్లుండనాక। జంగమవేషంబు యంగీకరించి। ౨ందువిశ్వాసంబు నెరి
భక్తి కలిమి। నొండెరుంగక యీశ్వరుండనినమ్మి। దేవమనుష్యచర్మావృ
తరుద్ర। గాఢవెతప్పులు గలవనంతములు। యెరుగమినామెడ నెంతేనిగల
దు। కరకంఠసన్నిభ గరుణింపుదేవ। గర్వంబునాయెడ గలదు విక్కంబు।
సర్వజ్ఞసన్నిభ సైరింపుదేవ। వేయపరాధముల్ నాయెడగలవు। కాయ
జాంతకమూర్తి గరుణింపుదేవ। కడుగడుతప్పులు గలవెల్లబోవ। నడచి ర
క్షింపవె మృడమూర్తియనుచు। పుడమియంతట జాగబడి మొక్కిమరి
యు। నడుగులకెరుగసా యయ్యాశిరంబు। ముడివడదనరెండు మొండిచేతు
లను। పొడుచుచు వేడుచు నడుచుచు గూరు। కొనుచు గట్టించుచుగుము
లుచుగోష। ముఖన మోరుమోలులు బోవగట్టంగ। గాంటులుగంటులుగం
టుశిరంబట। తూటులువోయి నెత్తురుసిలకంగ। హానచ్చె నొచ్చితి నయ్య
య్యాయనక। యేనీకుజేసిన యగ్గమియనక। పోనీకనన్నేల పొడచెదవనక।
యానసూపొడిచిన యయ్యనీకనక। నిమజూచి నేనేల నిలిచితినసక। వినుతి

ఁ బరవఁ విసువఁ నాత్మ। నపరాధుల బరప నిహతిఁ జేయునఁ। ఁ గరుణలు
విన్నను సైతు సేయునఁ। శిరము స్రుక్కి నడువంగ శివశివా యనఁ। గరము లీలఁ
నింకెంత కాఠిన్యమనఁ। గదలఁ మెదలఁ గ్రక్కు గ్రిక్కు ననఁ। నదరఁ బెదర
ఁ గనఁ గట్టాయనఁ। నలయుఁ సొలయుఁ హరహరా యనఁ। పలుకఁ గమ్రాల
ఁ దల వ్రస్సిననఁ। నుసుగఁ నొసగఁ వసిమాలితననఁ। లిసువఁ బరవఁ బెం
డియు నాత్మ। త్రస్తైకమూర్తి నాయెందెంగుగాంచి। శిటించెడినో కాక చే
మట్టితాన। కదుగడు వేడ్క యో కాక నాశిరము। పొడిచి పొడిచి చూడనో
డయనీకిట్లు। కరమిడె గతపూర్వ కాయుగానాడు। కరము నేటిదె భక్త కా
యుగా నిడితె। తడవయ్యెనింక నాతలయు కాఠిన్య। మొడయనీ హస్తంబు
లోర్వలిం తటికి। చిత్తజాంతకమూర్తి చేతికి నిలియ। యుత్తమాంగం బేని
యొత్తఁ గావలదె। హరుభక్తులకు నంగు శిరమే నియయ్య। కరములు నొప్పిం
పగా నోడవలదె। తిక్కింపని దియ నాతలయేని నింత। కర్కశంబగునె జం
గమము చేతులకు। వలదన్న నెచ్చు దేవరమూర్తి మహిమ। వలదనకున్న
నొవ్వవె కరాబ్జములు। అనితలపోయుచు నాపాల్గబడుచు। వినయపూర్వ
కమున వెండియు మ్రొక్కి। తనువునమరియు మెత్తని తావులుండ। పునః
చేతులు నొవ్వ బొద్దుతురె స్వామి। యీశరీరవుశిరం బిటిముట్టదడవ। మీ
కరంబులు నొచ్చునో కదె స్వామి। యీఘన బగుతలయుటు పోకనిర్గ। తాము
నొచ్చునో కదె హస్తాంబుజములు। కర్కశంబగు మస్తకమున సాంకుడునున।
కర్కశాత్మకనొచ్చె కరయుగ్మమనుచు। నెయ్యంబె లర్ప నాయయ్యహస్తం
బు। లొయ్యనొయ్యన దసరయ్యభయంబు। ననుబట్టి పట్టి మర్దన జేసి చేసి। చ
ననొత్తి యొత్తి యొయ్యనదోమి తోమి। మునని గుడ్చి నిగుడ్చి చన జాగడివి
యఁ। దునిచిన మొండిచేతులు రెండునపుడ। మొలచి యంకురములై మో
సులుపోఁగ। యలరిక రాంబుజంబులు దొంగలించె। నా వీరమాహేశ్వరా
చారమునకు। వాపిరికొమ్మలు వచ్చిన యట్లు। భాతిగా శివపుబూన్ప పట్టబాణు
నకు। చేతులు మొలిచి యచ్చెరువగునట్లు। కొరటలే జిగురులంకురితమైన
ట్లౌ। దసరయ్య దివ్యమస్తక సురధేను। పసగ చేకూనల సినిసయట్లు। దసర
న్న శుద్ధభక్తి సరోవరమున। పసకరపద్మముల్ విలసిల్లినట్లి। చెన్నయ్య జి
య్యాకుచేతులు వచ్చి। యున్నట్లుఁ గరయుగ్మమొప్పనయ్యాకును। ఘనతర

సద్భక్తికల్పభూరుహము। మునుకొనిదసరయ్య మొలవబెట్టుడును। వెళ్లు
నుసాగిన విధిదోఃస్థలమున। కేగ్లునుగూడునా విష్కృతంబయ్యె। నఖము
లుభక్తియున్ సాతిచెలువారు। ముఖపద్మమున కద్దముకురంబులనగ। గర
మొప్పనిటుగూడ గరపల్లవములు। పరగంగనాజాను బాహులై చాల। న
వకంబులై సువర్ణంబులై కాంతి। నివహంబులై కళాన్వితములై మరియు।
జారమేశుశ్రీపాద పద్మంబులట్లు। స్ఫురితసంచితకాంతి పూరంబులగుచు।హ
రపాదనఖరముకుర దీప్తులట్లు। వరవివిర్లయశోవంతంబులగుచు। పరమ
మునుల తపోభావంబులట్లు। యుసముదుగ్లభా విరసనరబులగుచు। ధరమ
ణికణిశాతటములయట్లు। పరనుపావనకళా ప్రఖ్యంబులగుచు। ననుప
మశైవాగమార్థంబులట్లు। దసరసత్పథ దర్శితంబులై చనుచు। లలిశివపూ
జాఫలంబుల యట్లు। నలరియగణ్యపుణ్యాయుతంబగుచు। హరుని దానా
భయ హస్తంబులట్లు। బరగుదానాభయ భరితంబులగుచు। మహనియ్య
మగుమూల మంత్రంబులట్లు। వహజశిష్యాళికి సదనంబులగుచు। విపులభ
క్తికిస్పర్శ వేదులయట్లు। నపగతపూర్వ వర్ణాంకంబులగుచు। ధరశివనా
గయ్య కరములయట్లు। విరచితామృతరసా స్వాతంబులగుచు। కన్నప్పపా
దరత్నలయట్లుమరియు। కొన్నెలదాల్చు శిరోమణులగుచు। బ్రస్తుతి కెక్కె
నిష్పాటజగము। హస్తముల్ దసరయ్య హస్తసంగతిని। ఆదటిగ
ద్దెనగరుసందు లింగంబు। నెరయనంతటను సాన్నిధ్యమైపరగె। కడుసం
తసంబు సక్కజముభీతియును। కొడరంగజేతులు దొడరిచూచుచును। నర
తలింగమునంటియంటి జూచుచును। మరియును చేతులు మసలిచూచుచు
ను। నరతలింగమునంటి యంటిజూచుచును। మరియును చేతులుమసలిచూ
చుచును। దసరయ్యజూచుచు దలవంచికొనుచు। వసుధ యంగుటమున
వ్రాయుచు దొంటి। తప్పులుదలచుచు దసరయ్యభక్తి। యొప్పులు దలచు
చు నుండెజంగమము। దసరయ్యయును నేముద్యస్మహోమహిమ। తసలాక
నాయయ్య హస్తతలంబు। లటుసాగదిగుచుచు నప్పుడివేళ్లు। నెటుకలు
విరుచుచు నెమ్మినెత్తుచును। వెండియునయ్యకు వినమితుండగుచు। నుండె
సద్భక్తిసాయుక్తి బెంపార। నంతనంతకమున్న హార్దభక్తవరులు। లింతవే
డుకతోద వినమితులగుచు। ననమానకమహిమ సదాంతర్నిరత్యు। బసవ

పాదాంభోజ ప్రవిమల తేజ! దసరయ్య యిపుడు సీతలబుట్టిగాని । మొనగ
నెన్నడుగ్గాన మిట్టిచోద్యములు! భంగిగాజనవన్న భావసంగతిసీ! దొంగ
లచీరల కొంగులనున్న! వంగవాయలుప్రాణ లింగములయ్యె । సంగతి
దొంగలు సద్భక్తులైరి! అంగహీనుండైన యవినీతుడైన! లింగబాహ్యు
డునుసలింగుడై వరగె! యొండెమిసీదుదోర్దండ సంగతిని । మొండివానికివ
చ్చె రెండుచేతులును! అంతనచరితాధుఃడైన యాలింగ! వంతుని కర్పప
ల్లవస్పర్శజేసి! మీాయుత్తమాంగంబు పాదునుత్తమాంగ! మైయుండె నె
ట్లన్న నంతకునరుదు! వీంకవైచినసాంఖ్య విభురాలవాట్లు! దాకినయట్టి
బొండలకయివడిని! పిట్టవ్వకైచేయు వెట్టికై తట్ట । కట్టలొత్తినయట్టి గం
ట్లచందమున! యొప్పెడుగన్నప్ప చెప్పురాయిదిని! చొప్పొననునుగినచో
ట్లభావమున! దడయకసిద్ధమదానవైనిలిచీ! పొడిపించుకొన్నట్టి పోటుల
వగిది! పొరలిపొరలిపోయి భోగయ్యవెనుక! ధరథాంకియొరసిన పొరలు
చందమున! చిరితొండనికిదొందు చెరుకులుమోచు । తన్నిగ్రుంగియున్న
గ్రంతలతెరుంగునను! పోటులుబొందలు పొరలెత్తియున్న! చోటులును
సిగిన చోటులుఃగంట్లు! తెలయుచు భక్తవత్సలశానియుక్తి । నలరారుట
ను శివుతలయెసీతలయు! తనిపంగనటుగాక ధరతనతలయు । తలయుగా
మనువాని తలయెసీతలయు! జలజాసనాచ్యుతాదులలోన పెద్ద । తలయు
గామనునాని తలయెసీతలయు! చెలువారగ సహస్రశీర్షాయనంగ! దల
లనొప్పెడువాని తలయెసీతలయు! యొగివిశ్వమంతయు నొగితలగాంగ!
దగిలి వెలిగెడువాని తలయెసీతలయు! యిలనొకతలరాక తలలేనియట్టితె
లగలకడయింటి తలయెసీతలయు! తలలేసితలవాని తలయెసీతలయు! తల
మీాదితలవాని తలయెసీతలయు! చతురాస్యునాల్గు దశగ్రీవుబదియు!శత
దశాస్యునివేయు షణ్ముఖునారు! తలలెన్నిసరియె సీతలతోడశివుని! తల
యాడుగాక సీతలతో సరిసేయ! హరుడవుసీవ శంకరుడవుసీవ । గురుడవు
సీవ భక్తుండవుసీవ! ఖ్యాపితంబగుతొంతి యనుఖడ్గమునను! కోపమునరి
వ్రుదేగ గొట్టితెవ్వాండు! వాండసురాశూరుండు వాండమాత్రకుడు! వాండ
విద్వాంసుండు వ్వాండతపస్వి! యనిచెప్పశైవశాస్త్రార్థంబులీక! చనుగా
కరయొరులకు జనునయ్యజియ్యల! మొగియహింసాః పరమో ధర్మమునుల!

యగునీకకాక దురాత్ములకగునె। యటనహంతవ్యం ప్రయత్నతో యటను
కుటిలాత్ములకు నెట్లగునె నీకశాక। యగునవిచారః శివాజ్ఞయా యనగ। ద
గుసూక్తి నీకశాకగు నెస్వల్పులకు। ననునేల లింగద్వయంసమాఖ్యాత। మ
నువృత్తి నీకకాక న్యులకగునె। పంచితాగమశైవ శాస్త్రానుగతస। మంచి
తసద్ధర్మ మార్గానుపాలి। ప్రమథానుకూల సద్భక్తవిలోల। సముదితశివ
శీల సంహృతకాల। వరభక్తిమూల భవప్రతికూల। చరలింగసుఖజాల స
ముదయకాల। నికృతదుర్భవశీలనీతివిశాల। సుకృతమహోత్తాల సుగుణో
లవాల। యని పెక్కుభంగుల ననుకీర్తిసేయ। యను పెక్కుభంగుల నను
కీర్తిసేయ। జనులర్థిజయజయ ధ్వనులతో మ్రొక్క। నటమున్న దసర
య్య కహితంబుసేయ। కుటిలలాంచనధరు గొలిపిన ఖలులు। నంత వెండి
యు భయాక్రాంతాత్ములగుచు। నంతంత సాగసాష్టాంగులై మ్రొక్కి।
యపరాధులము కడునపవిత్రమతుల। మపనీతపుణ్యుల మపగతాత్ములము।
కఠినచిత్తుల మహంకారవృత్తులము। శఠులము పాపకర్ములమజ్ఞులము।
సంసారులము సదాచార దూరులము। హింసాపరులముఖాగ్యేత రాత్ముల
ము। కావునదప్పులు గలవెల్లదసరి। దేవయ్య మాయయ్య కావవే జియ్య।
మీ మహత్త్వము పెంపు మృడుడె యెఱుంగు। నేమెఱింగెదమన గామాకు
వశమె। నీతిదలంపక నీకెగ్గుజేసి। నాతడప్పుడ రెండు చేతులుబడసె। నననే
లవేయు నీకహితంబుసేయ। బనిచినయేమును బ్రతుకంగవలదె। పోలదుర్జ
నులతో పొంమనకంటె। చాలమేలండ్రు సజ్జనవిరోధంబు। అటుగాననీదు
మహత్త్వంబుదలచి। పటుదయామతిగావ బాడిమమ్మనుచు। మరియును
మ్రొక్కంగ మనుజులుగొంద। ఱరిముఱిదమలోన నచ్చెరువంది। సిరిమ
హాదేవ విచిత్రంబుగాదె। ధరమననేమాల దసరయ్య బట్టి। దండించుచు
ను తనత[illegible]ద్రియదడవ। మొండిమల్లుకపుడు రెండుచేతులును। తామె
చ్చియిచ్చె పాదములపైబడిన। నేమేమియిచ్చునో యీయయ్య యనుచు।
వారకన్నుతియింపు వారును మ్రొక్కు। వారునుగొనియాడువారునిబ్భంగి।
నక్కజంబందంగ నన్యదర్శనులు। మ్రొక్కభక్తావళి మోదంబునొంది। న
ప్పాటదసరయ్య నాయయ్యకిచ్చె। జెప్పజిత్రముగాగ చేతులు రెండు। నచ్చు
గా నీవండి తారాధ్యదేవు। డిచ్చెపాదములు దానిప్పుడొప్పార। తెల్లంబు

గా మహాదేవయ్యగారి। కెల్లవారునుజూడ నిలనట్లుగాక॥ పరమ సద్గురు

## గురుభక్తయ్యకథ

లింగ పాదారవింద। పదవశీభూత విస్ఫారమానసుడు। ధరగురుభక్తిసుధా
రసాంభోధి। వరగురుభక్తిసువర్ణభూధరము। చిరగురుభక్తిసంచితసురతరు
వు। కెరమొప్పగురుభక్తికామదుఘంబు। నెట్టణగురుభక్తి నిధిగురుభక్తి।
పట్టబద్ధుడు గురుభక్తయ్యయనగ। ప్రతియోగురుస్సశివః ప్రోక్తయనియు
శ్రుతియస్సివస్యగురుః స్మృతయనియు। శ్రుతినాస్తితత్త్వం గురోఃపరంబ
నియు। శ్రుతిత్రిసంధ్యంచ గురోఃపూజయనియు। మోక్షయంగనియతి మై
మూడుసంధ్యలను। పాయకదనగురు పాదాంబుజాత। పాంసువుదనకు ను
త్తంసంబుగా ప్రశంసించుచును జక్కగజాగిలిమొక్కి। యనువక్తి పాదపు
జ్జన మాచరించి। తనశిరంబున దేహమున జల్లికొనుచు। నడుగులొయ్య
నదుకూలాంబరంబునను। దడియొత్తి సాంద్రచందన పంకములది। చెలువు
దొలంకడనర్చించిపూజించి। యలరుచు ధూపదీపాదులొనర్చి। య-జలీకృ
తహస్తుడై యంత మొక్కి। రంజిల్లునవ్యపుష్పాంజలులిచ్చి। మస్తకవిన్యస్త
హస్తుడై గురువు। బ్రస్తుతింపుచు పదాబ్జంబుల కెరగి। వలగొని వెండియుని
లజాగి మొక్కి। యెలమిమైబరిచర్య లిట్లు సేయుచును। గురుపదాంబుజభ
క్తి గురుకార్యయుక్తి। గురుదాసతాసక్తి గురువచనోక్తి। దనరారదనతనుధ
ర్మములమరచి। యనయంబు వర్తించు నదియెట్టులనిన। అప్రతర్క్యా బ
భేద్యంబప్రమేయ। మప్రమాణంబగమ్యం బప్రచార। మప్రతిమంబసా
ధ్యంబప్రచింత్య। మప్రపంచంబనన్యంబనావాన। మనవొప్పుశివతత్వమా
శివుడీశు। డనుపముడీశాను డంబికారమణు। డాదిభక్తాను గ్రహార్థమై తా
న। మోదంబుతో గురుమూర్తిధరించి। భవపాశములుదెంప బొల్పడివ
చ్చి। భువిముముక్షుల నెల్ల బోధించుమతిని। ఘనదయామృత[illegible]స్త వనజా
తుడగుచు। తనుదానగాన్పించ దలచియాగురుడు। అదివ వాఙ్మానసాతీతు
శివుము। హా దేవు వాఙ్మనోవ్యాపకు జేసి। యిలసర్వగతుభక్త హృద్గతుజేసి।
యిలసర్వమయుభక్తహృన్మాత్రయు జేసి। అరయపరాత్పరు భక్తాత్ముగా జేసి।
బరగునద్వైతత శ్ప్రాంతిశేషుచేసి। యేతరిసిమనోగృహీతంబుగాక। యాత
త్వమెరుగంగ వరుదుగావునను। తానీశుసర్వతత్వాదిగుణావి తానుపావ

యన విహీనుఁగావించి। కోరిశిష్యునిసహంకారాది గుణవి। దూరుఁగానుభ
యసంస్కారముల్ జేసి। మూర్తులమిలిగిన మూర్తి నిలింగ। మూర్తిగాని
యమించి మునుశిష్యుచేత। బెట్టిప్రాణముద్భుది మట్టించియాత్మ। బట్టింప
దచ్ఛిష్య బరిమితంబుగను। దానికిదగగురు దక్షిణశిష్యు। డీనెద్దియును లే
క యిలదామగాంక। యేనిశరీరం ప్రాణవర్థంచయనియో। వినినద్గురుభ్యో
ని వేదవేత్తనియు। యోగ్యుఁగావున బ్రాణమును తనధనము। కాయంబు
గురునకా కాంతుసర్పించి। లింగసాన్నిధ్యంబు జంగమభక్తి। సంగతంబగు
తత్ప్రసాదంబు బడసి। యిట్లుదావర్తించు టిదిగురుభక్తి। యట్లుగా కుద
రార్థమై బాసదప్పి। యాగురుప్రతిబింబ మగుజంగమమున। కాగురుస్వా
మికి నాలింగమునకు। నటుగూడ నర్ధదేహ ప్రాణములను। కుటిలత నిర్వం
చకుండగునట్టి। కట్టడికి మొదలు కాలికిబోవు। పుట్టినలింగంబు మొదలిపు
ణ్యంబు। జట్టిదామగుడిన యట్టిచందమున। యిట్టిదగురుభక్తి యిలనట్లుగా
క। కుంచితుడగుప్రాణ వంచకునకుస। మంచితంబుగదక్క దాలింగభక్తి।
సంగతిసర్థం వంచకుల్కెయ్యెడల। జంగమభక్తి సుసాధ్యంబుగాదు। తను
వంచకునకు నెక్కనదుప్రసాద। మనినసద్గురుమూర్తి కాది దేవునకు త్రి
విధంబుజ్ఞాపిన త్రివిధాత్మునకును। త్రివిధంబువంచింప త్రివిధంబుగలదె। గు
రుడ యొరుంగుతద్గురుభక్తి మహిమ। విరచింపశక్యమె హరునకునైన। గురు
భక్తి యఘుపయోధరమారుతంబు। గురుభక్తి మదవన స్ఫురితదావాగ్ని।
గురుభక్తి యజ్ఞాన తరుకుఠారంబు। గురుభక్తి యపరాధ గుణలవిత్రంబు।
గురుభక్తి పాతక గిరికులిశంబు। గురుభక్తి దుఃఖదుస్తరుధూమకేతు। గురు
భక్తి కర్మసాగరబడబాగ్ని। గురుభక్తి భవగజ కూరసింహంబు। యుపమిం
పసద్గురు యుక్తి వేయేల। యపునరాగత హేతు వదియట్లుగాక। మాతమై
కొనియాడు మరిగురుభక్తి। భ్రాతమై ప్రాతగు పటుగురుభక్తి। తాతమై శి
క్షించు తాగురుభక్తి। దాతమైరక్షించు దాగురుభక్తి। వైద్యుడైరుజబా
పు వరగురుభక్తి। యాద్యుడైబోధించు నతిగురుభక్తి। గురుభక్తి వెలయఁగా
కోటిభంగులను। హరుభక్తి జేసిన నదినిష్ఫలంబు। గురుభక్తి హరుభక్తి కుదు
రుగావునను। గురుభక్తి హరుభక్తికిరవుగావునను। గురుభక్తి హరభక్తి వెర
వుగావునను। గురుభక్తి హరభక్తి కోర్కెగావునను। గురుభక్తి హరభక్తికో

లికిగావునను। గురుభక్తిహరభక్తి కరవుగావునను। సకలసంపదలకు సకల
శక్తులకు॥ సకలమోక్షములకు సకలసిద్ధులకు। సకలేశుభక్తికి సద్గురుభక్తి।
ప్రకటింప హేతువు పరమార్థమట్లు। గావున బ్రాణంబు గాయంబుధనము।
భావించి గురుపదార్పణముగావించి। పాయక తద్గురు పరిచర్యలర్థి। జేయు
చుసాత్త్విక స్థైర్యసన్మతిని। గురుభక్తు లెల్లతన్ గొనియాడుచుండ। భగితచి
త్తుఁడగురుభక్తయ్యనిత్య। తంత్రంబుగురువర తంత్రకృత్యంబు। మంత్రం
బుసద్గురు మంత్రప్రశంస। తపముసద్గురు పదధ్యానానుషక్తి। జపముసద్గు
రు వర చరణసంస్మరణ। వ్రతముసద్గురు పారవశ్యవర్తనము। మతముస
ద్గురుదివ్య మార్గానుచరిత। నేమంబుసద్గురు నిరతిశయాజ్ఞ। హోమంబు
గురుపాద యుగ్మార్చనంబు। ధ్యానంబు సద్గురు తత్త్వచింతనము। దానంబు
గురుపాద తనుసమర్పణము। గానిరంతర పరమానందలీల। దానిట్లు గు
రుభక్తి తత్పరత్వమున। జరియింపుచును దేవు జామొక్కనాడు। గురుపూ
జనార్థమై కుసుమముల్ దెంగ। నాదటసద్గురు నాథుశ్రీచరణ। పాదుకంబు
లు గురుభక్తయ్య దనదు। చరణముల్ సోఁకుదు హరహరయట్టి। పరమ
పాతకమిది ప్రాప్తవ్యమగునె। దురితమున్నదె గురుద్రోహంబుకంటె। స
రిపాదుకాసన శయ్యాదియనియు। ధృతిగురూణాం యదధిష్ఠితం బనియు।
తతినమస్కుర్వీత తత్సర్వమనియు। జెప్పదు శ్రుతినప్ర శేత్క్వచిత్తనియు।
దప్పుదానింకెట్లు ధరియింపవచ్చు। దండధరోద్దండ దండాభినిహతి। దం
డింపబడుమీద దండనకోర్వ। గాళ్లు దుత్తునకలుగా నొట్టిగొట్టి। తోళ్లో
ల్చిమాంసంబు కళ్లుగావించి। నెక్కొనదొప్పల నెత్తురునించి। చక్కడ్చి
నెమ్మెలు సమిధలుజేసి। యొలిశివాజ్ఞ్నకా హుతులుగానట్లు। వేలుతునిది
యు తావిధిదీనికనుచు। పాదంబులొండొండ బట్టిగుత్తులకు। భేధించి గండ్ర
లు సేయునత్తరిని। దండితపాపుడు దనగురుడమర। గుండము మల్లనాఖ్యు
డు పటుకీర్తి। కంతుసంహారుభక్త గణములుదాను। నింత వృత్తాంతంబు
నెఱిగియేతేర। పొడగని బిట్టుల్కి పడిసాధ్వస బు। గడుసంభ్రమముభక్తి
దొడిబడజెనగ। సద్ధరసాష్టాంగుడై దన్నుమరచి। యిద్ధతినటిమ్రొక్కసూ
హింపదడవ। గురుదయామృతసరోవర మధ్యమమున। చరణాబ్జములు వి
కస్వరమయ్యెనాగ। మొలచెవ్రాళ్లును రెండు మునుగురుభక్తి। కెలమిగాం

ఙ్గాడు రెండు మొలచినయట్లు। అంతసపాదుఁడై యాగురుభక్తుఁ । డెంతయు
భక్తిపై నిలజాగి మ్రొక్కి । మస్తకవిన్యస్తహస్తుఁడై గురుని బ్రస్తుతింపఁగఁగు
రుభక్తులుజూచి యిదియుఁదాచోద్యమె యిలగురుభక్తి। విదితభవద్భక్తి
విధిదలపోయ। కధలేలమొన్న నే కాదెయెట్లనిన। ప్రథితసద్గురుపాదపరతం
త్రమతిని। సద్గురువరపరిచరణాభిరతిని। సద్గురు కరుణానితాంత సంస్థితికి।త
నతోటి శిష్యులెంతయు సనహింప। నసఘుడాగురుదేవుఁ డాగురుభక్తు। నె
ట్టణగురుభక్తి నిష్ఠాపరత్వ। మిట్టలంబుగ వారి కెరిగింపదలచి। పట్టెమం
చంబును పరుపును వెనక। పెట్టించిశిష్యుల బిలువంగబనిచి। యొక్కఁడొ
క్కండ గూర్చుండఁడే తెంచి। చక్కఁనబట్టెమంచముమీఁదననుఁడు। యిది
యేమివిపరీత మిట్టిదిగలదె। మదినరుపొందిన మాటలుగావె। సరినున్న
తాపసీశయ్యాదులందు। గురులసన్నిధినెట్లు గూర్చుండవచ్చు। లనిశిష్యు
లది యుపహాస్యంబుసేయ। జనుదెంచి నిజపదార్చన నాచరించు, గురుభ
క్తుఁవీక్షించి కూర్చుండుమన్న। సరసర బట్టెమంచముమీఁదననుఁడు స్థిరభ
క్తితద్గురు శ్రీపాదములకు। ధరణిమహాప్రసాదంబంచు మ్రొక్కి। లలిగురో
ర్జ్ఞానచలంఘుయేత్తనగ। జెలువారువాక్యంబు శిరమునదాల్చి। వడిగురో
రాజ్ఞానువర్తనంబనగ। బడుసూక్తియదిబాగ్గిణ పదముగానెరిగి। సరస
నాపట్టెమంచంబు మీఁదటను। గురుభక్తుఁడపుడు మ్రొక్కుచు గూర్చుం
డ। తరితరిశిష్యులందరు విజృంభించి। వెరవకచూడుఁడా వీఁడు మాగురుల
సన్నిధిపట్టెమంచముపై గూరు। చున్నవాఁడొక్కింతయును లెక్కగొనఁడు।
మనసులోతరయంగ మందలించినను। చనునెట్లు బట్టెమంచముమీఁదనుం
డ। గురువులుమమునిట్లు గూర్చుండుడనిన। గురువులఙంపని గూర్చుంటి
వెట్లు। మాయట్టి యధికులు మదిభయంబంద। నీయుధములనకు నెట్లైగెవ
చ్చు। నిలవేయుననసేల నీగురుద్రోహి। దలఁడున్మిత్రవేఁయక తక్కమేమను
చు। సందడింపగ గురుస్వామి దచ్ఛిష్య। బృంధంబుభావించి పృథుభక్తినిర
తు। గురుభక్తుఁడిగుమని కొసరకక్కఁడనగ। గురుతరంబగునొక్క కొంగ్రుబా
తించి। యతఁడుగురుద్రోహి యథముఁడట్లుండె। నతులితులగురుభక్తుఁ లేధి
కులేనియయెను। యొక్కఁడానెవ్వడే నీకొంగ్రుమీఁద। గ్రుక్కక మీభక్తి చూ
చెదననుఁడు। జనునయ్య పట్టెమంచంబోండెనెక్కఁ। డనియదకొంగ్రెక్క

డనియదరొండె। వినుడిట్టిభక్తికి వెరతుముమున్న। బనిచిన యతనిని బను
పుడే మేల। ప్రక్కకమునుమంచ మెక్కనయట్లు। యెక్కడు గాకేమి యి
క్కొరుత్రినుము। ప్రియతరచిరపరి స్ఫీతకారుణ్య। మయవీక్షణసుధాబ్ధిమ
గ్నుగావించి। యమ్మహాత్ముండు నయ్యాన ప్రసాదంబు। గొమ్మనుచు నొసగనె
క్కొనునిజదత్త। చర్వితతాంబూల సరసప్రసాద। సర్వాంగలేపనా స్వాద
నుండైన। గురుభక్తునకు నెక్కగొరుత్రిజాపుడును। గురునకుజాగిమ్రొక్కు
చు శరణనుచు। సరసరపట్టెమంచంబుపై నెక్కు। శరణిగొరెక్కి చక్కన
నెత్తివెడల। ఓంనమోసద్గురుభ్యోనమోయనిస। మున్నతి మ్రొక్కుచు
మున్న గొరాత్రిర। గించియుగొరాత్రిరగించినట్లుండ । కంచితభక్తి కరాబ్జ
ముల్ మొగిచి। గురుశరణనుచున్న గురుపాదభక్తు। గురుభక్తు గురునక్తు
గురుదయాసిక్తు। గురుకృతాజ్ఞాపాత్రిణు గురువాక్ప్రమాణు । గురుపదాబ్జ
ఘురీణు గురుమతత్రాణు। నస్తమితాఘుని రస్తాంగగుణస। మస్తమస్తన్య
స్త హాస్తప్రశస్తు। లోకభీకరు జీత్వ్రిభాకరెనగ్గ। శ్రీకరుభవజయ శ్రీకరు
శూక। శూలసుఖాసీను శూలసంధాను। శూలాన్వితక్రీడు శూలాత్మచూ
డు। శూలినంతఃస్థితి శూలిని విధృత। శూలుగుజనశిరః శూలునీక్షించి।య
మరగుండము మల్లికార్జునుడంత। తమయున్న శిష్య పరితానంబు చూచి।
యితనిచరిత్రకు నితనిసద్భక్తి। కితనిసిష్మకు నసహి తురుమీరారు । వ్యక్తవే
దేతి హాసాదులయందు। బాత్రిక్తననూతన భక్తాదులందు। వీండ్రెమీరిటు
వంటి విక్రమశక్తి। కండ్రినీరిట్టె దుఘటట భక్తియుక్తి। పరువడిమీరారు
ను భక్తులమనుచు। విరసంబులాడుచువిరవీగుదురు। భావింపమాకుమా
పాత్రిలుమీరారు। భావింపమాకృపా పాత్రిందువీడు। నెరిబాత్రిణ పదమీ
తనికి మదియాజ్ఞ। మరియుపహాస్యంబు మాయాజ్ఞ మీకు। సరిమదిమె
చ్చాను సారియీతండు। సరిద్వాదీమెచ్చాను సారులుమీరారు। యితనికిమీ
కు నెక్కెన్ని చూడంగ। సతులపర్వత పరమాణ్వంతరంబు। అదిసమున్న తశ
య్య యనియుమున్నెరుగ। డిదిశూలమనుచు దానెరుగడిప్పుడును। మా
వచనంబు ప్రమాణంబుగాన। మావచనమెపట్టె మంచంబుగోరుత్రి। యిది
యిట్టులొటకిం కిన్నియునేల। యిదిప్రత్యయముచూడు డిందరుననుచు। గు
రుదేవుడతిదయా కలితాత్ముడగుచు। గురుతరంబైన నీగురుభక్తి యుక్తి।

గరళాంతప్రమథుల కవిలియకెక్క। గరమొప్పడిగిరమ్ము గ్రక్కునననుకు। తుట్టించిపలుక చేతులసూదియుగసి। మెట్టియల్లంతట మేదినికురికి। సరసర జనుదెంచి సద్గురుస్వామి। చరణాంబుజములకు జాగిలిమ్రొక్క । గురుదే వుడర్థినెక్కొన గురుభక్తు। గరమిడిలేనెత్తి కౌంగిటజేర్చి। స్వాదుస్వకీయ్య ప్రసాదామృతాబి। నాదటనోలార్చి యగ్గురుభక్తు। అసితదేహంబు శూల స్థూలనిహతి। కసుగందకందొక్క గంటిరంధ్రింబు। వ్రణము నెత్తురు కండ వాపుగుప్పిలుట। యణుమాత్రమును లేమి కడిప్రత్యయముగ। భువిచోద్య మనుచు నద్భుతచిత్తులగుచు। శివసహోదరులు విజృంభణదక్క। వినుతిం పమున్నను వెలయదెనీకు। ఘనగురుభక్తి విఖ్యాపితమహిమ। యిప్పుడు వె లయదె యేమెల్లనెరుగ। నొప్పుసద్గురుభక్తియుత మహామహిమ। యటు గానయిట్టి ప్రత్యక్షప్రమాణ। పటుమహిమాపరంపర హేతువైన। సుమహ దపారభాసుర భవదియ్య। కనునియ్య గురుభక్తి కలితైకమహిమ। మోక్ష క్రియనోరులేల యీశునకైన। వాక్రువ్వబోగడంగ వశముగాదనిన। పరులెర్గ దురె భవపాశవిముక్తి। గురుచరణాంభోజ సరళసద్భక్తి। గురుదయామృ తరసశరధినివక్తి। గురుగుణప్రకర సంస్మరణానుషక్తి। గురు నిరంతర చర ణానురక్తి। గురువిముఖపదార్థ విరసవిరక్తి। గురుపరతంత్ర నిర్భర గుణో ద్యుక్తి। గురుకార్య చిరదురంధరకళాయుక్తి। గురుమనోజ్ఞాంచితచరితప్ర సక్తి। గురువరమహిమాను గుణగురుభక్తి।యంచు భక్తానీకమచ్చెరువంది। యంచితప్రీతి దోలాడ గీర్తింప। నడయకగురుకృప దనపదాబ్జములు। బ డసెనీక్రియ గురుభక్తయ్యనాదు। ఖండేందుధరభక్త మండలిబాగడ। పం డితేంద్రుడునేడు బడసెపాదములు। తెల్లంబుగా మహాదేవయ్యగారి। కె ల్లవారునుజూడ నిలనట్లుగాక। స్ఫుటతరగురుభక్తి పుణ్యసత్త్వముడు। పటు

—••◆గురుభక్తాండారికథ◆••—

తరగురుభక్తిపాత్రోత్తముండు। లాలితగురుభక్తిలక్షణాన్వితుడు। లాలితగు రుభక్తిలక్షణాన్వితుడు। కీలితగురుభక్తి కృత్యసంయుతుడు। ప్రస్వమరగురు భక్తి పాలనరతుడు। విస్మృమపగురుభక్తి విజ్ఞానయుతుడు, భ్రాజిత గురుభ క్తి పాశయుతుండు। రాజితగురుభక్తి రిననిశుక్తుండు। నవిరళగురుభక్తి వివ శగాత్రుండు। ప్రవిమలగురుభక్తి పథసుచరిత్రు। డనగనొప్పు గురుభక్తాం

లోకాయతుల పొట్టలోపలి యమ్ము। వెలయు నద్వైతవాదుల రొమ్ముగూ
ట। మలరెడు బ్రహ్మవాదుల కంటికసవు। కాలవాదుల తుదినాలుక ముల్లు।
తూలెడు కర్మవాదుల గుండెబెదరు। శూన్యవాదుల మెడ చుట్టెడి పాము।
సన్న్యాసులను బారి నమరెడు మిత్తి। నెరయు మాయావాది నెత్తిగాలంబు।
మరి వేదవాదుల మనసుతల్లడము। పొలయు నధ్యాత్మవాదుల నోరితా
శి। మిలయట్లు గావున నెనయుందు గలడు। తరిదరి పరవాది తాగాకయుంచు
మెరసి యీ ముందట వెరవక నిలువ। గలగక తర్కింప గానెట్టి తార్కి-। కుల
కును వావధూ కులకును వశమె। కావున నిది యొక్క కార్యంబుగాంగ। భా
వింపనేల మీ పాదంబులెత్త। నే మెచ్చాలుదు మేలనిటువంటి సభలు। నేమిం
చినిర్మాల ధామంబు సేయ। ననుచు బండిత మల్లికార్జునయ్యకును। విన
యంబుతో విన్నవింపుచు మ్రొక్కి। క్రిమునున దక్షాధ్వరంబు వ్యాసాష్ట
కమును గణాడంబరము కాశభంబు। నొత్తిలి చదువుచు నుబ్బుచు జనుచు।
నత్తిరి భల్లు గైవారంబు సేయు। శ్రుతిపంచగద్యముల్ రుద్రమహిమయు।
శతకంబు శివతత్త్వసారమాదిగను। హృద్యంబుగా సత్కవీశ్వరుల్ బొగడ।
నాదినుబ్బిసంసార మాయాస్త్రవంబు। పదములు తుమ్మెద పదముల్ ప్ర
భాత। పదములు బర్వత పదములానంద। పదములు శంకర పదముల్ నివా
ళి। పదములు వాలేశు పదములు గొబ్బి। పదములు వెన్నెల పదములు సెజ్జ।
వర్ణనమరిగణ వర్ణనపదము। లర్ణవ ఘోషణ ఘూర్ణిలుచుండ। పాడుచు
నాడుచు బరమహర్షమున। గూడి సద్భక్త సంకుల మేగుదేర। నలరురుగ్వే
దాది యాగమోక్తములు। దలుకొత్త రుద్రసూక్తములు దన్మతులు। సు
మహిష్ఠలీల యజుర్వేద నమక। చమక పంచబ్రహ్మ సంస్తుతోక్తులను। నన
ఘపమ సామవేదాన్వితమహిమ। జనివరుద్ర ప్రశంసాపరోక్తులను। క్రమ
మొంత రుద్రసూక్త ప్రతానములు। ప్రమథసూక్తములును బసవసూక్త
ములు। తనరు వేదముల సంతానైయనంగ। జనుచరణ వ్యూహసంగతియం
దు। శ్యామమాధ్యందిన చర్వాకశ్రవణ। శ్యామాయనీయ చర్చశ్రవర్ణాం
తః సౌండల తుందుభి దాండిలాంగూలి। మాండూకశాఖలమైత్రాయ
ణీయ। వైణేయు వైదేహ వాస్తాంతవేయ। శౌనకి మాద్గల్య సాంఖ్యాయని।
య। కాపేయ శుక్లేయ శాపాయణీయ। కాపాల బాష్కల గాలవ కణ్వ

చాంతపర్యత్పరిత బ్రహ్మాండప్ర। చాంత పిప్పలదేవదర్శి వైజాత। వారాహ
శతకయా వాజసనీయ। నారాయణీయ యానపహార్దలేయ। పౌరాక్ర ము
క్రాంత బౌద్ధాయనధవ। పారాక్రమబ్రహ్మ పౌమవిసాత్య। యాసురాణీయ
యాహకమూలకఠయ। దాసరాణీయ కాత్యాయనీయాశ్వ। లాయనీయ
ము మొదలైనశాఖలుసే। మాయతతదుప శాఖాదిసూత్ర। ప్రతానంబు
లును బవమానకైవల్య। కైనేమజాబాల కాలాగ్నిరుద్ర। నారాయణ
బార్హ్మణశివసంకల్ప। శ్రీరుద్రచయ బృహదారణ్యగర్భ। హంసాద్యుపని
షచ్ఛయములరుద్రప్ర। శంసాదగోక్తులాశ్చర్యంబెలర్ప। పరమ లింగార్చ
నా పరులుస్వాధ్యాయ। పరులునైచను మహాబ్రహ్మణోత్తములు। చదువు
చువేదభాష్యములు జెప్పుచును। ముధమునసీరుదెస మొక్కుచు నడవ।
న్యాయవైశేషికో దాత్తశాస్త్రములు। పాయనిత్రీతి నుపన్యసింపుచును।
ఖండనాఖండ నోద్దండతవెలయ। దండితార్కికులుబ్బు దనరనేతేర। బస
వయ్యాపోడ్డల బాచయ్యచెన్న। బసవయ్యమడివాలు ప్రభువుసత్తేశు। చా
మయ్యయజగనసవ్వరదసిద్ధ। రామయ్య యక్కగార్కల్లిదేవయ్య। దాస
య్యశంకర దాసయ్యదాస। కేసయ్యకక్కయ్య కేశిరాజయ్య। మసనయ్య
చిక్కయ్య మాదిరాజయ్య। యసలారవీరాదియైనట్టివారి। ప్రకటపురాత
న భక్తులగీత। నికరంబుగాయక నికరంబుబాడ। శివమస్తు శివమస్తు శివమ
స్తుయనుచు। దలివిదీవింపుచు తపసులేతేర। ధరనేకశంఖముల్ ధవళశం
ఖములు। పొరిబొరిబరిగొన భోరునమ్రోయ। నలరారుబంచమహావా
వితతు। లులియంగ కాహళులొక్కటమ్రోయ। అంతటనిల్లింత నల్లంత
చెంత। సంతసంబుననరులెల్ల జయవెట్టుచుండ। పురిభక్తతతులు విభూతిపైడ
యము। లరుదొంద మ్రొక్కి సమర్పణసేయ। బ్రణుతవాజ్మాత్రణులు నీరా
జనదీప। మణులును భక్తిదృజ్మణులు సంధిల్ల। సంగధ వివిధ పుష్పాంజ
లులిచ్చి। మంగళారతులెత్తి మహిమ్రొక్కి చనగ। అంగళ్లవీధుల నంతం
తనిలిచి। లింగభక్తులకెదు రేగుదెంచగ। నాద్యులుబుణ్యపణ్యాంగనల్
భక్తి। శౌర్యాతిశయతు కుత్సాహించిపొగడ। లింగభక్తుల నిజాప్తాంగ
మార్గంబు। సంగతిదయజూచు శాంతనందులను। పరసమయంబులు భ
స్మంబుగాంగ। నుగుపడిజూచు నుప్పరమునందులను। పటుజైనచార్వాక

బౌద్ధసంఘములు। స్ఫుటమొందదగ నేవ జూచునందులను। మానితంబగు కే
తనానీకములును। పూని గాఁ బెదువాత పూరణంబులును । కుడివడఘణి
హార్లు ముందట వెనగ। మడరంగ బాంగు భళాయంచునడవ। చెనసిమున్
చత్రంచ శశినిభంబనగ। జనగను వాయువ్య సంహ్యాతయందు। నిశుపాకు
నతాఁతు నిర్మలంబనుచు। నానరపద్మ పురాణమున జెప్పుగాన। చాటు
శ్వేతఛత్ర శర్వస్వయనుచు। చాటుపీతచత్ర శాక్షీణేయనుచు। తప్పకవి
ధీకిరక్త ఛత్రమనుచు। జెప్పెడిగావున శ్రీస్కాందపురాణ। లమరంగ నాల
వట్టములు చామరలు। క్రమమునసట్టివ శాజెప్పగాన। పరిధవళ చత్రచా
మరావళులు। ధరరుద్రసకు భక్తతతికినిదక్కఁ నొగి బ్రహ్మ విష్ణుముఖ్యుల
కీడనరశ। మగినరకంద్ర జేత్తను గానయట్లు। వినుతమహాకీర్తి కథామ విలసి
తమహిమ। జనుధవళ చత్రచయముబోల్పార। తెంపెంగతమతోటి వెల్ల
గొండమహా। దేవయ్యగారు నుద్దీపితభక్తి। ధీరతబోరడ్ల సూరసానమ్మ। గా
రాదిగా భక్తగణములునడవ। పరవాదిభంజన పటుపరాక్రమము। జరలిం
గసాంబ్రాజ్య సంపదదనర। జనుదెంచు మల్లికార్జున పండితేంద్రు। నన
ఘునిబౌద్ధుడల్లంతటగాంచె। పరవాదిమత్తేభ పంచాననంబు। పరవాది
ఘోరసాగర బడబాగ్ని। పరవాదిమేఘదుస్తర మారుతంబు। పరవాది
తస్కర బహుళశూలంబు। పరవాదిఘనవన స్ఫురితదావాగ్ని। పరవాది
విషభూజ పటుకుఠారంబు। పరవాదిదుష్టదుర్ధర ధూమకేతు। పరవాది
భూరిభూధరకులిశంబు। పరవాదివల్మీక చిరఖనిత్రంబు। పరవాది నవల
తా ప్రధితతోత్రంబు। పరవాదిభేకభీకరభుజంగంబు। పరవాదిపురహరపా
లనేత్రంబు। పరవాదిసారసవర నిశాకరుడు। పరవాదివాధిజకుంభత్కుం
భజన్ము। గనిబౌద్ధుడంత నుత్కటకోపవహ్ని। కోరలను దనుదాన కొని
కాలుచుండ। నానీతబుధుడు లోకారాధ్యయశుడు। నైనపండిత మల్లికా
ర్జునప్రభుని। వలపటిదెసను మహావరభక్తరాజి। నలిగొన సింహాసనస్థు గా
జేయ। హరులభాసులయాజ్ఞ శిరమునదాల్చి। గరిడిశిక్కినయంక కాం
డునుబోలె। తొడలిడివడ్డ మదేభంబువోలె। వడిమృగంబులగన్న వ్యా
ధుండువోలె। పగరగన్పంతయు బంటునుబోలె। పగనొందుపసిగన్న వ్యా
ఘ్రింబువోలె। అసురవృత్తి గోష్ఠాటోపచిత్తు। డైసమయుల సమయాధ

ముజూచి। యెక్కడిపైదికు డెక్కడిబౌద్ధు। డెక్కడివైష్ణవు డెక్కడిజోగి।
యెక్కడిచార్వాకు డెక్కడి సాంఖ్యు। డెక్కడివేదాంతి యెక్కడికర్మి। సి
ద్ధమన్యోన్య విరుద్ధమైచనున। బద్ధంబు సభల సంపాదనగలదె। ప్రకటింప
నూరునులక తార్కిల్లుగూడి। యొక మూర్ఖకు నెసభ్యు డొకడైనగలడె। కం
గటికాళ్లు సంకరవుపూసలును। సంగడించినయట్టి సభలునుసభలె। చా
కలకునుభువి సత్కవులకును। యేకత్వమున్నదె లోకంబునందు। వెట్టికి
దెచ్చిన విధమునసూర। వెట్టిగావించిన యట్టివిసభలె। కూటవమూకలు
బాటిమైకూడ। జాటిదెచ్చినయట్టి సభలును సభలె। యుర్వీశు పరివార
ముర్వీశుబంట్లు। యుర్వీశుప్రజలును నున్నవారెల్ల। యిందుదాసభయన
నెద్దివినంగ। నిందుసభాపతి యెవ్వడౌననగ। తర్కింప జర్చింపతలయెత్తి
చూడ। తార్కికుడెవ్వడు తథ్యమిందెన్న। యింతేసమగుకుట యిదిమా
కుభక్తి। పంతమట్టునుగాదు ప్రశ్న జేసెదము। యోవైదికుండనీ యొడ
లెగ్గవెట్లు। యీవేలయిటువచ్చి తీవేదబాహ్యు। జూడముట్టవసది చో
ద్యతినూట। లాడగాదనగ మున్నాశ్రుతివినమె। యనసేలహాస్తినా హ
న్యమానోపి। యననవిశేచ్ఛ జినాలయంబనగ। ధరనిట్టిజనబుద్ధదర్శనాం
తరము। లరయుగించిద్వైద మంతియగాదె। పరప గుతిధ్వేద బాహ్యుడు
బొందు। నరకంబభీష్టమెనలినట్లయేని। వినువేదవాదిని వేదంబునిత్య। మ
నియదెముప్పది యారుతత్వముల। నైదవతత్వ మయ్యాకాశతత్వ। మా
దటశబ్ద మయ్యాకాశగుణము। దానిత్య వస్తు వేధరనొక్కప్రకృతి। త్రైని
డినాడెట్లు దానుదయించు। అదిగాక శ్రుతులు స్వయంభులంటేని। యు
దయంబులయము లేకునికిదానెట్లు। నలినెనభుడు చరణపూర్వహసూక్త।
ములువినవె స్వయంభువులె వేదములు। రురువర్ణ దేహంబురుగ్వేదము
నకు। ధరణినాత్రేయ గోత్రంబుగాయత్రి। చందమయ్యాధిపతి సరసిజ భ
వుడు। నందమాపద్మపత్రాయతాక్షములు। కుంచితకేశము ల్గుర్తిమైనయ
ట్లు। లంచితంబగుమరి యాయజుశ్రుతికి। క్రిమమొంద నాది భారద్వాజ
గోత్రి। మయురుత్రిష్టుప్ఛంద మధిపతి శౌజ్ఞ। స్థూలకపాలంబుసూర్యకా
న్యములు। బోలెడుతాంబ్ర విస్ఫురితవర్ణంబు। సామవేదమునకుఛందం
బుజగతి। దామరిరుద్రుండు దైవంబు తనువు। కదుస్ఫోతవర్ణంబు కాశ్యప

గోత్ర। మడరంగ శుచిదేహామతి దాంతిగుణము। వెలయునథర్వణ వేద
శృంగమున। కిలనష్టముఖ్ఖండ మిందు్రిడధిపతి। యనుపమంబైన కృష్ణాం
కంబు మేను। దనరువైజావ గోత్రంబట్లుశ్రుతులు। కొలదులువర్ణములు
గోత్రములు రూపములు। దగునదీదైవములు గలిగుండు। నలుసులేక స్వ
యంభులనియొడి శ్రుతుల। దలపనిత్యములని దలచెద వేని। యుదయిం
చుజెడుజగదుదయునవిలయ। విదితకారణము లేవేదసంఘములు। భువిన్
జ్జగంబులు పుట్టకమరియు। నవిసనాతనములు ననియదెవినుము। తజ్జో
క్తిబరగు పూర్వజ్ఞానన విష। యజ్ఞాన కలితోత్తర జ్ఞానచయము। నా
విషయజ్ఞాన మదివెను బడగ। జావిదైయె యుత్తర జ్ఞానంబు దోచు।
పూనితదుత్తర జ్ఞానంబుగదియ। దానుత్తరజ్ఞాన తతిపూర్వమైన। జ్ఞానా
దులైయవిదానెట్లుదోచు। మానితాక్షరపంక్తి మాడ్కియట్లనిన। యె
గలవిషయజ్ఞాన మాధ్యక్షరాంక। మొగిద్వితీయాక్షరంబుత్తరజ్ఞాన। మ
రిగినయదివిషయజ్ఞానమదియ। యరయబూర్వజ్ఞాన మగునట్టులైన। నరి
దదియొత్తర జ్ఞానాక్షరంబు। నరయంగదగు విషయజ్ఞానమగుడు। నొగి
దృతియాక్షరం బుత్తర జ్ఞాన। మగునిట్టులొండొంటి కటమీదెరుంగ। చ
న్న పూర్వజ్ఞాన సంగతాక్షరము। లన్నియునతని కనాదులేకాక। రతిగూ
డబద్యాక్షరములెల్లనెరుగు। నతనికనాదులె యట్లయునాదు। లనుజగంబు
లనిత్యమనియన్క జ్ఞాన। మునవెరింగితో మరి యున్నైనయట్టి। జగము
లజూచి నిశ్చయమెరింగితివా। నిగమప్రమాణోక్తి నీవెరింగితివా। యొ
నరనిజజ్ఞాన మునేననెరింగి। తినని యదెజ్ఞానదృష్టులలోన। తివిరియాత్మ
జ్ఞాన దృష్టి నెరిగితో। తివిరిచక్షుజ్ఞాన దృష్టి నెరిగితో। పూని యాత్మజ్ఞాన
మున నెరింగితిని। దానని యదె పశుజ్ఞాన తత్వోక్తి। నిన్ను నీవెరుగంగనే
రనివాడ। వెన్న నిజ్జగదాది యెట్లెరింగితిని। కాకచక్షుదృష్టి గాంచెదన
నియె। దాకనుంగొనగ నేత్రములు నీకెవ్వి। హరుని నేత్రములైనయునలా
ర్కశీత। కరులయయ్యతిదైవిక స్ఫూర్తిగాని। తజ్జులుయాదృష్టు దాగాన
వనివ। యజ్ఞానికానంగనల్లియొనీకు। యిజ్జగంబులు చూచి యెఱిగితి వేని।
యజ్జగంబులునీక నాదులునీవు। నొన్నటివాడవు మున్నున్నజగము। లె

న్ననాదిగా నెన్నెరింగితివి। యాజగదాదికి నాదియైనట్టి। రాజార్ధధరు
డు మారమణుడునాది। గావుననిది యరుంగఁగ నేర్చుగాక। భావింపనితరు
ల పాల్పొప్పెకాక। నిగమప్రమాణోక్తి నీవెరిగితేని। నిగమ ప్రమాణో
క్తి నీకుదా నెద్ది। యిలజగతాంపతియేనమోయనగ। గలుగు నిత్యాదిసూ
క్తము లెరుగుశక్తి। గానయనాదులు గావిజ్జగములు। గాన వేదములచే గా
విజ్జగములు। శ్రుతిశిరోమామేవ పితరోయనంగ। శ్రుతులకుదండ్రియీ
శుండవైయుండ। ధృతివేదములు పితృదేవోయనఁగ। శ్రుతులకు దండ్రి
యీశుండవైయుండ। దనరు వేదములు పితాతదశ్యామ। యనశ్రుతుల
కుదండ్రిసాంబుడై యుండ। శ్రుతులు దారీశ్వర సుతులు మేమనఁగ। శ్రుతు
లుస్వయంభులంచును బల్కదగునె। శ్రుతిపురుషులుపరిశ్రుతభక్తిపాశు।
పతశాంభవవ్రత పారీణ మతులు। తనకు వేదములు వేదాధార యంతి।
యనదెల్లగాదె రుద్రాక్షధారణము। నాదిదేవానాంత్రి యాయుషం బ
నఁగ। మేమరశ్రుతులుతన్నే అస్తుయనాగ। ప్రత్యయంబవుగాదె భస్మావి
లిప్త। నిత్యత్రిపుండ్రధవి నిహితైకనిష్ఠ। మితియతిశ్రుతుల అయమ్మే హస్త
యనఁగ। నతియంశివాభిమర్శనానెగయంద। సత్యంబుగాదె యీశ్వర స
న్నిహితము। నిత్యలింగార్చనా నియతానురక్తి। వింతయెశ్రుతులందు వే
దాశ్చకామ। యంతేనమరియు దదశ్నామియనగ। సుప్రసిద్ధముగాదెశూ
లిపాదోక। ప్రసాదోపభోగ ప్రవర్తనము। తమభక్తిగతిశ్రుతుల్ దార
సెప్పంగ। భ్రమసిదైవములని పలుకంగదగునె। పాయకశ్రుత్యుక్తి బంచా
క్షరేష్టి। తాయననాదివేదాశ్చశాస్త్రాణి। లయనగబరిచాక్షరి యందేల
యింప। మును పేదములు నిత్యములునాఁగదగునె। కానస్వయంభులు గా
వు వేదములు। గానసిత్యంబులు గావు వేదములు। కావేనిత్రిజగన్నికాయం
బులట్ల। నావిర్భవింపంబయ్యె నాదినంబేని। భవుడునిజాజ్ఞాప్రభావన భువన।
భవనంబులతులితప్రతిభమైపేర్చి। నిజమగూజలకూర్మగజఫణీంద్రులను త్రి
జగదాధార నిధేయతనిల్పి। సంచితస్థావర జంగమాదిప్ర। పంచంబుగావిం
పప్రబలింపదుర్గింప। కడుగడుదత్తుత గలమహామహిమ। మృదునెరుంగుదు
గాదె మీ వేదములను। చలముజగ్గను లేని శాబ్దికులకును। దెలియు సోమః
పవతేయనమరియు। వలజని తామతీ నామనసవుల। దిళుకాద్యగా జనితా

దివోయనగ। స్తుతసూక్తి జనితాపృథివ్యోయనంగ। క్షితిజనితాగ్నిర్జనిత
సూర్యయనగ। యిరవొందదుది జనితేంద్రస్యయనగ। విరచించిజనితాది
విష్ణోయనంగ।వలపారశిశువోభవంతియనంగ। దలప్రయోతాద్దైవతాస్రష్ట
యనగ। దృష్టంబుమరియును దేవాశ్చపరవ। దృష్టాయనగ శ్రుతిదృష్టం
బులుగను। యొప్పారనిట్టులై యున్న వేదములు। చెప్పు మహాదృష్టి శివుని
యుందగుట। గానయీశుండు జగత్సృష్టికర్త। కానేరవొందు జగంబుల
ల్లైని। వెలినుండచేసెనో విశ్వాధికుండు। చెలగిలోనుండి చేసెనొలోకవిత
తి। యనియుదాతనదు గర్భాంబుధిలోన। జనియించుబుద్బుద జాలంబుల
ట్లు। యనియుంగలింగ మధ్యేజగత్సర్వ। మనగదన్మధ్యంబునందుగావించు।
చేకొనిజగము సృజించునీశ్వరుడు। సాకారుడోమరినిరాకారుడోని। రాకారు
డేని జేయలేడు సృష్టి। సాకారుడేని జేయగరాదుసృష్టి। సృష్టిదానిత్యనిచె
గానికాదు। సృష్టియనిత్యనిచె మున్న కాదు। యేసార సిత్యస్వరూపితా
రుదు। రూపమేపగిదిని రూపించితీవు। హరుని సాకార నిరాకార రూఢి।
బరగుతత్వంబులేక భావమెట్లయ్యె। తెనసియేవిధమున సృష్టిదాజేసె। దని
యెదాసృష్టిలీలార్థమైదాన। భవుడనరాజసాస్పదగుణంబునను। భువ
నంబులేర్పడ బుట్టించెపరగ। మృడుడనీసాత్వికమిళితగుణమున। గడగిజగం
బులు గరుణరక్షించు। హరుడనదామసోద్ధురగుణంబునను। బరగు జగం
బు లేర్పడసంహరించు। త్రిగుణంబులను బాసె దీపితమహిమ। దగిలిశివుం
డన దానవెలుంగు। సింహారస్క్రియ పృథుశివభక్తి। సంపుటంబుగ జగ
చ్చక్రంబుద్రిప్పు। సకలనిష్కలదైశ్వర్య సంపూర్ణుడు। డకళంకుడీశాను
డాదిరుద్రుండు। శ్రీమహాదేవుడజేయుడక్షయుడ।నామయు డాద్యుడాత్యం
తవర్జితుడు। సర్వగతాది గోచరుడు నిత్యుండు। శర్వుడ వాఙ్మన
సప్రగోచరుడు। హరుడవినాశన డజరుడక్షరుడు। పరము తేజఃపుంజ భాస్వ
రాంగుండు। వేదాంత వేద్యుండు విశ్వాధికుండు। మహాదేవు డతులిత మ
హిమాకరుండు। పరమేశ్వరుడు జగత్పతి శంకరుండు। వరదుడు సద్భక్త వ
త్సలుండైన। హరునిసాకార సిద్ధాంతతత్వంబు। పరమ కారణమునుత్పత్తి
హేతువును। గానరుద్రుని చేత గల్పింపబడితె। దానిజ్జగంబులు తథ్యమె
ట్లనిన। కలుగని వెట్లును గలుగవన్నాది। కలిగిన నెట్లును గలుగుచునుండు। క

లుగనీజగములు గల్పించివాఁడొ। కలిగియుగలుగని లీలజేసినాఁడొ। యల
రియయ్యాది శేసె ననియెదెవినుము। సలిలాదిమృద్దండ చక్రసూత్రములు।
గలుగకులాలుండ గలుగమెయిట్టి। లలవడుతంతు ముఖ్యాది హేతువులు।
గలుగగోవిందుండు గలుగమియట్టు। ఘటపటాదులు సేయ క్రమమునగ
లుగు। పటుపరమాణ్వాది పంచశక్తులును। మును లేనియిజ్జగంబులు సృజి
యించె। దననిత్యపరమ స్వతంత్రత్వమువార। సలిలాలిమృద్దండ చక్రసూ
త్రములు। గలుగకులాలుండు గాకున్న నేమి। యలవడుదంతు ముఖ్యాది
హేతువులు। గలుగకులిందుడు గాకున్న నేమి। ఘటపటాదులు సేయగా నె
వ్వడైన। పటువుండ కాడె యభ్యాసైకశక్తి। యిలబరమాణువు లేనుశక్తు
లును। గలుగు నేనియు నివికారణంబేని। జగములు సేయ నీశ్వరుడేల మె
ల్లు। జగములు సేయంగ జాలడెయొరుడు। ననయంబు జగదాది కాతండ
యేల। యనియెదె కార్యంబులవి గారణములె। యరయగార్యములు బ్ర
హ్మాండసంఘములు। పరగుకారణములే పంచశక్తులును। వరుసకారణము
లు బరమాణుతతులు। బరగుకార్యంబులు బరమాణుతతులు। పరమకా
రణుడు మాపతియయ్యె నేని। బరమాణుశక్తుల శాశ్రీశ్వరునకు। నెలదా
ననిమెధా యువినదాశివుని। లీలలుగాకని జాలోకనంబు। జాలదె యాజ
గచ్ఛయము బుట్టింప। పాలింపసంహరింపంగ నెట్లనిన। నెరయనుగ్వేదా
దినిగమసూక్తములు। మెరయుసఊత్స్యె తెమేనులొకాంశ్చ। లోకపాలాం
శ్చనాలోలతనంత। బోకపఊత్స్యతేలో కొన్యజాయ। తియనంగ నీశ్వరు
దృష్టిమాత్రమున। నియతిఃనించిన నిఖలలోకములు। భగ్నంబునొందన
బ్రహ్మనవిష్ణు। నాగ్నేనమ్సార్యనానట్లువురాణ। మితితవోన్మెమనిమేషే
భ్యయనగ। యుతసమానము బ్రళీయోదయోయనగ। శివున్యగంచలతు
విశేషతదనర। తివిఃప్రత్యం జనాతిష్ఠంతినంయ। గాంత్యకాలేయన హరి
ముఖ్యదేవ। తాంత్యకాలంబున నాప్రమోఘాళి। బ్రణమితించిత్వం విశ్వభ
ర్తాయనంగ। ప్రణుతించితవనాస్తి భర్తాయునంగ। యంకించిత్వం విశ్వహ
ర్తాయునంగ। నంకించి తవనాస్తిహర్తాయనంగ। ష్రితిపక పవరుదోత్రీయు
నమరియు। రతినతినేక మేవాద్వైతమనియు। నింతియొక్కండ రుద్రిం
దుండనొంటి। రెండవవాడు లేకుండుట్టవిన వె। ఆదిబ్రత్యయమునకాగమం

చేసి। వేదవాదివయేని వేరనరాదు। ఆదిమహాసృష్టి మున్నె నవచందంబు
యిదిమహాప్రళయంబు గడియువిధంబు। గానయునాదులు గావులోకము
లు। గానదైవంబులు గావు వేదములు। భవుమహిమజను వు పాఠకుల్వాగ
డు। కవులుబ్రతిష్ఠించు కడిదితార్కికులు। గాదెల్లసకలజగత్ప్రపంచమునీ।
పాదించుచునునట్లు భవుజెప్పెగాన। వైదికాపాదితవ్రతులరక్షింప। వైదికే
తరశివవ్రతులశిక్షింప। గావివక్షితపేర్మి గలిగివేదములు। దైవత్వమెప్పు
డు దప్పదంచేని। దప్పేమివేదంబు దైవమేనియును। జెప్పుమా యొకదై
త్యుచె క్రమింగబడునె। తప్పేమివేదంబు దైవమేనియును। జెప్పుమా తమ
బ్రహ్మ శిరముగోల్పడునె। తప్పేమివేదంబు దైవమేనియును। జెప్పుమాద
క్షుని చేటుగన్గొనునె। తప్పేమివేదంబు దైవమేనియును। జెప్పుమా కవిత
లై జెప్పంగబడునె। దప్పేమివేదంబు దైవమేనియును। జెప్పుమా యొకప
క్షిచేబడిచనునె। దప్పేమివేదంబు దైవమేనియును। జెప్పుమా యొకముని
చె తెంపబడునె। తప్పేమివేదంబు దైవమేనియును। జెప్పుమా కుక్కలైశివు
వెన్కజనునె। వేదమెట్లును కర్త గాదయ్యెనేని। వేదోక్త కర్మనిపాదితఫల
ము। దానస్వర్గాపవర్గానూనఫలవి। తానముల్ బొందింపదా నెట్లు
నేచుర నని యెదాకర్తృత్వ మదికర్మమునకు। ననుమతించుటయ్యెసిద్ధాం
తమతేరిబు। గాదుకర్మమునకు గర్తృత్వసిద్ధి। లేదునివును వేదవాదివి గా
వు॥ వేదకర్మవాదిని పేరుదానింక। తరిదరికర్మవాదంబు నీమతము। ఘన

## కర్మవాదము

సూక్తమిదె స్వర్గకామోయజేత। యనుటదైవము చతుర్థ్యంతంబకాన।
తనకర్మఫలమది తానతత్కర్త। కనుభవయోగ్యమై యలరునంచేని। క
ర్మంబుకాయానుగతములుచనునో। కర్మానుగతమైనకాయంబుజనునొ।
కాయంబనాదియో కర్మంబనాది। యోయివిజీవికి నొక్కటయగునో। క్ష
ణికముచిత్తు నిర్గుణముకర్మంబు। గణుతింపనదియెట్లు గర్తవసించు। కర్త
యుజడుడు తత్కర్మవశుండు। కర్తింపదా నెట్లు కర్మంబుసేయు। తప్పుచేసి
నవాడు దండించికొనునె। తప్పునం కెలలయి తగులునో తాన। కలుగునో
వరగంగ గర్తయొక్కండు। నేవినట్లతత్కర్మ ఫలములుగుడుప। యాలనుక
ర్మానేశు డీశుండు కర్మ। ఫలదాతయొక్కండు గలిగియుండంగ। కర్తృత్వ

మున్నదె కర్మంబునకును। కర్తమహేశుండు కాకల్లవినుము। పూర్వమీ
మాంసోక్త భూరికర్మములు। వేర్వేరమున్నారు విధములైయుండు। భూ
సురంబుగఁజెప్ప బడుదర్శపూర్ణ। మానయజ్ఞాది కర్మంబులుసేయ। నొం
దుసంస్కార మొక్కొండుకర్త। నందించిపోవంగ నట్టిసంస్కార। రూపం
బులై ననిజాపూర్వములుని। రూపింపనాకు విశ్రుతిసూడియొకటి। బానరు
నామాంతర పూర్వమైనట్టి। ఘనపరమాపూర్వ మనగబుట్టించు। నలరె
దుదత్పర మాపూర్వవిహిత। ఫలకిరస్కంబై యి బరగుచున్నదియు। వను
పమంబగు దైవమనియునదృష్ట। మనియునుమరికర్మ మనియుఁజెప్పి। స
మరి తదీయనామమున గుఱింప। క్రమమున దేహాంతరమున లోకాంత।
రమునను దేశాంతరమున గాలాంత। రముననయ్యుపభోగ రచిత ఫలము
లు। దానిఖ్యానుట వ్యర్థముగాదె జడము। పైనకర్మములు గాలాంతరం
బునను। కలసియుదయుంత ఫలములీనెర। విలసిట్టిదైన బౌద్ధులకు బొట్టు
లకు। నొగిలపోదాన ధర్మోఫలాదు। లగుకర్మములుత్యర్థ వాదిమొట్టులనిన।
పుష్టియగుచునున్న భోజనక్రియల। దృష్టంబు చావుసిద్ధించెడిగాన। కను
గొన కేవల కర్మంబుఫలద। మనజనుసేని గ్రియామాత్రదనకు। పుష్టినిమర
ణంబు బుట్టింపనేల। దృష్టికరప్రాప్తి శిష్టాన్నవిషము। యిలజన్మమరణ
సంకులములీబట్టి। వెలయంగగర్మముల్ వేచనుచుండ। నాపోవ సర్వేశు
డక్కడక్కడను। నోపితత్కర్మాను రూఫితఫలము। హితబుద్ధిగావించు ని
టుగానసర్వ। గతుడుగర్మమునకు కర్తయొక్కండు। నధ్వరపతిరుద్రిడగు
టరాజౌన। మధ్వరస్వామునంగ నట్లునుగాక। యింద్రాయయనియును పేం
ద్రాయయనియు। జంద్రాయయనియును స్వాహాంతముగను। హవివెట్టు
గా భస్మమగుద్రవ్యములను। దవిలియపూర్వంబు దానెట్లుబుట్టు। నయ్యె
పూర్వంబు స్వర్గాదిఫలంబు। వెయ్యుపాయంబుల వేదింపనేర్చు। అవినే
రవేని కాలాంతరహీన। మవుసేనివరలోకి మనుట వ్యర్థంబె। యనియెదే
నియును గాలాంతరంబువనె। జనియెముక్తికిదండ్రి జంపిజంగుండు। బాలు
వధించియే కాలాంతరమున। లీలనీశ్వరు సిరియాలుండుగూడె। వినబ్రా
ణహత్యగావించి మాడటనె। జనియెను బొందితోడన చోడనృపతి। యరి
యమరాజు భూసురు జంపిమరియు। హరునిగర్భము జొచ్చెనట్లును గాక।

యనుచుంగకహం బ్రహ్మాస్మియను। వాక్యలిమిథ్యయగని వసజాగినిసి। కాల
భైరవుడన గణమొక్కరుండు। తప్పక బ్రహ్మమీఁదటి తలఁదునుము। నప్పుడ
హరుని నాజ్ఞానుకంబుననుం। నాకాంక్షనుతియించి హరుని మెప్పించి! చే
కొనిబీాచేత యాకకపాలంబు। ధరియించెఁ బరమాత్మ తత్కపాలంబు। ధర
బడ బ్రహ్మాండ తతికేశములంబు। పరిపూర్ణంబగునట్లు కారణైవకము। పర
మభట్టారక పరమకృపాబ్ధి। పరమస్వతంత్రి యక్షర పరమాత్మ। పరమే
శయన బ్రహ్మ ప్రార్ధన సేయ। భవుఁడు దాలిచె తత్కపాల మింతటనె। శివు
బ్రహ్మహత్య పసించె నేమరియు। ధృతిసామసూక్తి త్వం దేవేషునాగ। నతి
రతి బ్రహ్మణో స్యహామనవాది। నడరుత థ్యావెరాక్త మగు పురాణములు।
వడి బ్రాహ్మణో భగవాన్ రుద్రయనగ। మునుతత్త్రియః పరమో హరిర
నగ। నను వెలర్పపితామహాస్తు వైశ్యక్ష్య యనశూద్రజస్తు సహస్రదృక్క
నగ। మునుకొని మొల్లడ మురియుచు చెప్పు। నాగ బ్రాహ్మణుడయినను గ
దాయట్లు। నాగ నేటికి నలినజుడు బ్రాహ్మణుడౌ। నైనసా గాక యన్యా
యవర్తనుల। బూనిజంపిన రాజు బొందు నెహత్య। కర్మికర్మము చంపెగాని
శిక్షకుడు। కర్మి జంపిన పాపకర్మి గాండనగ। భట్టంబు ననెమొక్క పక్షం
బుగలుగ। నట్టున్న దేహాత్య యుదియునుగాక। రావణుజంపిన బ్రహ్మహ
త్యకును। భావలయంబున బుధులువిధింప। వరుడగున బ్రహ్మహత్యదోషం
బు। పరిహరింపగనొండుపాయంబులేక। నిష్ఠించి లింగ ప్రతిష్ఠలు జేసి। నిష్ఠ
మైశివుగొల్వ నిహితమానముచు। తివిరి రాముండు ప్రతిష్ఠలు సేయ। భువి
నిరామేశ్వరంబులు గల్గునట్లు। బ్రహ్మవధించిన బ్రహ్మహత్యకును। బ్రా
హ్మణుల్ విధియింప బరగనెండైన। శ్రీమహాదేవుడేష్టి దిజేసినట్టి। యామ
హాదేవేశ్వరాదులుగలవె। యిదియునుగాక పృటప్పటి కజుడు। మదనారి
చేతను మడియుటవినవె। జనచనదత్ప్రజాపతిశిరము। మునివినినాడు జెం
దని బ్రహ్మహత్య। తనకూతుగవయ పితామహుడు బొంది। తవరిన నాడు
బొందని బ్రహ్మహత్య। యమరదత్తుని యల్లుడగు జందు ద్రెంచ। జమరిన
నాడు తొలంచని బ్రహ్మహత్య। ననజభాదండి విష్వక్సేనుదుర్గిందు। తనరిన సా
డు చేరనిబ్రహ్మహత్య। కూడ బ్రాహ్మణులకు గురువైనయగ్ని। యేడు
జిహ్వాలుగోయు నెయిదని హవ్య। మునుభుసాధులఁగొట్టి మూపుగాగట్టి। కన

విచంపక గొందగాలేనిహత్య। యనుపమంబైన బ్రహ్మాండసంఘములు। జ
నుమహాశాస్త్రాల నశ్వాత్మములను। గోటానగోట్ల లలాటన త్రిప్పి।
బాటిమహాజగత్ప్రళయకాలమును। గుఱువుచ్చిపెట్టె నిన్నుమముగావింప।త
రిదరినాడు గొందని బ్రహ్మహత్య। యించి చతుర్ముఖు మీదటిశిరము। దెం
డెంచినంతటన పొందెన బ్రహ్మహత్య। యంగహీనుని జేసినంతన యట్టు।
లంగవారికి బ్రహ్మహత్య బాధించు। బ్రహ్మవచ్చినగాని బాధించుహత్య।
బ్రహ్మకిగాకరు పాపనాశనుని। బ్రహ్మాతుళక్రి తత్త్వములు దర్శింప । ధర
బ్రహ్మహత్యాయుతానిచయనగ। ధరబ్రహ్మహత్యలు దరియునామీద । శే
షంబునను విశేషించిదహత్య। శేషపాపానినాశకములు । నాయ
జాత్రితయః ఘోరాపాపనాశి। నీయనలింగనన్నిహితులజూడ। బ్రహ్మ
హత్యాదులు బాధింపవనిన। బ్రహ్మహత్యము కోశు బాధించెనట్లు।గా
నకర్మంబు శ్రీకంఠానుసారి। పూనితత్కర్మంబు బుద్ధ్యనుసారి। బుద్ధియునను
సారి భువిప్రవర్తకులు। కిద్ధరనటుగాన యాశుండకర్త॥ మొదలకాలాం

— కాలవాదము —

తరంబున జేసికర్త। కదియుకర్మంబున నట్టిదెకానియింక । కాలవాదివ
యన్నగానిమతంబు। కాలవశముపుణ్యకర్మసంభవము । కాలవశము జగ
త్కర్తకాలంబు। కాలవశముపాపకర్మసంభవము।కాలవశముకర్మగతఫ
లావాప్తి। కాలవశంబు జగత్ప్రవర్తనము। కాలవశము జగత్కార్యకార
ణము। కాలవశంబు జగత్సముత్పత్తి। కాలవశంబ జగద్వర్తనంబు । కా
లవశంబ జగత్ప్రళయంబు। కాలవశము రాజకముదైవికంబు। కాలవశమ
రవి గ్రహణాదికములు। కాలవశంబ సుఖంబు దుఃఖంబు। కాలవశము సరిక
ల్మియులేమి। కాలవశము త్రుటిక్షణమాత్రసంఖ్య । కాలవశంబ లగ్నము
ముహూర్తంబు। కాలవశము నవగ్రహబలాదులును। కాలవశంబసంక్రాం
తులుతిథులు। కాలవశంబనక్షత్రచారంబు। కాలవశముయోగకరణముల్
దలప। కాలవశమసర్వకాలవేళలను। కాలవశంబ స్వర్గమునరకంబు। కా
లవశంబ మోక్షంబు బంధంబు। కాలవశముగాని కార్యంబుగేలుగ । దే
లోకమునని మొదవేని వినుము। చలితంబునిత్యంబ చైతన్యముచిరి మిలని
ర్గుణంబునిస్థలమశరీర। క్షుణభంగురంబు దకాలంబునకును। గణుతింప

గానాది కర్తృత్వమెద్ది। తిరుగకయున్నారి ద్రిప్పంగఁగపాటి। తిరుగునో దవ
యురాత దిరుగునో ధరణి। దిరుగనియాకసుంబు ద్రిప్పగాలంబు। దిరుగునో త
సయుంత దిరుగునో మరియు। నాధారశక్తిని జాజ్ఞాప్రవర్తి। నాధారశిల
యుగా నటక్రిందనునిచి। కదలని మేరువు గంబంబు జేసి। గదియంగ గాల
చక్రంబు గీలించి। ఖరకిరుం దండంబుగా జేతబట్టి। తిరుగఁద్రిప్పెడు దేవు
డుండంగ। చనుజీవఘటకర్మ చక్రసూర్యేందు। వినుతబలీవర్ధ విభ్రమ
ణమున। గూడంగభవములఁ గొరలురావటము। మాడించుకర్త విశ్వా
ధికుడుండ। హరివిరించాది సురాసురనికర। పరికల్పితాయుష్య పరిమిత
రాశి। దొంతిగాదివిధియును దూమునగొలువ। కదునేర్పులోకైక కర్త
యీశ్వరుడు। హరుడు కాలాతీతు డభవుండు మోత। కరుడు మహాకాల
కాలుడకురుడు। కాలాత్మకుండడి కాలుడునిత్య। కాలస్వరూపుండు కాల
వశుండు। కాలచైతన్యుడు కాలాశ్రయుండు। కాలగళుండుండ కాలంబు
నకును। హరునియాజ్ఞాశక్తియనుటయుగాక। పరమకర్తృక మెద్ది పరికించి
చూడ। శ్రుతులుశతాయుః పురుషయనగాల। గతిమీరిసడిచిన గణము
లవినరె। కాలాగ్నికరుణ మార్కండేయుడాది। కాలమృత్యువు గెల్వ డే
లోకమెరుగ। మరియును సకలేశు మాదిరాజయ్య। మెరయడె కాలంబు
మీరి వెండియును। బాలు పైకృపనొక్క భక్తునివిగత। కాలుడై మనుపడె
కడగిమాదరను। ముసిడి కాడయ్యముస్ మొక్కినకన్య। ముసలిగాలము
నూంకి మనుపడే మరియు। ముసలిమ్రింగుడు కాలమునకోరగంటి। పసి
బాలుమనుపడే పరగన బెన్న। మొదలశల్యములైన ముదిత మన్పండె।
పిదపకాలమునూంకి బిళ్లైనారు। శ్రుతివిమానమునూంకి సుతు మనుపం
డె। యతికాలుడైన కక్కయ్యదామరియు। కాలంబుమీరిన గణమ్ములు
గలవు। కాలవంచకులైన గణములుగలరు। గావునగాలంబు కర్తయేనియు
ను। భావించితనయిచ్చ బరుపంగవలదె। తానలేమిటికిం లుంపంతి దైవలిఖి।
తానినాగాలస్వతంత్రంబు యెద్ది। యులరుచుముప్పది యారుతత్వముల। వె
లుపలలోపల వెలుగుశివాజ్ఞ। యందొక్కతత్వమై యలరుగాలమున। వెం
దునుకర్తృత్వ మేలసిద్ధించు। కాలంబనాది నిష్కళతత్వమనుట। కాలవ
శంబు లోకంబెల్లననుట। వలనుగాదిది కాలవాదిన స్మృట। తెలియువేదాం

తవాదివా కానమరియు॥ అనియొంటిమాయామతంబైన। వేదాంతమా
ర్గంబు వినుము వేదాంతి। అదియెట్టులనిన వేదాంతశాస్త్రంబు। హృదయ
నిశ్చయము నీవెరుగక భ్రమసి। దనరంబైజీవః శివః శివో జీవః। యనియదా
శివున విద్యాబుద్ధి జేసి। జ్ఞానహీనుడ పశూనామధిపతి। యానట్టి రుద్రప
శూనామధిపతి। యనగ పశుపతియె పశుమౌయనంగ। మును పశుపతయే
నమోనమ యనగ। పరగ బ్రహ్మాదయః పశవో యనంగ। ధర పశుపతయేన
మోనమ యనగ। పరగ బ్రహ్మాదయః పశవో యనంగ। ధరపశుపతి యట్ల
దాపశువగును। అంతమాధవ విరించాదికీటాంతపశువులకు నధిపతి
శివుడు। భావింపజీవులు పశువులు ప్రకృతి। యావ్యక్తంబగు హంశమట్లు
రెంటికిని। పశుపతిరుద్రుడనుశ్రుతి ప్రత్యయుంటు। పతిరుద్రుడితరులు పశు
వులుగాన। గోపతిచేత పాశోపేతుడైన। యాపశువులయట్ల యవిరలజీవు
లాశావిరహితులై యీశునియెడ। పాశమోచకమునొందు బంధముల్బా
సి। పశువులు పశువుల బంధింపవిడువ। కుశలులై పశుపతి కుశలుండుగాక।
శివుడు గాకధిపతి జీవరాసులకు। భవపాశములచేత బంధింపవిడువ। పశు
వులు పతికిని పరవర్తులెందు। పరవర్తులేయుండు పశువులన్యులకు। వానిరి
భవదుఃఖ వార్ధినిమగ్న। జీవరాసులు పరాశివుదయానూన। సంపదము
ఖ్యులై సాలోక్యముఖ్య। సంపూర్ణ పదవులు సరి వెల్గుచునికి। స్థిరపశుపతి
జ్ఞానముఖ్య। సరణియొ భవవార్ధి దరియించు త్రోవ। యెరుగంగబడు వస్తు వెరి
గెడు తాను। నెరుకయు సమమూడు తెరగులు భువిని। బరగియు బాధిత ప్రస
త్యయమగుచు। సరయనానాగతి సవగతంబగుట। హస్తామలకమొట్టులట్టు
ను సూత్ర। శస్త్రంగ ద్వైత సరణిసిద్ధముగ। తమకించి మరియు భేదము బల్క
దగును। ప్రమితిపండితము భేదమదర్శనంబు। భేదంబు సకలదృష్టాదృష్టము
తని। పాదిత వైదిక ప్రపదర్శనప్ర। భావసంపాదన ప్రతిభగల్గుటను। కావు
న భేదసంగతి సిద్ధముగుడు। వెనవిభేదక సిద్ధిదాగలుదు। పెనుపారగాదద్వ
భేదకసిద్ధి। గతిదప్పి వేదోక్త కర్తృలుండు। ఖతితత్త్వల ప్రవారాధ్యసంగతి
నింద్యుటుగాన యారాధ్యసైద్ధయార్యుడు। పటుభక్తియుక్తి దప్పకభజ
యింప। నాహోవప్యగ మాయాదివాఖ్యములు। భావింపుక ర్మానురూపం
బునందు। యిది వేదశాస్త్రవిహితమనతత్త్వ। విదితమార్గంబుండి విభ్రాం

తుకేల। ప్రత్యక్షమై జగద్భావభేదంబు। సత్యమై దోప దచ్ఛబ్దంబునందు।
ప్రత్యక్షబాధ చొప్పడుననినతడు। తత్యనుచితవృత్తి నద్వైతమతులు। నా
దిప్రపంచ మిథ్యత్వంబు చెప్ప వాదిదఱియ భావంబెర్గలేక। సరయమిద్యా
త్వమ నాశ్రయించెల్ల విరచింపదలపోయు దురభిమానమున। ప్రీతిమా
నముచె గృహీతముగాని। యాతత్త్వమెరుగుటయదిదుఘటంబు। మాన
గృహీతంబు దానుదథ్యంబు। గానదె దును మిథ్యగానేరదెట్లు। వృత్తి
నుత్తరశక్తి విజ్ఞానపదవి। వృత్తిమై చనుశక్తి వెండియుబోలె। యడగుజ
గద్భేద మనుచునద్వైతు। డలరంగదానెన్న దండ్రిదంచుఘటిని। సెక్కొ
ని నిర్వచనీయంబులేక। నిక్కము నిర్వచనీయంబు గలదె। నిర్వచనీయము
నీశ్వరచనియు। ముక్తినానద్వైత మొగిరెంటికగునె। కావునశివుడె తా
జీవుడన్యులుకు। భావింపనైక్య సంపాదనయగునె। శివుపకు భృత్యుండు జీ
వుండుగాన। భువివేఱుగాదన బొందగుగాక। భవబంధ మోక్షాను బాధి
తావస్థ। లవిగల్గజీవుడు శివుడనదగునె। పరమేశునకుజీవ పంక్తికిమేరు। ప
రమాణుసంగతాంతరము దోపంగ। దనకంటెనీశుండు దాలెండువేఱ।య
నువాండకాండె లోకాయతనుండు। తానెచూయియాశుంకు దనెర్గజాలు।గా
నియజ్ఞాపసంగతి ననువాది। జ్ఞానస్వరూపు డీశ్వరుడయ్యెనేని। దానద్దియ
జ్ఞానతమమనవలదె। వెలఁయుజీకటిలోన వెలయుదుగాని। కలదుదీపంబున
గానెట్లువచ్చు। మాతంయుమేయంబుమానంబుమిథ్య। భాతిగానసుటయే
పాఱిమాణ్యపథము। ఆత్మనాజగదుదయము జెప్పుచుండ। నాత్మ నిరాకా
రు డననెట్లువచ్చు। నతులసచ్చిత్కానసంద నర్వ। కేతనిత్యనిజనిరాకా
రుడీశ్వరుడు। ననుచు నారద్వైత మట్లకారణము। చెనసికల్పింతురు శివు
నకవిద్య। కలదనగానోపకయును లేదనియు। పలుకనేరకమూగ బధిగలు
క్రియను। పరగుభువనభిన్న భావంబుచూచి। యరయున ద్వైతుల మనగ
తావెద్ది। కర్మనాధీనంబు సర్వంబుగాని। సర్వేశునగుణి విచారిత వృత్తి।
సర్వంబుశివుడను శబ్దమాద్యోక్తి। నిర్వాహమొందంగ నేరదుగాక। స
ర్వేశునైశ్వర్య సన్నుతాద్వైత। ముక్తినర్వాద్వైతయుక్తికిజనునె। మా
నిసి దైవంబుగా నెట్లునేర్చు। దానెట్లుదైవంబు మానిసియగునె। తన్నెఱిం
గిననీకు దాసినస్సాక। దన్నెఱింగిన దాస దైవంబునగునె। కావునమాయా

ను గతమైనయట్టి। నీవేదవాదముల విలువు వేదాంతి। స్వామి భృత్యస్థితి
శంభునిగొలువు। కేమార్గమున గలియుంపదు ముక్తి। అన్యాయతరము పా
సైకకారణము। శూన్యానుకూలంబు మజనదూష్యంబు। గర్వాంధవృ
త్తి సత్కర్మేతరంబు। సర్వప్రమాణ విచారదూరంబు। నాచ్ఛాదితజ్ఞా
న తుచ్ఛమార్గంబు। ప్రచ్ఛన్నబౌద్ధంబు పరమనాస్తికము। నద్వైతమైన
మాయావాదమతము। విద్వద్విరుద్ధంబు వేదాంతమగునె। మొదల నీవే
దాంతమునకభిప్రాయ। మిదమిద్ధమని నిశ్చయింపంగలేవు। వేదాంతవిష
యవివేకంబునీకు। లేదుకించిత్సాంఖ్యాదిపూర్వకాని। కాదేని సాంఖ్యవా

## సాంఖ్యవాదం

దైకమతని। వాదనంబగు పూర్వపక్షంబువినుము। విశ్రుతంబజడజ స: వృత్తి
దానుఘ। ప్రకృతివాదంబు డెంపక ప్రధానంబు। జగదాది రాజస సాత్వి
క తామ। సగుణసామ్యావస్థ నంనిత్యరూప। మదియును నితరగుణాను
గృహీత। మొదవనైకైక గుణోద్రేకమునను। సకలప్రపంచంబు జనియిం
చుననుచు। ప్రకటించినీయుక్తి బలికెదువినుము। యొక్కొక్క గుణముల
క్లైక్కనేనియును। చక్కనజడుగుణ సామ్యంబుగాన। లేదు ప్రధానంబు
గాదు ప్రపంచ। మాదటదానిచె నట్లునుగాక। సరయ జగదూత్పపైప్ర
ధానంబు। బరిణమించినచోట బ్రాదశికతను। బరిణమించినయేని ధరన
శ్వరంబు। నరయుసావయవకార్యంబులైవచ్చు। గాన జగత్సృష్టి దానిచేము
న్నె। కానేరదట్లుగాకయు ప్రధానంబు। పరిపూర్ణరూపమై భ్రమితికి
మిగిలి। బరిణమించునయేని భావించిచూడ। నదియును నేకకార్యత్వప్ర
సంగ। మొదవుటసృష్టిగాదు భయంబునందు। కడగియతీత జగత్ప్రళయ
ముల। జెడిపోవవర్తింతు సృష్టియుగలదె। పరమాత్మపరమేశ భవ పరబ్ర
హ్మ। హరశివలింగ మహాదేవనాము। యుతదివ్యమూల ప్రకృతిసముద్భూ
త। కృతతత్ప్రమాయా ప్రకృతిజాడమగుచు। త్రిగుణసమన్వితంబగుచు
ప్రధాన। మగుచుగళాత్మికంబగుచునావికృతి। యవ్యక్తమది పురుషాధి
ష్ఠితంబు। దివ్యుందుశివుడు తదీయాజ్ఞ జేసి। గ్రోలుచు జేయు లోకంబులు
నాగ। బోలగుగాక బుద్ధిత్వమున్న దియు। సరిసచేతనమాట జడమాటసృష్టి।
ధరజేయనేర్చునె తనయంత ప్రకృతి। గావున దైవంబు గాదు తత్ప్రకృతి।

దానిముక్తి వ్రిదాతయుగాదుగాన। ప్రకృతివాద ప్రతిపాదకులైన। నిక్కృ
తి కార్యకులదుర్వ్యాప్తి వర్తుకాసు। తారుదు లెందను నిరీశ్వరసాంఖ్యమ
తము। పరతత్త్వబోధాను పాదితంబగునె। యపవర్గమంతన యమ్యునే
నియును। జపతపోధ్యానాది సత్క్రియలెల్ల। మునుకపిలుండను మునిము
ఖ్యమతము। మును లెఱుంగర సాంఖ్యమున కాదియగునె। శుకవామదేవ
సనకసనందనులు। సకలామరులుదొల్లి సాంఖ్యసమ్మతులె। సేశ్వరసాంఖ్య
నిరీశ్వరసాంఖ్య। సేశ్వరోక్తికి ప్రమాణము చూపగలవె। భువినను మా
నాది భూరిప్రమాణ। నివహంబులందెద్ది సేకాకారణము। సీకారణంబుల
నీప్రమాణముల। నేకానగు జగదీశ్వరత్వంబు। నిటయగ్నిలేకయు నగ
యువభావ్య। మిటునగాగ్రంబున నదిపొగగాదె। కలదు ధూమముమీ
ద గలుగంగనగ్ని। గలుగక్రిందటననగా నట్లువచ్చు। వెలయు జగంబులు
గలుగంగనట్లు। గలుగడీశ్వరుడనగా నట్లువచ్చు। మహానుమాన ప్రమా
ణంబునకాంక్ష। బహుమతంబులువన్ని పలికెదేనియును। నలరు భావ్యంబు
దానప్రసిద్ధంబు। గల్గుగునేనియును దాగాదుధూమంబు। పరగు ధూమం
బట్ల భావ్యంబువరల। నరయభావ్యమెకాక యదిధూమమగునె। జలము
లన్లిండమావుల దోపదవుల। జలములే యండమావులకాక యుఖియు
రొక్కనిపోల్కి వేరొక్కడుగలుగ। నొక్కచందమెకాకనొకడెయిర్వురు
ను। గిరితుదఘూమంబు క్రియదోచుభావ్య। మరయంగ ధూమమె యది
ధూమమేని। మునుధూమమునబుట్టి ఘనమేఘవితతి। పోనరి భావ్యంబు
నబుట్టంగగలదె। కానుధూమముమీద గానంగపడదు। తానట్లుగలుగు
క్రిందట నగ్ని యట్లుగలుగు క్రిందటనగ్ని యట్లు। గానజగంబులు గలుగంగ
శివుడు। దానట్లుగలుగు తథ్యంబుగావునను। మతినమమాన ప్రమాణం
బుతత్త్వ। గతికికారణములుగాక వెండియును। ప్రణుతింపనాకాశ గుణము
శబ్దంబు। గణుతింప శబ్దాత్మకం బాగమములు। నాయాగమములశబ్దార్థ
తిసుమహా। నీయతత్త్వంబెట్లు నెఱుగనెఱుగ। సాంగోక్తి [illegible]తుల తారతమ్య
తిప్పద్గ। [illegible] యాకత్వ[illegible]। తనమహాత్వము దాన తెవిలి
రూపించి [illegible] శివవ్యక్తి[illegible]తిని వహా ము
ల్పరము। శివతత్త్వబోధకం [illegible] ప్రమాణములె। కొనియదేనియును మా

యాంధకారంబు। వినిహతంబుగఁజేసి వినుముముక్తులకు। రమణ ననన్యశ
రణజనహృదయ। కమలస్థుఁడగుదన్ను గాన్పించుఁదయను। నవిచారితాగ
ము వివిధదీపములు। శివుఁడున్నాఁడిస్ఫురించుటఁజేసి। మానితంబగు నాగ
మప్రమాణంబు। తానూకఁబడదు తథ్యంబు వెండియును। తివిరియయ్యె వి
ధాత్రి దృష్టమైతోఁచు। నవియల్లనష్టంబులనుసూక్తి యునికి। ప్రత్యక్షము
గఁజూపఁబడు హేతువులును। నిత్యంబుగా మిన నిత్యాత్మ గాన్ప। ననుబంధ
మగునె ప్రత్యక్షప్రమాణ। మనియొదేనియును ప్రత్యక్షగోచరము। గాని
ప్రమాణముల్ గలవె ప్రమాణ। హీనమైచనుతత్త్వ మెందును గలదె। శ్రు
తిసదాపశ్యంతి సూరయోయనఁగ। ప్రతిసూరయోయత్ప్రి పశ్యతి యన
గ। చిత్రంబువారాణ సీయథాయనియు। ధాత్రినిత్యమురను సూత్రములు
నికి। తివిరియెయ్యెవిధాత్రి దృష్టమైతోఁచు। నవియల్లనష్టంబులన నెట్లువ
చ్చు। చెడియెడిరూపులె జడుఁగాక యందు। జెడనిరూపంబులు జెడునె వెం
డియును। జ్ఞానంబుధ్యానంబుయూతి। రైనివ్వాటిలతత్త్వ మదిమానసంబు।
యదియును హేతుదృష్టాంతరవిహీత। పదమేనియొరుక కుపాయమున్నది
యె। కడచన్నపసిడియు గల్లయుదూఁము। నెడసునక్షాంతరం బెరుఁగరా
కున్నె। యొప్పాటమెట్టిన కేసిసకోల। దప్పువె కోల భూధర సమానంబె।
యెడరుతత్త్వము దనయాత్మకు నెందు। బ్రడిసేయుశబ్దంబు బాడిగాదెట్లు।
హేత్వంతరములాద్యు లెన్న దేవరము। తత్త్వరూపిత వివిధ ప్రమాణము
ల। నట్టిదకాక ప్రత్యక్షప్రమాణ। మెట్టిదోవఁగవచ్చు నేవాదికైన। కాన
యీశుఁడు కర్తగాఁడనుపలుకు లోనిరీశ్వరసాంఖ్య యుడుగు వెండియును।
ఆదిమీఁకపిలోక్తమగు యోగమైన। నాదరణీయ్యమె యాద్యుల మతికి।
నిత్యనిరంజన నిజశుద్ధబుద్ధ। సత్యసనాతన సచ్చిదానంద। సగుణ కళాతీత
సర్వజ్ఞ శాంత। విగతదేహేంద్రియ విమలాత్మమూర్తి। రైయునణోరణీ
యాన్మహతోమహీ। యాయనఁగను మహేశుండు శివుఁడు। నానాత్మకంబు
లై దానాచరించు। గానియేకాత్మను గతములోకములు। నాది యింతయు
దానయగు బరిపూర్ణుఁడే ప్రాదేశికుండని పలుకంగదగునె। యనియదెని
యునిర్మలాత్మకుఁడెట్లు। తనువిడ్చి దుర్మలాత్మకులలోఁగలసె। విగతదేహేం
ద్రియ విషయాత్ముఁడెట్లు। దగిలి దేహేంద్రియాత్మకులలోఁగలసె। త్రిగుణర

హితుడగు దివ్యాత్ముడెట్లు। దగిలి దేహేంద్రియాత్మకులవోగలనె। త్రిగుణ
రహితుడగు దివ్యాత్ముడెట్లు। త్రిగుణాత్మకులలోన దీపింపబడియె। నిత్యా
త్మకు డెట్లు నిత్యులగలనె। సత్యాత్మకుండెట్లు సత్యులబెగనె। శాశ్వతుండె
ట్టుల శాశ్వతుఁడయ్యె। సకలజీవులదానయైయాత్మ యట్లు। సుఖదుఃఖము
లకు విశ్రాంతిగురియయ్యె। చావుబుట్టువులేని సర్వేశుడెట్లు। చావుబుట్టు
వుగల జీవుడై పరగె। సర్వకారణియ్యానసునిష్ఠి। కార్యంబు సాధారణార్థ
మైనఁగూడ। తవిలియీశ్వరుని చైతన్యంబకాక। శివుడుండనేకూడి జీవుల
నెల్ల। పూనిబొమ్మలవాడు బొమ్మలలోన। దానుండునెట్లు సూత్రమెయుం
డుగాక। పుడమిజీవులగూడి పుట్టునెయటుల। మడియనెపుట్టడు మడియ
డీశ్వరుడు। జలకుంభకోటుల వెలుగుజంద్రునకు। జలకుంభములు వడిగ
లుగునెపాట్లు। ఘటములలోనసంగమగుబయలు। ఘటములుభిన్నంబుగా
భిన్నమగునె। ముకురంజలనుదోచు మూర్తిదదీయ। ముకురప్రభలుజెడ్డ
మూర్తియుజెడునె। యవికల భూతాత్ముడైన యీశ్వరుడు। శివుడు సర్వ
ము జెడజెడునె యెందేని। జలములుగాద్భుచె జలియింపలోన। జలియించు
శశియట్ల సరేశ్వరుండు। మలుగక బహుజన్మ మరణదుఃఖముల। జలియిం
చుమతులలో జలియించునట్లు। జీవునిబొందునానావస్థలెల్ల। భావింపశివున
కు బ్రాప్తవ్యమగునె। కావునజీవులగలయందుశివుడు। జీవులుజీవుల శివు
డును శివుడు। స్వామియీశుడు భృత్యవర్గమేమనిన। సామిభృత్యన్యాయ
సత్క్రియారతుల। జ్ఞానదేహములను జలకుంభములను। జానొందశివుడె
ను శశిదోచుగాక। కలిగ్గినజలములగలుగునె శశియు। కలగినమనసుల గ
లుగునెశివుడు। మవినోదకంబుల బొలయుడు శశియు। మలినదేహములలో
న వెలుగండుశివుడు। దర్పణంబనిన యంతనజేసిమలిన। దర్పణంబునమూ
ర్తి దానెట్లుదోచు। జ్ఞానినేననుమాత్ర శంభుండుభక్తి। హీనుడై చనుక
ర్త్రి లోనెట్లుదోచు। మొదలజ్ఞానాదేవమోక్షనామోక్ష। పదము సిద్ధిం
పడు భక్తిహీనులకు। తాన్నృపతిజ్ఞానియైనయంతటనె। వాని బోధిచునె
కొలువనివానిన్నృపతి। ధరగజశాస్త్రవేత్తల కెట్లువచ్చు। వరయుగజధిరో
హణముసేయుంగ। కానసర్వాద్వైతకల్పితజ్ఞాన। మేనాటముక్తికిహేతు
వేతలప। యిలగొప్పియింతయు నీశుడెయనుట। విలసితజ్ఞానంబు కలి

మంకిఫలమొ। లైనసుశర్కరాండ యఖిలభూతములు। నైనవాండనియొసీయా
త్మలోఁగంటె। కన్న యంతనముక్తి గలుగనేర్చులుగ। కన్న యరక యుండ
యోగిదానగునె। జ్ఞానవైరాగ్యనిష్ఠానత్క్రియా వి। హీనమైచను యో
గమెందుముగలదె। యడయరుంగక క్రియలెరిగియుగిరిగి। యుడిగినపతితుం
డు యోగవంతుండా। నడిసన్నక్రియల కాశ్రయముగుదన్న। నుడుగక స
త్క్రియలుడుగంగ దగునె। యొడబడుసత్క్రియ లుడిగిదుర్విషయ। ము
డుగని పతితుండు యోగయుక్తుండా। రాగాంధుడధిక దుర్ణయుడు నాస్తి
కుడు। యోగియెముక్తి వియోగిగాకతడు। తన్నెరుంగడుశివుమున్నెర్గ యో
గి। తన్నెరింగినయోగి మున్నెరడీకు। జ్ఞానాత్ముడైన సమస్తంబును విడిచి।
మానకతన్నెర్గ మరుచునంతకును। నానావిషయభావ నాభ్రాంతి విడిచి।
మానకతన్నెర్గ మరుచునంతకును। నైనను గర్వాభిమానంబు లుడిగి।
మానకతన్నెర్గ మరచునంతకును। పూనిశివైక్య సౌఖ్యానందవిరతి। మా
నకదన్నెర్గ మరచునంతకును। సంతతక్రియలు నిజక్రీడలుడుగు। నంతకును
డిగిన యంతకుడలుగు। గానక్రియాఫలాకాంక్షవోవిడిచి। జానొందక్రియ
లపై జరియింపడేని। యవిరళనిరతిశయంబగుపరమ। శివయోగ సంపద
సిద్ధించునెట్లు। ప్రవిటితహంకార పరుడగుయోగి। సుకృత దుష్కృతకర్మ
సూదనుండగునో। యధికదుర్విషయాత్ము డగునట్టియోగి। విధినిషేధ క్రి
యావిరహితుండగునె। క్రచ్ఛరసుఖదుఃఖ గతుడగుయోగి। సచ్చిదానం
ద ప్రసన్నాత్ముడగునె। శివభక్తియుక్తివర్జితుడగుయోగి। భవపాశము
లుదెంప బలవంతుడగునె। కాలపాశావృతగతుడగుయోగి। కాలమృత్యు
వుగెల్వగాగరియగునె। భవరోగదుఃఖానుభవుడగుయోగి। శివయోగ
సుఖసముంచిత పుణ్యుడగునె! రాగాదిదుర్గుణ రాసివసించి। యోగిదాన
నుటధురుకంబకాదె। కావునసాంఖ్యయోగభ్రాంతివదలి। నీవద్వైవమన
ను నుర్గుణిసాంఖ్య। నీకునట్ల చార్వాకవాదికివి। నేకింపగాలేదు వేరుభేదం
బు। గావుననీవింక గావుసాంఖ్యుడవు। వారిచార్వాకవాదివిగాని॥ వె

చార్వాకవాదం

దవిరుద్ధమైవెలయుచార్వాక। వాదినీకర్తనంపాడవినుము। దేహంబయా
త్మగాకూహింపవేర। దేహంబులోనాత్మ తెల్లమున్నదిమో। తనువునం

దొకచోటు తరిగిచూచినను। తనువులో వెరతోచు నేయాత్మరూపు। యే
నొనల్లనివాఁడ నెఱ్ఱనివాఁడ। యేనిడ్డవాఁడను యేకుర్చవాఁడ। నను నెడనోడ
లికి యాత్మకొక్కింత। యును భేదమారయనున్న దెచూఁడ। యొగిభూజలా
గ్ని వాయుప్రభూతంబు। లగుచతుర్విధ పరమాణువులోడలు। నయ్యొడ
ల్లురి భస్మమైనను బుట్టు। డెయ్యెడనటుగాన యిలజావుముక్తి। గానవచ్చి
నయవిగలవు తథ్యంబు। గానంగ గానివి గలుగవెయ్యెడల। కరముసుఖం
బు స్వర్గంబు దుఃఖంబు। నరకంబు మరిలేదు పరలోకమనగ। బ్రాపించుమ
రిపుణ్య పాపము లైపు। యేపారనిజ్జగంబంతయు మిథ్య। గావునను త్పత్తిక
ర్త యు లేదు। దైవంబనగ మోక్షదాతయు లెండు। ననియ దేనియు విను మా
గమవిబుధ। జనవిరుద్ధుడవగు చార్వాకవాది। జడములై యుండవే సమసు
త్తతనువు। లొక్షల తానాత్మయై యుండు నేనియును। మృతశరీరంబు ని
ద్రించు శరీగ। గతికంతరంబెన్న గలుగు నేనియును। సంగంబువిడిచి య
య్యాత్మ యొండొండు। భంగిబిశాచమై బలివెండ జనునె। జనునట్టి నిదే
హజంతువుల్ కలుగు। ననియెదా తాహారి హారభట్టుయల్ల। రావినుండుడు
బ్రహ్మ రాక్షసప్రకృతి। నీ వెలుమనిబట్టి యేపుచున్నాఁడ। నాదియిట్టిదయని
యతని పైనూకి। వేదంబు చదువడె వెండడె భక్తి। యటుగాన దేహంబు
యాత్మయానేని। నిట నెట్లు జరియించు నిలనోడల్ సమయ। యొడలు విడు
వకుస్న నొడలితో యాత్మ। యొడబడ నిద్రించి యుండియు వేర। జన్న జా
గ్రత్వంబు స్వప్నంబు నెరుగు। చున్న దియాత్మయొ యొడలోవీక్షింప సం
డడినయ్యాత్మ జాగ్రత్క్రియాదు। లందును స్వప్నక్రియాదులయందు। న
లరి నిమిత్తంబులైన కర్మములు। దలయెత్త తత్కర్మ ఫలకాంక్ష నున్న।
భూతసూక్ష్మంబుల చేత నారబ్ధ। మైతన రెడునోడళ్లందవ్యాపించి। ఘనకర్మ
ఫలములా కాంక్షభోగింప। దనుబొందునాయాస జనితవిశ్రాంతి। మా
నంబు బ్రాపింప మసలుసుషుప్తి। దానిట్లు పరలోకయానవర్తనము। నా
త్మయు నొడలు వేరై యుండియుండ। దాత్మ చేతను వ్యాప్తమైన దేహం
బు। చెలియించునట్లు దొంచియు శరీరంబు। చెలియింప దాత్మయు చెలియిం
చుగాని యగ్ని చేతను వ్యాప్తమగు మడ్డుగాల్ప। నగ్నియొయిను మొ ధాహ
కమైనయదియు। దానటులయ్యు నాత్మ పజ్వాతములై నతద్దేహేంద్రియము

లాత్మశక్తి। కార్యాత్మకములుగాని కావవియు। కార్యాత్మకంబులుగా నేర
వెట్లు। యినుమునననగ్నియు నెనసినయట్లు । యినుమగ్నిగాదగ్ని యిను
మునుగాదు। ఆత్మయు దేహంబునటుగూడియున్న। నాత్మ దేహంబుగా దా
త్మగా దొడలు। కాన దేహంబున కంటెను వేర। కానాత్మయది ప్రసిద్ధంబ
ట్లుకాక। ఘటపటాదులు వేర కనియుండుగాదు। ఘటపటాదులకంటె గలు
గడయొకడు। తనువిట్టిదని వేర కనియెదునాత్మ। తనువునకంటెను దా వె
రకాన। యాత్మయు నాత్మ దేహంబును దేహ । మూత్మయునొడలు వేరై
యట్టులునికి। గలుగు దానుత్పత్తి కర్త్రయునొక్క। డలరారునొకని వే నఖి
లాండములును। వానితో బుట్టు జీవంబులవలస। బూనినానామతంబుల క్రి
యల దోచు। వసుపడ పుణ్యపాపంబులుగంతే। జనిపొందనరకంబు స్వర్గం
బు గలుగు। ననయంబు శివుమహాదాజ్ఞాప్రశక్తి। జను త్రిజగత్ప్రపంచం బట్ల
కాన। కానరానిదిగల్గు కానంగరాదు। గాననిమేరువు గలుగునకాన। యి
హపరంబులుగల్గు నిదియు వేదోక్త। యహితచార్వాక మన్యాయమార్గం
బు। కలికాలకలుషసంగత హేతువట్లు। వలదుసీ చార్వాక వాదంబులుమ
గు। గర్వాంధుడవు పాపగతుడవట్లయ్యు। చార్వాకవాదియసద్వాదరతు
డు। పాత్రేతరుండని ప్రచ్ఛన్న పాంచ। రాత్రవ్రతుండను క్రమము దోంచె
డిని। వేదోక్త సన్మార్గ విముఖమజాతి। భేదమూత్మేచ్ఛ మహాదేవనింద।
లఘుతరంబైన కళత్రసామాన్య। ముఖమూలమగు విషయావిరోధతయు,
ధరసీకు బాంచరాత్ర ప్రశస్తాత్ముకఖ। నరియయి యున్నది చనసట్లుగాక ॥

పాంచరాత్రవాదం

యోపంచరాత్ర వ్రతోపాదితోప। కాపి కాత్ముడవిను తద్వ్రతచర్య । ని
కృతాత్మ మాంతరాళికమనజనుట। ప్రకటితాగమ వేద బాహ్యమై తనరు,
నాదికర్మభ్రష్టులనుటనజాతి। భేదదోషంబు నిపాదితంబగును। అతులభవ
జ్వరాకృతజల్పులగుట। సతతంబు శివునిందసహజమైయుండు। ననయంబు
స్వేష్టశివార్చనావితతి। దనరు స్వేచ్ఛాప్రవర్తనము బాటిల్లు। నతుల లజ్జా
హీనులగుట దుష్టాన్న। మతినిగళత్ర సామాన్యత్వమమరు। జనితపో ధ్యా
న నిష్ఠాహీనులగుట। సువమింపదుష్పొందియోద్ధతిదొడరు । సమయాను
గతమగు చరితమిాచంద। మమకన్నందగు మోక్షమదియునట్టిదయు । కా

వృష తద్వ్రితి కర్త్రయైనట్టి। యావిష్ణుదైవత్వ మడియట్లవినుము। ఆదినీశ్వ
రుని వామాంగంబుచమట। శ్రీదయితుఁడుజనించిన తద్విధంబు। క్రచ్ఛర
భృగుశాపగతి పదిమార్లు। జచ్చుచుబుట్టుచు జనియించువిధము। అట్టితి
ర్యగ్యోను లందువసించి। ముట్టినభవదుఃఖ్యములబొందువిధము। శివమూ
ర్తిగానయ్యాయి యవతారములను। తవిలికొలుచుచు ధన్యతముఁడైన విధ
ము। యొడబడిబ్రహ్మకు నొకమాటబుట్టి। యుడరియధోక్షజుఁ డనమన్న వి
ధము। నతిదికిందాప్రినుజుం డనవట్లుగాక। యుదయించిదైత్యుల కోడినవి
ధము। వేయాలమరిబాద రాయణుడనగ। బోయతకడుపున బుట్టినవిధ
ము। ధర దేవకికిబుట్టి దాకృష్ణుడనగ। బరగిపాండవులకుపని సేయువిధము।
ధాత్రి వెండియును దత్తాత్రేయుడనగ। పుత్రుఁడై యత్రికి బుట్టిన విధము।
తగిలిదైత్యారి నాబొగడించుకొనుచు। నొగిజలంధరునకు నోడినవిధము। శి
వుమతద్దైత్యుద్రుంచిన చక్రమాది। భవమునశివుగొల్చి పడసినవిధము। ఆ
చక్రమదిదున్కకైపోవగాదు। ధీచికినల్గిదావైచినవిధము। నుపమన్యుశిష్యు
డై యుడురాజమౌళి। నపరమితప్రీతి నర్చించువిధము। భువిని వెయ్యేటికొ
క్క పువ్వుగుండినను। శివుగన్నువిచ్చి పూజించినవిధము। అవిరళభక్తి చ
కార్థియైమరియు। భవుగొల్చిచక్రంబు పడసినవిధము। వృడు మేషుమై
తాల్చి మెప్పించియొక్క। కొడుకుసాంబుఁడన బడసినవిధము। తనరిదూ
ర్వాసుండు తన్నినచోటి। మునుమచ్చయై వక్షమునమున్నవిధము। భ్రష్టు
డైరుక్మిణీ దన్నునుబండి। గట్టియాతడుఁదోలగా బారువిధము। అతని యు
చ్ఛిష్టపాయస లేపనమున। సతతదివ్యాంగుఁడై చరియించువిధము। ఛాయ
సంబరశాలు బూయనిచోటు। బోయబాణముదాకి పోలసినవిధము। బల
భద్రుడనమున్న బాసియొక్కండు। మలమలమరుగుచు మడిసినవిధము।
మునులశాపాహతి ముసలంబుచేత। ఘనయదుకులక్షయమగువిధము।
యరుగు డెందికిరీటి యపుడశౌర్ధంబు। పరగనారాయణబలిసేయువిధము।
పదియారువేల గొప్పస్త్రీలబట్టి। బోరలిచోరులు గొనిపోయినవిధము। వ
రశుశాపాఘాని భువిబాపలుగొన్న। శరధిపాలై మున్ను జచ్చిన విధము। ధ
రరాజ్యముప్పించి దశరథరాము। డరిగి పెరడవిపాలై యున్న విధము। శ

డుగూర్చు వనితగోల్పడి దైత్యుచేత। పడఁతలుగాఁగట్టబడినవిధంబు। వా
లిరావణుజంపి పడిబ్రహ్మహత్య। పాలయిధరచుట్టు భ్రమియించువిధము। ని
త్యరామేశ్వరు నిల్పియాబ్రహ్మ। హత్యాపహృతముగా నర్చించు విధము।
తరుణినమ్మక ప్రచ్చు తమ్మునిబంపి। సరయువులోఁబడి చచ్చినవిధము। హర
మైనతనదు మత్స్యావతారంబు। సురసింధుధరుతల చుట్టైనవిధము। హ
రమగుదనదు కూర్మావతారంబు। హరుహారమధ్యంబు నందున్నవిధము।
హరమైనదనదు వరాహదంష్ట్రంబు। సురగాంకుముంజేత నున్నవిధంబు।
హరమైననరశింహు నంచితాజినము। పరమేశ్వరునకు నంబరమైన విధ
ము। హరమైనత్రివిక్రమాఖ్యుదొలెమ్ము। హరుచేత ఖట్వాంగమై యున్న
విధము। అల్లజన్నమున నావహనీయశిఖ్ని। దెల్లంబుగా దలదెగిపడ్డవిధ
ము। మృగరూపధారియై పగబారలేక। యగపడి తలయునో నాడిన విధ
ము: నారశతనదు విష్వక్సేను దేహ। మారుదుశ్శూలంబు నందున్న విధ
ము। కలకేతుడై వచ్చి కామారిచేతి। బలుకఫాయరిబులోఁపలబడ్డవిధము।
యురులింగమూర్తి శ్రీచరణముల్ గాన। కరియంగజని వరాహంబైనవిధ
ము। యూహారనేఁటమాగునిజంప। వారింపజాలకవనరెడువిధము। కా
లుచువ్యాసుని కరమభ్రవిధి। దూలియాడగఁగూర్ప జాలనివిధము। నీవి
యాదిగా బార్వతీశు చేవిష్ణు। డవమానపడి గర్వమడగినవిధము। నదియు
న్నుగాక శ్రీరారామమునను। మదనారినిల్పి నమ్మణిగొల్చువిధము। రా
ఢిగోవిందేశ్వరునినిల్పిభక్తి। గూడద్వారావతి గొల్చినవిధము। చెలువా
ర వారణాసిని దనపేర। నిలిపివిశ్వేశ్వరు గొల్చినవిధము। పెంపారునింద్ర
నీలంపు లింగంబు। నింపారసజ్జయుం దిడికొల్చువిధము। వేయేలవిష్ణుండువి
శ్వేశ్వరునకు। బాయనిభక్తుడై భజియించువిధము। నుగాత్రిష్ణువే వెండియు
నునివ్విధమున। నిగ్రహానుగ్రహశక్తుడై శాజ్ఞ। భంగంబునొందుట ప
టుగర్వమడగి। సాంగంబుగాభక్తి సలిపినవిధము। వేదాగమపురాణ వివిధ
శాస్త్రసు। పాదితోక్తులజెప్పబడియెడుగాన। పవిత్రియంబొండేల పాంచ
రాత్రాద్య। సత్యవ్రతములమోక్షంబు చేకురునె। మానుగానీశ్వరుమహి
మకవిష్ణు। హీనతకునుద్దృష్టమిదియుతాగాదె। భువినిసత్యుండగు శివునిభ

జింప। శివకరంబగుముక్తి సిద్ధించుఁగాక। భరననిత్యుండగు హరిని భజింప।
చిరతరంబగుముక్తి సిద్ధించునెట్లు। కావునవిశ్రుత భాగవతాదులాది। గా
వువిముక్తి మార్గంబులుగావు। నీవు కేవలవిష్ణు నిజసమయుఁడవు। గావుఁబా
ధ్యుండవు నిక్కంబెట్టులనిన॥ పురములేర్చెదుసాదు పురహరునాజ్ఞ। హరి

## బౌద్ధవాదం

యు సాక్షాద్బుద్ధుఁడై యుండెగాన। జలజనాభునిదశ జన్మంబులందు। నిల
బౌద్ధజన్మంబు గలుగునగాక। దగుకూర్మవామన దానులుఁగలుగ। వాఁగి
బౌద్ధదాసి లేకుండఁబుగాన। సరిశ్రుతిబాహ్యంబు జైనబౌద్ధంబు। నరయ
గించి ద్వేదమంతియుకాన। పెండిబౌద్ధుఁడు వైష్ణవుండుమున్ వైష్ణవుండు
బౌద్ధుండుగావున వేయునేల। బౌద్ధుండవినుముని బౌద్ధంబుశ్రుతివి। రుద్ధం
బు భవపాశబద్ధంబుభువిని। షిద్ధంబుదుఃఖ సమృద్ధంబుపాప। బద్ధంబు
మున్న యబద్ధమెట్లనిన। కొరలుమనోమయ కోశంబులోన। మదితోంచు
విజ్ఞాన మయకోశమదియు। బుద్ధిదాక్షణికంబు బోఁవపోఁవపూర్వ। బుద్ధి
యందవగతి బొంగించుజీవ। సంతతివోలెను జనునుత్తరోత్త। రాంతరబు
ద్ధిదా నట్లుదయింపఁ। అరయుసంతతి రూపమైతోఁచుబుద్ధి। సరి నాత్మయా
శుద్ధి సంతతియందు। దులుకాదుక్షణిక చతుర్విధభావ। నలనొకానొక్క
జ్ఞానంబుసంధిల్లు। క్షణముక్తి సంగతమగునేని। క్షణభంగురయుము
క్తి కారణంబగునె। యొక్కఁడొక్కఁడయని పెక్కించివిూద। నొక్కఁడొ
క్కండయని లెక్కించివిూద। నొక్కఁడొక్కండను నొక్క రెండనుచు।
ముందటియొక్కండు మూఁడంచునిట్లు। ముందరెన్నగనెన్న మొగిచెడున
ట్లు। అరయునదీప్రవాహము పిఱుందుడుగ। భరితమైముందర బాఱుచు
న్నట్లు। వెలిగెడుదావాగ్ని వెనకయారంగ। కలయముందరసొంగి కాల్చు
చున్నట్లు। కనుగొనవిరచితాక్షర పఙ్క్తిజదువ। వెనకకత్రిత్తరిముంద రను
జాగునట్లు। ఖండింపకయు జాపకాయమైకాయ। పండ్లయిపండు నేర్పడబీ
జమయ్యు। బీజంబు మొలకమై పెరిగిముందటను। భ్రాజిల్లు వెనకరూపము
చెడునట్లు। ముందటనాత్మయు ముక్తిబొందంగ। నందండ వెనకయు న్యథు
గునంటేని। వడిబుట్టినిలిచిదా నడుగునంతటవు। సడిసన్నదక్షణ స్థాయిత్వ
మునను। క్షణవాదభంగంబు గాదెయాయుక్తి। ప్రణుతింపనెద్దియుత్పత్తి

క్షణంబు। యదివినాశక్షణ మగునేనియింక। జదువులేల అస్వవశగ్రస్తమై
న। తరిదరినేర్చునె దానుదయింప। మరియదిగాన్య క్షణంబు దానగునె।
తానును మొదలన దవిలినవిఘ్న। డైనసంతతియందు నొగోక క్షణము।
మోక్షంబుబొందిన యనుబొందుగాక । లక్షింపదనక గులాభమున్నది
యొ। నంచితశైవాగ మాదులమరియు। కించిద్గుణములు మిక్కిలిమిాన్రత
ములు। నవియుమాటలనె సత్యమునహింసయును। యివి నిజవ్రతములం
ద్రివియనులేవు। చంపిపెట్టినదిందు) చంపగాదందు)। చంప సహించుట
జంపుటగాదె। బొంకియీశ్వరుదందు) బొంకుగాదందు)। బొంకులలో పెద్ద
బొంకిదిగాదె। యన్నియీశ్వరుదు లేడందు)దానేల। యెన్నంగబుద్ధుండు
యిలగల్గుటెట్లు। క్షణభంగురంబగు కర్మంబుదాన। బ్రణుతింపతత్కర్మఫ
లముబొందించు। ననుటయుబౌద్ధుల కనుమతంబగుట। దనరియాబుద్ధుం
డుదైవమంటెద్ది। సంగతిదైవంబు శశివిషాణంబు। భంగి శూన్యంబంచు
బౌద్ధాదులాడి। విరచింపగా చతుర్వింశతితీర్థు। కరులుభూతాది త్రికా
లవర్తనులు। బిన్నడేబ్బాదడీ యిద్దరమునులు। మున్నశూన్యధ్యానము
లుశేయుచునికి। శమదమానుష్ఠాన జపతపోధ్యాన। యమనియమాదికా
ష్టాంగయోగాది। ధర్మకర్మఫలప్రదాతయవ్వండు। నిర్మించు గ్రియులకు ని
ర్వాహమేద్ది। తివిరియుత్పత్తిస్థితి విలయహేతు । వమునెదైవము శూన్య
మయ్యేనేనియును। తెలియనుత్పస్థితి లయహేతు। లిలగానియదిదైవమె
ట్లును కాదు। తలపోయశూన్యతత్వము గలయదియొ। తలపోయ సూన్య
తత్వము లేనియదియొ । కలదేని శూన్యంబు గాదె శూన్యంబు। కలుగదె
శూన్యంబు గలుగ దెట్లనిన । కలదేని శూన్యమన్ పలుకుదాబొంకు। క
లుగదె శూన్యమన్పలుకుదాబొంకు । గాన యహింసావిహీనులు సత్య।
హీనుగ్రియా ఫల హీనులు ధర్మ । హీనులు నిజదైవ హీనులు బుణ్య ।
హీనులునగు బౌద్ధజైనాదులకును। కలుగునె మోక్షవికస్వరసుఖము। తల
పోయబౌద్ధవాదంబుడుగుమంటి। బౌద్ధంబుతిరుతల బంటియులేదు। సిద్ధం
బుశైవప్రసిద్ధులకనిన। నరదొక్కలవమాత్రనగు జైనవాద। మ్మందెంతగా
నమాయామ్యలలోన। దేపరదాసయ్య భావజాంతకుడు। దైవంబనుచు
జైనతర్కబునూకి। దర్పమేర్పడఘట సర్వంబుదోడిగి। సర్వాంకునుత్త

రేశ్వరు బ్రతిష్ఠించి। పాసపరివట్రిల్ల పొట్లచెర్వునను। వసదులేణ్నూరును
వ్రచ్చిలైపించి। వెసజినప్రతిముల విటతాటమాడి। యెసగు నాడిజైను లె
క్కుడజనిరి। భావజాంతకుభక్తి పరుడు వేండియును। కోవూరిబ్రహ్మయ్య
నావీరగణము। పెర్కానిజైనుల పేరడగింప। తర్కంబునుదోడి ధాత్రిలో
పలను। మంత్రసిద్ధులమంచు మడియించిదహన మంత్రంబులందొక్క మ
్రరిగాల్చుడును। మంత్రంబులకురాజ మంత్రంబుమూల। మంత్రమనుష్ఠిం
చి మానితభక్తి। నడరంగ మునుభస్మమైయున్న మ్రరి। బడసికోవూరిలో
పలగలయట్టి। వసదులన్నియువ్రచ్చి వైపించెమహిమ। నెసగునాడీజైనులె
క్కుడజనిరి। అదియునుగాక యేకాంతరామయ్య। విదితభక్తిస్ఫూర్తివిలసి
తకీర్తి। నబ్బులూరను సముద్యన్మహానుహిమ। నబ్బుచుజైనుల నుక్కడ
గించి। యప్పురివసదినావాదిగానిల్వ। కప్పుడబడియెదు ననిశాపమిచ్చె। క
టకంబునందు ప్రఖ్యాతిగామరియు। పటుకీర్తి బండరు బసవన్నయలర। న
సమూంబకుజా దైవమని బ్రతిష్ఠించి। యెనగంగశిరమిచ్చి యొద్దినంబులకు।
వరలుచునప్పురి వాడవాడలను। మెరయుచునాడుచు మరియొందుశిరము।
బడసిజైనులనెల్ల భస్మంబుసేయు। నెడనాడుమీజైను లెక్కుడజనిరి॥ కృత
కృత్యపదివులిగెనువైజకవ్వ। పతిధిక్కరించి సద్భక్తిపెక్కువను। చనుదెం
చి చనుదెంచి చక్కనవసది। గనిభవాలయమని కరములు మొగుప। న
టజినప్రతిమరూపవ్రుడవ్రస్సి। పటపటవ్రక్కలైపడగమధ్యమున। వైజకవ్వ
యువికస్వరభక్తిమహిమ। వసవిజైనుండను వార్తయునడప। నెసగు వా
డీజైను లెక్కుడ జనిరి॥ మారుళిగెనుభక్తి మంథతుండ్డు మరియు। నారింగ
హిరియనాగయ్యగారగ। వీరావతారులుఃవీరులనంగ। వారంగపడమువ్వ
రసమానయశులు। వసిగొనిజైనుల వధియించుహిరియ। వసదిన శివుమ
హేశ్వరుబ్రతిష్ఠించి। యసమకీర్తి ప్రతిష్ఠాచార్యమహిమ। నెసగునాడీజై
లెక్కుడజనిరి॥ అదిగాక వెండియు నాదయ్యయనగ। మదనారిసద్భక్తి మ
తినుళిగరను। నసదులెతక్క నీశ్వరనివాసములు। వసదిజినుడుదక్క నెస
గులింగములు। జైనమునులుదక్క సద్భక్తవరులు। గానిరామికినిదుఃఖం
బుదోచుచును। చూడనక్కజమగు సురవాజున్నవసది। గూడ నాస్వామికి
గుడియన్నదగునా। పటపటబగులంగ చటచటబ్బాయ। పటుతరంబుగజిన

ప్రతిమమధ్యమున। శివుఁడుసౌరాష్ట్రంపు శ్రీసోమనాథుఁ డవికల్పవృత్తి నెన్న
డవతరించెడినా। పొందారతత్స్వయంభూలింగమూర్తి। యందముక్క-
న్న నొప్పగు చతుర్భుజము। నందివాహనమును నగజదాళటను। సుంద
రతరజటాజూటవిభ్రాతి। గరళముప్పసాకార కలితదివ్యాంగ। మరుదరుద
సదృశ దంతరంబునను। మున్నతంబగు తదికారులింగంబు। నెన్నడు
గందునో యెగన్నులార। వంతయుఁజింతయు వలవుసుసాలవు। నంతకంతకు
నెక్కుడయ్యె దానిట్లు। తొంబదియేడులు దొడిదొడిజనునె। సంబుందు
నాయర్థిఁ నలుపుడింకేన। బోదు శ్రీసౌరాష్ట్రమునకు సోమేశు। నాదటగొ
నివత్తు నట్లదర్శింతు। ననుమానమింకేల ననుచునాదయ్య ననజననొక్క-
రొజనుమ్మూర్తియంద। నతిసుఖనతివృద్ధు నతికృశాంగుండు। నతిబలహీ
నుండు నగుటగాజేసి। చరణముల్ వ్రయ్యంగ జానులువావ। కరతలాగ్ర
ములరక్తములు బింజింప। ఖరకరాతపసముత్కటతీవ్రనిహతి। పొరిబొరి
కన్నులబొమలు మూయంగ। వడుగెత్తరాకయు నడుగిడరాక। కడుగడు
ముందర గానరాకయును। చలమును నతిసాహసంబును గలిమి। దలరక
యాంబుమీద నయంబులిడుచు। తడదడదాఁకుచు దగులుచు మతికి। వడి
దెచ్చికొనుచు బోవకనిలుచుచును। వడవడవడుకుచు వ్రాలుచునట్లు। పడి
పడి లేచుచు పథము గన్పించి। చూచుచు బోవక చూచుచు నెదురు।
చూచుచుజనుచు రాయుచును గూయుచును। యోసోమలింగంబ యో
సోమలింగ। యోసోమ నాథయ్య యోయయ్య జియ్య। యోదేవదేవ
మహాదేవ యోయి। మాదేవ మాధవ మాధవ వినుత। అజహరీం
దాద్రిసాధ్య త్రిజగదారాధ్య। నిజభక్తసాన్నిధ్య నిష్ఠైకసాధ్య। గతసత
జనమూర్తిఁ కారుణ్యవర్తీ। సితకరకీర్తిసంచితదయాస్ఫూర్తి। గౌరీసనా
థ గోకాంతావరూధ। చారుప్రమథయూథ సౌరాష్ట్రనాథ। యనుచుఁగీ
ర్తింపుచు నట్లయేగంగ। ననఘుఁడాదయగారి యతిభక్తిరతికి। బాదలుశ్రీ
సౌరాష్ట్రపురవర్తీదాశు। డమరేగుదెంచిన సోమేశుడత్తణము। జనులు
జైనులును విస్మయమంద నంద। జినునిమధ్యంబు వెచ్చెర వ్రచ్చికొనుచు।
సాంగసాకార స్వయంభూప్రసన్న। లింగావతార మట్లంగీకరించి యంత

నాదయ్య కామ్యార్థముల్ సలిపి। యంతయుఁజింతయు నంతయుఁబాపి । సా
రక్షటాత్మపీఠణ సంజనితద। యారసామృత వార్ధినందోలలార్చి। జైన
కోలాహల శక్తియునవీశ। ఆనూనభక్తియు నవియుక్తినొసగ । నాజైన
మునుల నాదయ్యభజింప। నీజైనమునులు దారెక్కడజనిరి॥ మరిబిల్లన
యనారు మధురలోపలిను। తరిదరిజైనులు తల్లడంబంద । నెరిగూనిపాం
డ్యుడన్నిఖిలావనీశు। బోరుడువోయిన వీపుపొసుదువేజేసి। ప్రతిపక్షులగు
జైన బౌద్ధులతోడ। ప్రతియొగ్గిశివమంత్ర పత్రంబువ్రాసి। జినమంత్రపత్రం
బు మను జేసుచేత। పెనుపగుమంటలో బెట్టబంచుదును। సుసురదావా
గ్ని చోక్కారుగమర। పరమునజినమంత్రపత్రంబుగమర। వరసరోవరము
లో వనజాతమున్న। పరుసునశివమంత్ర పత్రమొప్పార । ధరజినమంత్రప
త్రంబును మరియు। బరువడిశివమంత్ర పత్రంబుగూర్చి। కావేరియుప్పొం
గ గానడుమనైవ। వావిరిజినలేఖ వరతిపాలయ్యె। శివమంత్ర లెఖ యచ్చె
రువువత్రెల్ల। భువినేటికెదురెక్క పారిబోరిబట్టి। కూడజైనుల నెల్ల కొర్రు
లెక్కించి। రూఢమైవసదులు రూపడగింప। నవియెలవేయుజైనాధికులెల్ల।
భువిలేక నాడెందు బోయిరిమరియు॥ అదిగాక నిడుమూరు డనుచోడనృప
తి। వెదకుచుదనయేలు విశ్వధరిత్రి। గలజైనమునుల నొక్కట బిలిపించి।
వలయుతర్కంబుల వారినోడించి। దవిలికాగినకొర్ర తలలుక్రిందుగను। త్రి
వియనాడెందేగితిగిమీరలెల్ల॥ వారకమరియును వాగీశనాయః। నారినిబ
ట్టించి నానావిధముల। జ్వాలనార్చులనునూక జాదంతికొగ్గ । జలమ్ములు
ముంప విసములుబ్రయోగింప। మహితపంచాక్షరీ మంత్రంబుచేత। దహ
నేభజలవిషోద్ధతి దర్పమడచి। యజ్జైనముఖ్యుల నందరుముంప। లజ్జలె దీ
మునుల్ నాడెందుసనిరి॥ ధరవెండియును శివార్థంబొక్కకొలను। సరిమిరి
త్రాండియన్ జాత్యంధుడర్థి। గావింపగావింప గడగివిఘ్నములు। గావిం
పగావింప గడుగడుసొలసి। పన్నగాంకునిచేత పటుభక్తి రెండు। కన్నులు
బడసి విఘ్నములాచరించు। జైనులకన్ను లక్షణమాత్రశెరుప। గానలెకీ
మునుల్ నాడెందుసనిరి॥ నమినందియును గణనాథుండుమరియు! ప్రమది
తభక్తి దీపములు నిత్యంబు। వేయేసిముట్టించి విశ్వేశుసేశు । బాయక రే

పరాత్పరతరో బ్రహ్మాయనంగ। స్తుతియత్పరాత్పరతో హరియనగ । దు
ద్దియత్పరాత్పరతో శివయనగ। వడిగొనుచుపనిష ద్వాక్యముల్ వినరె।
కొంకులేక శివఏకో ధ్యేయయనగ। శంకించియుండ శివంకరోయనగ । య
న్యసురార్చనం బర్హ మేసర్వ। మన్యత్పరిత్యాజ్య మనసట్లుగాక॥ అధ్వరప
తి శ్రుతులందు రాజాన। మధ్వరస్యయనగ నాంహ్వాయనకల। విహితోక్తి
గుదుర్రిందు హుతివహేయనగ। సహాయ హేశఫలాతివంకాళయనగ। సమ
రంగనిదమస్తు హవ్యంబనంగ। రమణయజ్ఞేశ్వరత్వమసినానేఃు। యవ్యా
జ్యమేల యజ్ఞేశ్వరోహవ్య। కవ్యసమస్త భోక్త వ్యయాత్మా ను । సంగరొ
రింగీ రొమఱుంగక పలుక। సాంగంబులగు నా యజ్ఞాదికర్మములు। వలరుచుప్ర
ధమ భాగాహ-స్య మనగ। గలడెప్రథమభాగ కర్తయొకండు। పూజ్యు
లుండంగనపూజ్యుల జెంద। పూజ్యమైక్రతువుదుర్బుద్ధిగాకమఖ। నాదక్షు
క్రతువునకాభిచారంబు। వేదంబులకుశక్తిలేదువిష్ణ్వాది। సురలకుమునుల
కు పరిభవంబుగను। వరమంత్రములఫలావాప్తులుదప్ప। పాషండులై భ
క్తి బాంహ్యులై యితర। వేషాద్యులై ముక్తి విముఖులై ధర్మ। విపరీత చ
రితులై ద్విజులుభ్రష్టులగను। శపియించియుమ్మునుల్ జన్నంబు వెడల। నిం
తవృత్తాంతంబు నెరిగియక్షణమ। యంతకాంతకుడు కోపాక్రాంతుడగు
చు। వీరావతారుని వీరభద్రేశు। ఘోరనృసింహ విదారణుబనుప । శ్రీ
వీరభద్ర గణావలిగొలువ। శ్రీవీరభద్రుడ జేయుడేతేర। త్వరిత దక్షాధ్వ
ర ధ్వ సనోద్యుక్త । పరిచితక్రోధ విస్ఫురితాభిజాత। నిటలతటానలోత్క
టచటులాగ్ని। పటలపరిస్ఫుటోద్భట విస్ఫులింగ । పటుపాతనమున నొ
క్కటజన్నసాల। నటుగూడదరికొని నార్చిభూతములు। తడయకయుచటి
హోతల్లదర్భ తాళ్లి। దొడగియూపంబులతో బంధించి। యుత్యాగ్రహ
మున నాహవనీయ్యాగారూ। పత్యదక్షిణనామ పరిమితాగ్నులను । అ
వృశంబైన యాగాశ్వంబుగంగ। నొవ్వైచి హల్లకల్లోలంబుసేయ। మలయు
చుభద్రరోమజగణపతులు। కలయహోమద్రవ్యములు నీటబుచ్చ। దలరి
సాధులను పదస్యులమునుల। నెలుకలనడచిన పోలువునడవ । విలగుల
స్త్రీలజారుల జేర్చినట్లు। వలిసుబ్బి దేవాంగ నాసాహస్రములు । తరిదరి
భూతభేతాళులు సెరువ। నరిమురివీరభద్రాధీశుడంత। పశుపాలకుండున్నై

వయ్యుతల్లడిల్ల। పశువులఁబోలినభంగి దేవతల । పొదిగొల్పి పరవుడు నదితి
నాసికము। మొదలస్వాహాంగన ముక్కుడాచన్న। శృతినాసికోద్రే
క్ష కృతసంబనగ। నతికోపితుఁడై సరస్వతిముక్కుగోసి। యజ్ఞదక్షుఁడగుయ
జ్ఞునిశిరము। యజ్ఞస్యశిరపినా నటుదెగవ్రేసి। నలిరేఁగిదంత వినాశ నో
యనగ। బలువిడిపూషునిపండ్లూడబొడిచి। శ్రుతులు వహ్నిహస్త గత
యనఁగోసి। ప్రఖ్యాతవహ్నిహస్తాలు నురుబాహాయుగము। బొడిచె భగునిక
న్నుఁ గుడమినల్లంత। బడభగనేత్ర నిహంతితో యనగ। సోము నంగుష్ఠేన
సోమాంగయనగ। భూమిపై బడవైచి ప్రామెపాదమున। నరిమిన జగ
దాది యగువిష్ణుశిరము। నెరిదదాహ్యావనీయ కేయనగ। ఆహవని
యాగ్ని నటుబడనేసి। మాహాత్మ్యముల రారమరియట్లుగాక। హరియు మేం
డ్రాది దేవాంగములఁగూడ ధరఁజెక్కడిగనంగ దక్షుఁ యనగ। త్ర్యక్షు
నిందించిన యతిపాపియనుచు। దక్షప్రజాపతి తలదెగవ్రేసి। యుద్రిక్త
మతివీర భద్రేశుడట్లు। విధ్వంసంబుగ జేసి విధిజేయుక్రతువు। నాతఁడుజేసి
న యజ్ఞఫలమున। నాతనికప్పుడ నాభిచారంబు। బ్రాపించెశివభక్త బా
హ్యుఁడైచేయు। నాపోవనెట్టిక్రియలు సాంగమగునె। ధరణీశుఁడేలేడ ధర
ణిలోనొక్క। నరుడుగర్వించి యన్యాయంబుసేయ। పరచుటదోసమే భ
వుడు దాసులను। పరచుటదోసమె భక్తమాలినను। హరివిరించాదులు స
టుదక్షుఁగూడి। పరిభవములఁబొంద ప్రాప్తమెట్లనిన। యిమ్ముసంగతి జే
సి యిలఁ బ్రాపకుండు। పకుగొనమథించ బడుగానహరుడు। దక్షుని సుర
లనుదండించెశివున। కీర్తి నిందయౌ యిలనట్లుగాక॥ అదిగాజేసిన యఖి
లాండకోట్ల। నాదరింపగచేర్ప వగునెయుండ్రేని। పశుపతిచే గట్టుబడిన జీ
వులను। పశుపతిచేముక్తి బడయంగలేక। ధరయల్లధూళిగా దగిలింప నే
గయు। పరిమాణవులనున్ని భవములుదోడరు। త్రాగివ మాతృకాస్త
న్యములన్నవ। సాగరోధకముల సంఖ్యముల్గడవ। అరుదగుదూష్ణకణాసిక
సంఖ్య। బరగుమరణములు ప్రాప్తములగాంగ। యుగకోట్లనవికలయో
గజన్మములు। కగపడిదుఃఖంబులందుచు నాత్మ। గుందుచుదలపుచు గందు
చుమతులు। వందుచునున్న జీవంబులజూచి। కటకటా భవదియ్య గతిబా
యుతేక। ఘటుతరంబగుముక్తి బడయంగలేక। కవిదిధుఃఖములగందెడి

గ దేయనుచు। మృడుడు జీవావలీయెడ గృపవుట్టి। పరగుండు సర్వజీవదయా
పరుండు। కరుణాకరుండును గాన జీవులకు। విరచించెలయము నివృత్తి కోల్ల
నిన। హరుడు ప్రళయలీల కభిముఖుండగుచు। ప్రమథులు రుద్రులు పరగు
భూతములు। సనుసుప్తి వేళ కుత్సవమందిహరుడు। ఫాలవిశాల కరాళ నే
త్రోద్ధ। కీలావళిస్ఫురత్కాలాగ్ని బర్వ। యిదిజగద్విప్లవ హేతువై తనర। న
దియు దానుఖ హేతులగు ప్రమథులకు। కుమ్మరివగదరి కోల్పినచిచ్చు। క్ర
మ్మరగడవలోకమ్ములు దాల్చు। విధమున బ్రహ్మాండ వివిధ భాండములు। న
డిగత ప్రళయ కాలాగ్ని చేగాల। చేకొనప్రళయాగ్ని శిఖలచేనఖిల। లోక
ముల్గాలు నాలోలాగ్నిలోన। నామహాప్రమథగణావళిచేర్చి। కౌముదిలో
నాడు గతినాడునంత। జడనిధి ద్వీపాద్రి సహితధరిత్రి। వడిమీదికెగరం
గ వైచియార్చుచును। మీదిలోకములతో మెంచు సాకసము। రాదిగుచు
క్రిందికి ప్రమథేందుడొకడు। బడబాగ్ని నుదుట బొట్టిడికొనియాడు। వె
డసోలుచును గణ విభుడొక్కరుండు। సకలవారాసుల జలములు ద్రావి।
యొకగణనాయకుం డొబ్బని త్రేన్చు। సకలగ్రహాది తారక సమూహం
బు। నొకగణనాయకుం డొగిబారనూదు। యేచియాద్యంబు లేదుచక్ర
ములు। వైచినగతిద్రిప్పి వైచునొక్కయ్య। యలరియమేంద్ర వాహనశృం
గదంత। ములుదాళము వేయు మున్నొక్కగణము। అల్కమృత్యువుకో
రలయి బెరిక్కత్రిప్పు। స్సుల్కముల్ ద్రిప్పునట్లొకగణేశ్వరుడు। యక్కరువ
విఘ్రనబ్భిశుబోర। దిక్కరులనుదిని త్రేన్చునొక్కయ్య। ధరహిమమేరు
మందర ముఖ్యగిరుల। వరగణంబులుసూడ వట్టియాడుదురు। సురగిరిము
ఖ్యాద్రులురు కేళి జేసి। యురువడిపొడి జేసి యూదునొక్కయ్య। పొదలి
యష్టభుజంగముల వ్రేళ్ల దాల్చు। నొదవముద్రికలుగా నొకగణాధిపుడు।
ఆదివరాహంబు నడచియాదంష్ట్ర। నాదటధరియించియాడునొక్కయ్య।
సరినాదిపృష్ఠ కూర్మముగాడబొడిచి। యురగేంద్రునిడి ద్రిప్పుచుండునొ
క్కయ్య। నరసింహులజడయు కేసరముఖ కంఠంబు। గిరిజపీఠంబుగా బరపునొ
క్కయ్య। గరుడనిపక్షముల్ శిరమున దాల్చు। సురమకుటాకృతి నొకగ
ణాధిపుడు। హిమకరరవిమండలము లద్దములు। క్రమమున నిదియాడుగ
ణనాథుడొకడు। సురముగా బ్రహ్మాండ మరచేత బట్టి। పరియలుగా వ్రేయు

ప్రమథేంద్రుఁడొకఁడు। యెడ ద్రివిక్రముని కోలెమ్ము దండముగ। గొడుగు
గా నిజపుచ్ఛ మేర్చునొక్కయ్య। నిండంగనగుతినజాండముల్ దాల్చు।
సండాభరణుఁడగ నలతునొక్కయ్య। గుర్వుగా గగళముశకులగిరుల్ దాల్చు।
పర్వతాభరణుఁడన్ ప్రమథేంద్రుఁడొకఁడు। భూరిప్రళయవేళ మేరువు నడ
చు। మేరుపాతనుఁడన మృడుగణంబొకఁడు। చరణముల్ కరములు బుజికో
ల్పి తాల్చు। హరివెనలసెబములరుత నొక్కయ్య। ఆరూఢిగా ప్రమథాధి
పులట్లు। పారకసర్వసంహారంబు సేయ। నొగి దేవదానవాది గణంబులడ
గి। గగనమెల్ల ప్రమథగణమయంబయ్యె। నాకములజ హరీ ద్రాది దేవత
ల। లోకముల్ ప్రమథుల లోకంబులయ్యె। ప్రమథాధిపతులిట్లు బ్రహ్మాండ
కోట్లు। సమసుప్తిఁ బొందించి సంతసంబునను। పోడిపొడివగుచునప్పుడయు
ట్టిగుజ్జు। పొడవౌచు వలవకామ గదునన్న మాను। నాడును బోవుచు నానం
దలీల। గ్రీడించు ప్రమథుల క్రియ యెట్టిదనిన॥ లంబోష్ఠలంబాష్ఠలంబనాశి
కులు। లంబజింహ్వాలబహు లంబకంధరులు। నజగజహయ వరాహ వ్యా
ఘ్రముఖులు। శరభసారంగ మార్జాలగోమహిష। కరిరిపు కరిపుగ్గోగ
మబహుముఖులు। బహువక్త్రబహునేత్ర బహుకర్ణవర్ణ। బహుబా
హుపాదబహుజానుతనులు। బాహూరుముఖముఖ బాహూరుతనులు। బా
హుజఠరదాను పాదోరుముఖులు। ద్విముఖచతుర్ముఖ ద్విముఖాష్టముఖులు।
నవముఖపంచముఖసహస్రాదిముఖులు। వెండియు వికృతవివిధరూపధరులు।
వెండియుజాగు వివిధరూపధరులు। పూనిస్తుతులు స్వర్గతేనచద్వ్యాశ్య। తే
నాగవిష్ణుగీర్తింపవెంకియును। అవునసంఖ్యాతా స్సహస్రిణియనగ। భువి
సేవమేతన్ని బోధతయనగ। అణుశశ్చమహాశశ్చ యనగను ప్రమథ। గణ
ములవర్ణి ప గారామితథ్య। మైనను శివపురాణాగమోక్తముగ । నానే
ర్పుభంగి వర్ణన చేసినాఁడ। రూఢి సీ ప్రమథగణాడంబరంబు। వేడుక జదివిన
వినినవ్రాసినను। దొరకొను శుభములు దురితంబులడగు । చిరభక్తి ము
క్తులు సిద్ధించునట్లి। అమితప్రతాపులౌ ప్రమథులచేత। సమసుప్తిఁ బొందిం
చు జగములీశ్వరుఁడు। తివిరియుత్పత్తి స్థితిలయకారణు। శివుఁడు పుట్టించు ర
క్షించు నడంచు। పుట్టించునప్పుడే పుణ్యమీశునకు। పట్టి భంజింపనే పాప
మీశునకు। జలములసన్న్యాది జంతువుల్ బొదలు। జలములసన్న్యాద జంతు

పుల్ మడియు। నిలతజ్జలంబుల కింతన జేసి। పలియించు నేపుణ్య పాపంబులిం
దు। నటుగావలీలార్థమై సృజియించు। నటుగానవిభ్రమ గాథఁ మటంచు।
యిదిహరునకునిఁదయె యిట్లుగాక। పొదలుతాండవమాడుపోల్కి యట్ల
నిన॥ జగదండకోట్లు భస్మముగతద్భ్యాతి। నగజారథరుడు సర్వాంగములఁ
బూసి। హరివిరించి పురోగమానురాస్థులను। నరకపాలానరుల్ వలయు
చోఁదాల్చి। భరతోక్తనానాప్రబంధగీతములు। భరతనందీశు లేర్పడ నను
గ్గడింప। రమణమై నందాభరణులండనికర। మధురమృదంగంబు లట్లవా
యింప। దలకొని షేరువాలనుల చేగిరుల। చెలగి యావజములు దైర్ఘ్యంప్రతు
లీప। నాకులాదుర్లు పర్వతాభరణేంద్రు। లేకళంబులంబు లక్లైలమి బూరిం
ప। రతిసుబ్బగుండా భరణులురుండముల। నతులితడిక్క్వాకాహళులట్లనూం
ద। నలరుచుహరిహారు లాడికూర్మాంగ। ములుపటుపడహవిస్ఫురణమ్రో
యింప। కాలభైగవులజ ఘనకపాలంబు। లోలితమ్మటముల లీలవిన్పింప।
కాలరుద్రులుఃహరి కోలెమ్ములెలమి। కోలాటకండలు కొమరున వ్రేయ।
నలరుతత్త్వముల తత్త్వాభరణేంద్రు। లిలజయఘంటలక్లైలమి వాయింప।
నేలయునింగియు కాలాంతకులును। తాలముల్ గామూర్చి తారువాయిం
ప। తగిల్చిరుదాంగనాతతులుద్వీతతి। నొగినప్తతాళంబు లోలివాయింప।
నతిలీల నమరాంగ నావలివట్లు। జతులునానాగీత జాతముల్ గాంగ। ఘ
నుజండ కీర్త్యాదులనునట్టి ఘుర్రులు। తనరార సింహనాదంబులు గాంగ।
భూతభేతాళాది భూరిఘోషణము। భాతిపద్బటుల నార్భటురావ ఘుగ
ను। నతులయుగాంత మహాప్రళయమున। గతజగత్త్రాండవకిళలకుఁజొచ్చి।
హరివెథవిరు దెసల దువాయింప। కరిదైత్యువ్రచ్చెదు గతినాడునాడు। బం
ధురలీలఁ బొప్పఁడసురల్ ఘొగడ। నంధకాసురుమొత్తి యాడెడునాడు। మతి
మునుల్ ఘంటిన మహితోరగంబు। గిరిగీటగాబట్టి క్రియనాడునాడు। వర
తపోనిష్ఠకు వ్యాఘ్రపాదునకు। నరుదొంద గరుణించియాడెడునాడు। క
డునర్థిగుండయ్య కడువలుజరవ। నడరువాద్యము జతి నాడెడునాడు। పిట్ట
వ్వాకైచేయు నెట్టిమైతట్టు। తట్టువాయింపుడు భరనాడునాడు। వలశ్రీచేర
మ చక్రవర్తి వాయింప। నలరి పూజావేళయందాడునాడు। అపోవకున్న
మహాప్రళయంబు। రూపించియాడంగ రుద్రుండుదొడగ। నాకేళియును

సయ్యాత్మ్యత లోకాంజ నయన । సంగవెండి యురగామ్నాయంబు సరి
దు। సాంగోక్తి చక్షుస యాదిత్యయనగ। మరిమనపళ్ళ్యంద్ర ఘ్రాయనవ్వర
ద। దరల వెండియు ముఖాద్వ్యచోయనంగ । నదిగాక నాసికాభ్యామను
సూక్తి। యదియపాణిద్వాయి రనసమసింప। నంవితంబంద శిశ్నాద్రే
తయనగ। నందుండి రేత సరూపోయనంగ। నమరపద్భ్యాంభూమియనిబ్ర
దేశాంత। రముదోలుశ్రుతియు శ్రోత్రాద్దిశాయనగ। ఆత్మానమాత్మనో
యనబాహ్కలమున। ఆత్మనయాకాశమున దదంగములు। శివునివీక్షణము
న జేసిజనించె। నవికలప్రకృతి బీజాష్టమూర్తులును। అటమున్న భవునిదృ
గంచలోద్భూత। పటుకృపామతివార్థిపై వెల్లివిరియు। హరుదుమున్ దాల్చి
న యజజనార్దనుల। చిరకపాలములకు చేతనంబొంది। రోలిగీర్తింప నం
దొక్కొక్కతలకు। శూలిబ్రహ్మత్వ విష్ణుత్వంబులొసగ। శ్రుతియత విష్ణో
ర్జనితనాగవిష్ణు। శతపత్రజులు శివజనితులై పరగి। సత్వరజోగుణైశ్వర్యా
నుపాల। నత్వంబులకువారు నాథులై రంత। భవుదుదొల్లిటియట్ల ప్రబలబ్ర
హ్మాండ। నివహముల్ గనుసన్న నియమించినట్టి। నిగ్రహానుగ్రహైదగ్రై
కగుణస। మగుడ్రై చనులింగ విగ్రహునకును। రమణనవ్య శరణ్యుడై
వెలుగు। ప్రమథులమహిమయు పటుపరాక్రమము। దనస్వతంత్రతయు ని
త్యతయునీశత్వ। మనుజరానందత్వమును నిరవద్య। మహిమయనన్యసా
మాన్యొరుశక్తి। బహుళతపెంపు చెప్పన శాకసృష్టి। లీలలుదాండవవేళలు
ప్రళయు। కాలముల్ మరియొక్క కార్యంబులెట్లు। గానయు నింద్వైతైక ప్ర
వర్తకిస। దానందమూర్తికి నతులకీర్తికిని। నిందెలెయివిమహనీయతల్
గాక। యిందు ధారణ ముఖాభీష్టవర్తనము। ఆరుటిలి వేదవేదాంత పురా
ణ। సకలాగమేతిహాస స్మృతితతుల। ప్రకటించుశబ్దానుపాదితార్థముల।
ప్రకటించియున్నట్లు బలికితిగాని। భక్తమదోద్రేక భావనబలుకు। యుక్త
లుగాకుండ నూహించుకొనుడు। ఘను మునల్లును గాక యుజాడుగృహామి।
యనబరశుంతపస్త మనగనెమ్మడు। బట్టుదుశివునకు ప్రతిశేరటంచు। నట్టిగా
కొందు ద్వైవములు గలయట్లు। లయినమూర్ధాభిషేకయనగబతివ్వ తేయ
నంగ దనతలదెగియదిగాన। గడ్డగికేశవుమీద గలడెలెండనుచు। వర్ధిన దై
వం కేశవాత్పరంబని బ్రాకసిగ చెయ్యెత్తి జక్కనవంగ। నాస్తంభితో భుజ

యున వ్యాసు చెయ్యి। దేగిబడ్డక్రియనంచు దేవుని మహిమ। జగములో నిష్టించె స్వరసిజభవుడు। చెనసి వ్యాసుదుదన చేయి దేగిఫలిస। గనుగొని వ్యాసాష్టకమునను తెంచి। రతినదైవం శంకరాత్వరంబనుచు। క్షితి బ్రతిష్టించె మా శివు మహాత్వంబు। గావున నేనును గౌరీశుమీద। దైవంబు లేండని దల యిచ్చిపడయు। దునుమద్దువట్టుదు దొడరినగెలుతు। పనుగొనవాథ జల్ప వితండములను, చెలగియిట్లను గాక శివుమీదనొకడు। కలడన్న నాయర కాలెత్తి వాని, నడుతలదన్నుదు నాదుప్రతిజ్ఞ। యొడపక యనుగాలెత్తి తిననుచు। మానుగాశ్రీరుదు మహిమయన్కృతిన। దానందుడగు శ్రీమహాదేవు మహిమ। యారూఢముగ మల్లికార్జునపండి। తారాధ్యులౌనన బ్రతిష్టించె। ధరనిదిసకల విద్వత్సభలందు। గరమొప్పు వాదప్రకరణ మనంగ॥ గురులింగశివకగో వరపుణ్యజాత। గుర్వులింగచరణాబ్జ పరిమళఘ్రాత। గురులింగచరణముకుర పరిస్ఫీత। గురులింగ గురుదయాంకుర శుభవాత। గురులింగదృక్సరో వర్ణజాతజాత। గురులింగకులమహీధర సింహపోత। గురులింగదివ్యమందిర పారిజాత। గురులింగనిర్మాల్య గోత్రసంపూత। గురులింగమంత్రావికుంఠితశ్రోత। గురులింగసేవాను గుణగణోపేత। వీనుల కింపుగా వినుసూరసావ। ధానతనిదియె వాదప్రకరణము॥

గద్య॥ ఇదియసంఖ్యాత మాహేశ్వరదివ్య। పదపద్మసౌరభ భ్రమరాయమాన। జంగమలింగ ప్రసాదోపభోగ। సంగతసుఖసుధా శరధినిమగ్న। సుకృతాత్మ పాలకురికి సోమనాథ। సుకవిప్రణీత భాసురతరదండ। నాయకబసవాంక సఖ్యాతగుణగ। ణాయతకీర్తి దిగంతత్రిలోక। గురుమల్లికార్జున చరితంబునందు। కరమర్థి వాదప్రకరణమొప్పారు॥



# విశ్వనాథాష్టకం.

గంగాతరంగ రమణీయజటాకలాపం గౌరీనిరంతర విభూషిత వామభాగమ్। నారాయణప్రియ మనంగమదాపహారం వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్॥ ౧॥ వాచామగోచర మనేక గుణస్వరూపం వాగీశ విష్ణు సురసేవిత పాదపీఠమ్। వామేన విగ్రహ వరేణకళత్రవంతం వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్॥ ౨॥ భూతాధిపం భుజగ భూషణ భూషితాంగం వ్యాఘ్రాజినాంబరధరం జటిలం త్రినేత్రమ్। పాశాంకుశాభయ వరప్రదశూలపాణిం వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్॥ ౩॥ శీతాంశు శోభిత కిరీట విరాజమానం ఫాలేక్షణానల విశోషిత పంచబాణమ్। నాగాధిపా రుచిర భాసుర కర్ణపూరం వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్॥ ౪॥ పంచాననం దురితమత్త మతంగజానాం నాగాంతకం దనుజపుంగవ పన్నగానామ్। దావానలం మరణశోక జరాటవీనాం వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్॥ ౫॥ తేజోమయం సగుణ నిర్గుణ మద్వితీయ మానందకంద మపరాజిత మప్రమేయమ్। నాగాత్మకం సకలనిష్కలమాత్మరూపం వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్॥ ౬॥ ఆశాం విహాయ పరిహృత్య పరస్యనిందాం పాపేరతించసునివార్య మనస్సమాధౌ। ఆదాయ హృత్కమల మధ్యగతం ప్రవేశం వారాణసీ పురపతిం భజవిశ్వనాథమ్॥ ౭॥ రాగాదిదోష రహితం స్వజనానురాగం వైరాగ్యశాంతినిలయం గిరిజాసహాయమ్। మాధుర్యధైర్యసుభగం గరళాభి రామం వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్॥ ౮॥ వారాణసీ పురపతే స్స్తవనంశివస్య వ్యాసోక్త మష్టకమిదం పఠతే మనుష్యః। విద్యాం శ్రియం విపులసౌఖ్య మనంత కీర్తిం సంప్రాప్య దేహవిలయే లభతేచ మోక్షమ్॥ ౯॥ వ్యాసాష్టక మిదంపుణ్యం యఃపఠేచ్ఛివసన్నిధౌ। శివలోకమవాప్నోతి శివేన సహ మోదతే॥ ౧౦॥

ఇతి శ్రీమద్వేదవ్యాస విరచితం విశ్వనాథాష్టకం
సంపూర్ణమ్.

శ్రీ గురవే నమః.

శుభమస్తు-అవిఘ్నమస్తు.

# పండితారాధ్యచరిత్ర.

## మహిమాప్రకరణము.

శ్రీమత్ప్రమథగణస్తోమ దయార । సామృతాబ్ధిసదావిహార సూ
రార్య॥ పండితారాధ్యుండు దండితవాది । ఖండనశాస్త్రి తర్కప్రౌఢి పే
ర్మి। నతుల పురాణేతిహాసాగమాను। గత నిజోద్భాసిత కలిత వాక్యము
ల। సకలవిధానంత శాఖోపనిషద । వికల తర్కస్మృతి విహితసూక్తులను।
శిష్టానుమత హేతు దృష్టాపసుప్రి । హృష్టప్రమాణసమీహితోక్తులను।
సంపాదనము సేయ సకలసమయులు। సొంపెద మల్లికార్జునుడు గావించు।
ప్రశ్నోత్తరముల కా బౌద్ధుండు దగిన। ప్రశ్నోత్తరంబు లాపాదింపలేక।
కనుగవమంటలు గ్రమ్మ దన్దాన। కొనికాలగూడ ముక్కున బొగ ల్వెడల।
దనువున జెమటయు దాపంబు దనర। మనసు గలంగ బొమ్మలు ముడివడ
గ। మొలకమీసల రోమములు నిల్వబడగ। గళము బిగియ నూరువులు
సందడింప। నురుకోపహతి పండ్లొం డొండగీట । గరములు శిరమును గ
డగడవడక। గటములుబొంగ మొగంబు గెంపెక్క। తటతట డెందం బద
ర నోష్ఠముగల। పలుకులు దొట్రిల పడగ నెంతయును । కలుషంబుమద
ము పెన్గర్వంబు దనర। నారూఢయగు మల్లికార్జున పండి।తారాధ్యు బర
సమయాభేద్యునాద్యు । నంచితపుణ్యు లోకైకవరేణ్యు । గ్రించుబౌద్ధుడు
ధిక్కరించి పల్కుచును। సందడించుచు సభాస్థలి వెలువడియె। వందుచు
గుందుచు వాదుకు దాను। అంత బండిత మల్లికార్జునయ్యయు । జితాం
తకుభక్తులు నతులిత ప్రతిభ। పరవాదినిరసన పటుమహత్వంబు। పరమే
శు మహిమానుపాలనత్వంబు। పరమతత్త్వ ప్రతిపాదనత్వంబు। కరుణాక
రత్వంబు ఘనతరభక్తి। సత్వంబు లోకగురుత్వంబు పండి। తత్వంబు వీ
రశ తగు తగు ననుచు। పౌరులు బుధులు నప్పాట గీర్తింప। నారూఢభ

కి సమగ్రత దన్నర। గ్రియగాన విజయలక్ష్మియు వీరలక్ష్మి। నియత మ
హిమలక్ష్మి నిజకీర్తి లక్ష్మి। యును దనవరవులై యురుకీర్తి సేయ। జను
దెంచిరపుడు నిజస్థానములకు। నంత విద్వజ్జను లంతంత నెరవి। చింతమై
జేతులు జెక్కిళ్ళనూది। కటకట బండితు గడువంగబలికె। నట మదోన్మ
త్తుడై యధమ బౌద్ధుండు। ఏమనితర్కించె నేమనియాడె। నేమనిపలి
కె దా నీపండితయ్య। నరుడె సాక్షాద్దక్షిణామూర్తిదాన। ధరబుట్టె మును
జగద్రక్షణార్థముగ। గాక యొడలుగొన్న యీ కారణమున। ప్రాకృత
పురుషుగా బండితవిభుని। నోవంగబలుకుట నుచ్చనేపోదు। పైవచ్చు నీ
విజృంభణ మట్లుగాక। తా మున్నె రుగడె యుత్సంవిత్తియనగ। భీమేశు
గద్యంబ పీఠికయైన। శ్లోకంబు దప్పుగా గైకొనివావ। దూకులుదాను ని
రాకరించుడును। వారణాసిని సాక్షిగోరి యాశ్లోక। మారంగగౌళ భట్టార
కుకడకు। పనుప యుత్సంవిత్తియనినశ్లోకాది।బొసరు నాల్గక్షరంబులకు భా
ష్యముగ। వెరవున నాలుగు వేల గ్రంథంబు। విరచించి కర్తగా హరుబ్రి
తిష్ఠించి। శేషాక్షరార్థ మగా శేషుడైననవి। శేషించి • యి ట్లని చెప్పి తే
డనుచు। ధీరుడు గౌళభట్టారకు కపోల। భూరియశుడు వ్రాసి పుత్తెంచె
దార। చదివి సిగ్గిడి తర్కజాలంబు లుడిగి। మదమేది బౌద్ధులు మడగరే
నాడు। మరియల దొరలేని మల్లికార్జునుని। దొరలు బో గెలువంగ మరి
గల్గెనింక। యెట్టుగానున్నదో యీ మహాపురుషు। దిట్టినఫలము సంధి
లకపోదనుచు। గొనకొన్ని పనుపంగ కొన్నిదినములు। జన మున్న మల్లి
కార్జును ధిక్కరించి। పలికె దానట బౌద్ధ పాపి తర్కమున। గెలువంగజా
లక యిల నట్లుగాక। మలయుచు దన సభామంటపంబునకు। బలిమి వట్రి
ల్లగా కొలని శ్రీచెన్న। మల్లికార్జున దీప మాలెగంబంబు। యెల్లవారును
జూడ నిది తగదనక। తప్పగుననక మీదట భారమనక। చొప్పుగాదనక
ది యుప్పరంబనక। యుక్తిగా దన కార్యులాడబడవనక। భక్తులువిన్న
జంపక తక్కరనక। దోషంబనక శివద్రోహం బనక వి। శేషించి లోకులు
జేకొనరనక। వ్రిచ్చి తెప్పించిన వాండచే వీని। చెచ్చెరచంపక చిక్కితి
మేని। యూహింప నాతడు ద్రోహియే మనము। ద్రోహులమ్మును నభ
క్తులముగాకనుచు। దట్టులై రేవయదేవయులపుడు। గట్టుగ్రలీల కంకణము

లుగట్టి। వర్షసలోడుత మున్నై వంగనున్న। సరుకంతయు నపుడా సయ్యా
ననమ్మి। పరు లెరుంగక యుండ బౌద్ధు నుక్కణచు। వెవతలంచుచు వె
ను వెంటదవులు। జన సముద్రాంతరస్థలి నొక్కలంక। దనరు బౌద్ధాలయ
మున కనుదినము। కొండొకప్రొద్దుండి కటిల బౌద్ధుండు। వెండి యే తెం
చిన విధము దామెరిగి। ఆసముద్రాంతరంబందుల వసది। వ్రాసిన నేలవో
వానికి ననుచు।వీరావతారులు శూరులే కాంగ। వీరులు మరునాటి వేవ
జామునను। సరసరలింగావసరము జెల్లించి। హరుబ్రసాదం బిరువురును
భోగించి। జను లెర్గకుండ బ్రచ్ఛన్న వేషముల। జని శివాచారం బఘున
వహిత్రముగ। తరిదరి వననిధుల్ దరియంగజొచ్చు। వరిమురి ముసిడి బౌ
ద్ధయ్య గజ్జేశు। మసనయ్యదాసయ్య మరి మొగివాడ। బసవయ్య గుండ
య్య ప్రభువు వాగీశ। నయనారియును నమినందియు బిళ్ల। నయనారుచే
రమ నంబిచోడంకు। గురుభక్తుడును కొండగుడి కేశిరాజు। ధరణివెండి
యు జలస్ఫురణ బొంగార్చి। పరగు భక్తుల పాదపద్మ స్మరణవి। హరణ కే
శిరతి నద్దరి కేగి। యప్పట బుద్ధాలయంబును జేరి। యొప్పింపుమాద్రో
హి నోడకుమింక। వెనుక నిక్కమకాశ యనుక్రియబుద్ధు। వెనుకదిక్కు
న బొంచికొనియున్న యడను। బౌద్ధుండుతొల్లింటి పగిదినవచ్చి। బుద్ధాల
యముజొచ్చి భువిజాగి మ్రొక్కి। పెడ పెడ నురుమని పిడుగులు వడిస।
వడుపునబడి వాని మెడ మెట్టిపట్టి। చెచ్చెరదద్ద్రోహి శివుదీపమాలె। వ్ర
చ్చినగతివాని వలిప్రొట్టవ్రచ్చి। భద్రుండు పూషుని పండ్లువోబొడుచు।
నుద్వృత్తి వాని పళ్ళూడంగ బొడిచి। రూఢి నావీరభద్రుండు పావకుని।
యేచుజిహ్వలు బెరికీడాడునట్లు। పండి తేంద్రుని గడవ బలికినపాల। సుండ
నాలుకజూపు చూపరాయనుచు। దరలక సెలవులుదరిగి యాకావ।లురు
రొమ్ము దొక్కినాలుక బెర్కివైచి। చెలగి చెండాడి ప్రేవులు స్వారిద్రోహి।
తలద్రెవ్వి బొట్టలోపల బెట్టిగట్టి। ఖలునుక్కడచియసంఖ్యాతమాహేశ్వ।
రులపంపనుచు లేఖ రొమ్మున బెట్టి। భావజహరుభక్త భద్రగజంబు। లా
వార్ధియటదిక్కు రేవునజొచ్చి। జగతిబిజ్జలుజంప చనుమల్లబ్రహ్మ। జ
గదేవవీరుల చరణాంబుజములు। దొడగి వేగేశ్వరు దుంచినయట్టి। యెడ
పడ రేచయ్య యంఘ్రిపద్మములు। సంకరకూచిభస్మము జేసినట్టి। జంకి దే

వునిగారి పాదపద్మములు। పగతుడైచను కోడి ప్రాణంబుగొన్న। నగరద
బ్రహ్మయ్య చరణాంబుజములు। వ్యాజనంతర సెట్టి వధియించినట్టి। రాజ
సబ్రహ్మ చరణ సరోజములు। ముళ్లబోయిన చుట్టు ముట్టాడినట్టి। బల్లిదు
బసవన్న పాదాంబుజములు। ప్రల్లదు బాడగని వరచుటకంటె। కల్లయ్య
రామయ్య ఘనపదాబ్జములు। మళరు నిద్రించిన మాకయగారి। కళిదస
రయగారి ఘనపదాబ్జములు। కరవాటసన్యాసి గడపినవిప్ర। వరు సర్వదేవు
నివరపదాబ్జములు। ప్రతినైమె సమయచక్రవర్తి దుంచి యను। మఱియుగు
వీరబ్రహ్మయ పదాబ్జములు। మరియును దోసాల మడయించినట్టి। న
రవీరగణముల నిజపదాబ్జములు। నాపదమోక్షికవచ్చి వాచారమిడిన। తేప
గారేవయ దేవయులరుగ। నంతనక్కడ బౌద్ధులపరాహ్ణవేళ।సంతతంబును
వచ్చు సమయంబునందు। రాకున్న శిష్యవర్గంబేగివసది। వాకిళ్లు దెరవ
మున్ వడపొందియున్న। యట్టిబౌద్ధుని ఖండితాంగంబుదలయు। నట్టయు
బొట్టయు నప్పుడవ్రచ్చి। నెత్తురువరదల నెరిదేలియాడ। నత్తరిగాంచి
హాయంచు నేడ్చుచును। వాయెత్తియరచుచు వారినారికిని। కూయుడు
చునువచ్చి కువలయేశునకు। వినుతింపనతిశోక వివశాత్ముడగుచు। జని
యిట్టిమరణంబు సమకూరుటెట్టు। లనుచు బరీక్షించి యారొమ్మ్ర లేఖ। గ
నుగొని పండితు కడముగాకనుచు। ధరణీశుడతనికి తగక్రియల్ జేసి। య
రుగుదెంచి ఘనకోపాటోపశిఖలు। నిండారకన్నుల నిప్పులుదుల్ల। బండి
తేందుని బిల్వ బంచి యక్షణమ। యసమానవిగ్రహం బవనీతియనక।
కసిమసంగుచు బిట్టుగని విజృంభించి। నిత్యమార్కండేయు నిటగించిక
న్న। మృత్యువు క్రియమిడ మిడమిడుకుచును। అంతకజయు శ్వేతు నల్లం
తగనిన। యంతకకరణి రోషాక్రాంతుడగుచు। శివుగణాధిపు దధీచిని గ
నుంగొనిన। క్షువునట్లు కలుషసంక్షుభితాత్ముడగుచు। ననఘు శాపాయు
త యజ్ఞుగౌతముని। గనిన దక్షునిగతిగ్రోధ్యాత్ముడగుచు। అవగతశ్రౌ
తుభట్టాచార్యగనిన। క్షపణేంద్రక్రియ మహోగ్ర క్రోధుడగుచు। న
ద్విచారవృత్తి మదాంధకారంబు। గవిసినకన్నుల గానకనృపతి। జనులు నీ
కుటిలవేషముజూచి మరులు। గొని పండితుండందు కొనియాడబోయి।
ననువిరవీగెడు నానావిధముల। మునువాదములనోడి ముడివడిలజ్జ। మన

నోపవేసీ విప్రుడయుదుగాన। చనునె విద్వత్త్వము సదసద్వివేకు। బ్రహ్మవం
శజు బౌద్ధపదపదాచార్యు। బ్రహ్మఘ్నుజంపింప బాడియేయనుచు। కరము
ల్గిమును వీరగణములాద్రోహి। బోరిగొనిప్రోవుచు బొందిపై నపుడు। వ
యిచిన చిగురాకు వడిబండితయ్యె। పయిపైచిచూడు నీపటుగర్వముడిగి।
యున ససంఖ్యాతుల యీనతిలేఖ। గనుగొని పౌరులక్కజమందిచూడ।
దలనెత్తుకొని నిజదరహాసరుచులు। దళుకొత్త ధరణీశ తత్కార్యధార। య
రుగుదుమనగరా దెరుగుముదీని। యెరుగననంగరా దెరుగుదునేన। య
గుదునుమాభక్తు లానతిగాన। గగనంబుపై బడ్డ గాదననేర। వాడెన్న
బడ్డశివద్రోహిగాన। వాండు వేదవిరుద్ధవర్తియౌగాన। జంపబంచిన
వాండ్లు జంపించినాడ। జంపినవాండ నజ్ఞముప్రోలికతని। నంపబంపినవాం
డ నంపించినాడ। నంపినవాండనే నాదునేనాదు। నతడునీకాచార్యు
డదినీకుధర్మ। మతనికల్గినవారి కలుగదండింప। నేనజంపితినని యెక్కొం
చికొనిన। దానబ్రాప్తుండ నీదండనకనుచు। ప్రకటితకోపాగ్ని పరితాపద
గ్ధ। సుకృతుండు వేలనాటిచోడడన్ పాపి। ధరబ్రాహ్మణో నహంతవ్య
యనంగ। కరమల్గిత ప్పెంతగల్గిననైన। యధమజాతుల బర్చునట్ల బ్రాహ్మ
ణుల। వధియింపరాదు భూపతికట్లుగాక। శిక్షింపదలచిర చేయుదురోలి।
నక్షిదండంబహా మట్లునుదగదు। అధికాపరాధియైనను ద్విజముఖ్యు। మ
ధమాంత్యమెవ్వడైనను శివభక్తు। డధికుడైనట్టి బ్రాహ్మణునివధించు। వ
ధకున సహాయండు వైదికన్యాయ। గతిశివసన్నిధి కారణంబునను। రతి
వేదశాస్త్ర పురాణసిద్ధాంత। మతమున జను వేదమార్గంబువిడిచి। గత
బుద్ధిబౌద్ధేంద్ర ఘాతకు డితడని। యనియక్షిదండనం బాచరింపంగ। బని
చిననృపతికి బండితుం డనియె॥— దైవమీశుడుగాడు ధరణిబుద్ధుండు। దై
వంబుబౌద్ధుల తగుముక్తి పరులు। అరంగవాదంబునం దోడియున్న। వా
రము మేము మీగురుడునుద్రోహి। గాదునిరపరాధి గట్టెల్కజంపి। నా
డనేనని యెయున్నది నీమనంబు। శివుడుదైవంబు ప్రసిద్ధమాటకును। శి
వభక్తిపరులు విశిష్టులాటకును। శివుమహాత్మ్యముమీద జెప్పనేటికిని। శి
వుధిక్కరించిన శివగునిద్రోహి। బౌద్ధేంద్రునోరున పాపంబుప్రిచ్చి। య
ద్ధరో విలివిలి యనిబాద్గుచున్న। పూర్వులపోక యిచ్చునినాక్షియతని। చా

వృమున్ సాక్షిదూషకుడు నొటకును । అతడు శివద్రోహియగుటకు మ
రియు । ధృతిపరదేశ్య స్వదేశులుసాక్షి । యెల్లెడలను వాదమే మోడమి
కిని। తొల్లిపారిన వాదదూషకులుసాక్షి । యెయ్యెండ నీప్రత్యయంబులు
మరచి। యెయ్యెడ నిన్ను నీవెఱుగక క్రొవ్వి। దండించెదవుయెట్లు ధరణీశ
యేను। దండించుకొనను తథ్యంబున్నవాడ। అట్టునుగాక చోద్యంబింకవి
నుము । ధట్టుండవై మమ్ము దండించెదేని । యక్షి దండనచాలునవలదిం
క । నీక్షితీశ్వరమాట లిన్నియునేల । చూడుముమ్మాటికి శూలిమహ
త్వ।మాడంబరము ప్రత్యయాడంబరంబు।హరుడు రుద్రుండు విశ్వాధికుండ
గుట । ధరశ్రుతుల్ దచ్ఛిరోధర్మనామ్రోయు । శిరముముమ్మాటికి ఛే
దింపబంప। శిరములు మొలవక చిక్కనేనియును । హరభక్తవరులు శి
ష్టాచారులగుట । నరుద్రొందదర్శనాత్తనగదర్శించు । కన్నులు ముమ్మా
టు గాద్రొరగింప । కన్నులెప్పటిక్రియ గల్గవేనియును । అరనిర్మాల్యసా
ఖ్యాన్మక్తియగుట । ధారయేత్తన ప్రసాదమునకుజాచు । కరములు ము
మ్మాటు గాదునుమింప । కరములంకురితముల్ గాకుండునేని। మునుశి
వార్చనపాశ మోచనంబగుట । దనరకాయోనచేత్తనాభజించు । గా
యంబు ముమ్మాటు గానరికింప। గాయమెప్పటియట్ల ఘటియింపదేని।యె
క్కడిదేవర యెక్కడిభక్తు । లెక్కడినిర్మాల్య మేటిపూజనము । బౌ
ద్ధులుఘనులు తత్ప్రథముదర్శనము। బుద్ధుండుదైవంబు భువినీవపతివి। య
దియదృష్టప్రత్యయము జూడమనుచు । మదినుబ్బిపండితమల్లికార్జును
డు। వనితలు బురుషులు వాడవాడలును। విని వెరగులుపడి వీక్షింపనేగు।
దెంచి లింగోద్భవు దేవుగోపురస। మంచితాభ్రంకష హర్మ్యాంగణమున।
గొలువున్నభక్తులకును సమస్తాంగ । ములుమోపి యందందముమ్మారు
మ్రొక్కి । చెలగుచుబోయివచ్చిన కార్యధార । నలిభక్తతతికి విన్నప
మాచరించి । యుద్యత్ప్రశస్తి లింగోద్భవుదేవు । గద్యంబుగా నెక్క గ।
ద్యంబుజెప్పి । దేవదేవేశునాదిమదివ్యలింగ । దేవులింగోద్భవ దేవునక్షు
ణము। చోద్యతరంబుగా స్తోత్రంబుచేసి। సద్యఃప్రసన్న భాస్వరశక్తి వడసి
మంగళలింగ నిర్మాల్యప్రసూన । సంగతోత్తంసోత్తమాంగ విభ్రముడు
సరసశివద్భక్తి సామ్రాజ్యరాజ్య। వరపట్టబద్ధభాస్వర ఫాలతలుడు। దరిహా

సచంద్రికాదామాభిరామ। వరకళాసంపూర్ణ వదనచంద్రుండు। వరవమ హిమాంకనోద్యత్సుధాస్కార । పరిపూర్ణ కుంభనిభశ్రోత్రయుగుడు। ఆనందబాష్పనిరంతరవర్ధమాననేత్రాబ్జ యుగ్మవికస్వరుండు। సరళసంస్థితదృగంచలసముద్భూత। కరుణామృతసిక్త గండస్థలుండు। స్ఫురితప్రసాద తాంబూలరాగాంశు। పరికీలితాధరభ్రాజమానుండు। సముచితసల్లాప సమయప్రకాశ। విమలదంతప్రభా విభ్రాజితుండు। మహిత పంచాక్షరీ మణిగణనికర। నిహితకరండసన్నిభరసజ్ఞుండు। సహజప్రసాదాస్య సన్మిళ్ళగంధ। రహితనాసావిహారప్రశస్తుండు। సముచితపూర్వావసర ధూపధూమ। కమనీయసౌరభ కలితాంబరుండు। అసమభస్మోద్ధూళితాంగ త్రిపుండ్ర। లసితరుద్రాక్షమాలా విభూషణుడు। ఆనతశిష్యగణాకీర్ణ భాస। మానాంఘ్రియుగ నఖామలముకురుండు। శరణార్తహృద్భృంగ సంస్థితాపాద। సరసీరుహుండయినన్ను తికెక్కి। క్రాలుచుండెడు మత్తగంధగజంబు। చాళినిల్చుండి యాసభ నిరీక్షించి। మొదల బ్రాహ్మణుడును మదినంత్యజుండు। మొదలుగా దద్బుద్ధ మునులు జైనులును। ధరణీశ్వరుండును దన్నియోగంబు। పురజనుల్ పరిజనుల్ బుధులు బండితులు। వాదులు తార్కికుల్ వరకవుల్ వేద। వాదులు యతులు విద్వాంసు లాదిగను। గంటిమి గాన మేముంటిమి లేము। వింటిమి వినమని వెనకనావలదు। వినుడు నాదుప్రతిజ్ఞ వీరువారనక। జనులెల్ల జూడుండు చక్కరమ్మనుచు। కరకంఠసద్భక్త గణనాథులకును। మరియు దొల్లిటియట్ల మహిజాగ్రిమొక్కి। ప్రమథ పురాతన భక్తదివ్యాంఘ్రి। కమలముల్ నిజమస్తకంబున జేర్చి। శ్రుతిపక ఏవరుద్రోయని మరియు। శ్రుతులు విశ్వాధికో రుద్రయనంగ। హరుడు రుద్రుండు విశ్వాధికుండగుట। కరయంగనిదియు ప్రత్యయముజూడుండు। భువి శ్రుతులను సర్వపూతోయనంగ। సవడినన్యాగ శిష్టానితియనగ। హరభక్తవరులు శిష్టాచారులగుట। కరయంగనిది యప్రత్యయముచూడుండు। అరయవీతాంతదస్యామయనంగ। సరిప్రసాదాన్మక్తి సంభవోయనగ। భవప్రసాదము ముక్తిపదవికి హేతు। వవుటకు నిద్దియ ప్రత్యయము చూడుండు। ధరణీశ్వరుడు మమ్ము దండించునపుడు। గరములు గాళ్ళును గళ్ళును శిరము। దున్నుమిష్టనరికిన దొలిచిన దరిగి। స

నుజాగుచును బెగ్గుచును తచ్చుచును మొ। లచుచు నుండఁగ యున్న లక్షిం
పగాళ। రచరణ నేత్ర శిరస్సమూహంబులను। బొదిర్చిన వాఁచినను రక్త
ముబ్బి। నను నరంబులుపొంగి నమదధంగములు। గ్రొక్కునవ్రణమైన గం
టుయుండినను। నుగ్రిక్కిన ముడిగిన బొగిలిన మొరగి। ననుభజింపము వల
గొనము గన్గొనము। మనసిజసంహరు మరియట్లు గాక। మ్రొక్షుము ము
క్కంటి యొుక్కయొ మేల। యక్కడ గొలువున్న యామసంఖ్యాత। మా
హేశ్వరులమను మాటలేలనుచు। మాహేశ్వరులకట్లు మఱియును మ్రొ
క్కి। మండలాధిప యనుమాన మింకేల। దండింపబంపు సాళలవరి జా
చి। మున్ను గన్నులు వ్రచ్చు ముమ్మాటునట్లు। గన్నులవచ్చె నాకడమ
నూడందు। యొక్కమాటైన రాకుండ సేనియును। నిక్కమొచూచెద నే
త్రి దండనము। మొదల్ల జేయుడని సముద్ధతి బలుక। బెదరుచు జను విభీ
తులై చూడ। గోరుగళ్ళను యామికుడు గొనిబార। శూరుండు మల్లికా
ర్జున పండితయ్య। పద్మాసనస్థుడై ప్రాణేశహృదయ। పద్మంబునందుంచి
పటుభక్తియుక్తి। నంజలీకృత కరకంజుడై నేత్ర। సంజనితానంద జలపూ

## స్తుతిశ్లోక పంచకము.

రమడర॥ శ్రీమల్లినాథాయ జితమన్మథాయ। సోమాంకజూటాయ శూ
లాయుధాయ। భస్మీకృతాఘాయ పరమేశ్వరాయ। తస్మైనమః శ్రీకు
ధరవల్లభాయ। శ్రీవీరభద్రాయ సింహాజినాయ। దేవాదిదేవాయ
తే సోమయాయ। విస్మేరదహనాక్ష విగతాధ్వరాయ। తస్మైనమః
శ్రీకుధరపాలనాయ। శ్రీవృషభేంద్రాయ శివవాహనాయ। శైవాగమపురా
ణ శాస్త్రాధిపాయ। తస్మైనమః శ్రీకుధరవందితాయ। ప్రమథాయరుద్రా
యభక్తిప్రదాయ। విమలాయనిత్యాయ విశ్వస్తుతాయ। భస్మాంగరాగా
య పాపాపహాయ। సస్మేరవదనాబ్జ కాంతోదయాయ। తస్మైనమః శ్రీకుధ
రపందితాయ॥ శ్రీదేశికేంద్రాయ శివసన్నిభాయ। వేదితాత్మీయ్యాయ వీ
రవ్రతాయ। సన్మతిశ్రుతి సదాచారాధిపాయ। తస్మైనమః శ్రీకుధరలోలు
పాయ॥ అనిహృదీశప్రమథాధీశ భక్త। జన నిజదేశికేశ్వరులకు మ్రొక్కి।
యామికుచేనున్న యాగొరుగంటి। పై మూలమంత్రోక్త భసితంబు జల్లి।
మఱిపుచ్చుకుని వేదమంత్రోక్తి మొన। కరకంత లింగోదకంబుల గడిగి। యు

నుషక్తి నాయ్యాక్రియావిధాతవ్య। యనుశ్రుతిమతమె శస్త్రార్పణ గాన। శ్రీ
మల్లికార్జున చెన్నయ్య దేవ। స్వామి మీ మహిమాభివర్ధనార్థముగ। గా
వించి ముష్కారు కన్నులనీవ। చేమట్టి పుచ్చవే శివుడ యన్నఁ। చె
నసిశివార్చనా చేతస్కుడగుచు। నెనరచక్షుర్భేదనో ద్యుక్తమతిని। వల
పటికి నెవంబువ్రాలి కుంభకము। నెలకొల్పి భుజములు నిట్రించి కంఠ॥
మోరసించి చనుటయును వదనంబు। పూరించి యున్మేషముగ నేత్రమొ
గ్గి। యనువుగా వామహస్తాంగుళంబులను। కనురెప్పలెత్తి సృక్కకయుం
డబట్టి। దండిగా యామ్యహస్తంబునగోరు। గొండివల్పలికంటి కొలికిలో
నిలిపి। యల్లనకంటిగుడ్డవయుకయుండ। మెల్లనచుట్టును మెరకి పెకల్చి।
పుచ్చికొల్కుల రంధ్రములు విడిపించి। క్రిచ్చరవామాంబకము నట్లపుచ్చి।
మసలకంబుజరాగమణులు భక్తులకు। నెసగంగనారతు లెత్తినయట్లు। ప
ళ్లెరంబుననిండి భక్తరాజికిని। వాల్లభ్య మొసగని వాళింపబంచి। జనులె
ల్లజూడ దాచక్షువుల్ రెండు। మను జేశుముందట మరిపెట్ట బనుప। నగవ
డె బగదనుకనుచు నేత్రములు। దగిలిచూచుచుతిరగ దానె త్రోచుచు
ను। నెట్టణ చోడడా నెత్తురునుదుటి బొట్టిడికొనుచు విభుత్వంబు మెర
య। నంతలోనన మల్లికార్జున విభున। కంతకాంతకుని మహాత్మ్యాతిశయ
త। నుదయించె నేత్రంబు లొండొంటి గడవ। గదిసె దొరికినపుండ్ల గం
ట్లునత్క్షణమ। పుచ్చిన కన్నుల బొందలమున్న। వచ్చుకీలాలప్రవాహం
బులుడిగి। పండితమల్లు విభ్రాజితనేత్ర। పుండరీకములిట్లు పొలుపారె నం
త। నద్భుతాకారాంతాత్ము లగుచు నానభను। తద్భక్తజనులు నుద్ధతి పం
డితేంద్రు। పాదాబ్జములు చిక్కబట్టి మ్రొక్కుచును। పాదరేణువు దల
పై జల్లుకొనుచు। నన్నుతి జేయుచు జన్నారకొత్రి।కన్నులు జూచుచు
గడుచిత్రమనుచు।గారవించుచు గేళికలు సేయుడనుచు।దారును గినియు
చు దాళగించుచును। పాడుచు నొసగులు వీడుచుగములు। గూడుచు స
లిరేంగి యాడుచు జేరి। చూడండు రండంచు జూడరోయనుచు। జేతులు
వీచుచు జెలగి యార్చుచును। బొబ్బలు వేయుచు పొంగుచు జెలగి। ద్రయు
బ్బుచు నందరు నుత్సహింపుచును। చాంగుబళాయంచు శరణంచు విర్రి
వీగుచు నృత్యుడాయనెంగుచు మంది। దొలగదూలుచు దోపుతోపులా

డుచును। తలలుదూఱిచికొంచు దఱియఁ జొచ్చుచును। యులివు వారించు
చు నొయ్యన జనుచు। బలువిడిఁ జొచ్చుచు త్రాయ నొత్తుచును। క్రిందుఁగు
నంబంచు కట్టల్కఁ గొనుచు। సందులు వెదకుచు జప్పరింపుచును। అలవా
డె రాజంచు నటవోకుడనుచు। కెలకులదారుచు గ్రేకడించుచును।
పుచ్చినకన్నులు పోలఁగన్గొనుచు। నచ్చెరువందుచు నల్లనముట్టి। ముట్టి
చూచుచు నట్లమొ్రక్కుచుపట్టి పట్టియొత్తుచు భయంపడి తొలంగుచు
ను। తొ్రక్కుడు ఘనమంచు తొలఁగినిల్చుచును। నిక్కిచూచుచు మిఱ్ఱె
క్కి చూచుచును। కలకలంబులకు డగ్గఱకయూరెడు। నిలువులమేడ
యు నెండిచూచుచును। అక్కడఁగాల్పట్ట కరుగుడెంచుచును। సుొ్రక్కు
చుకన్నుల జూడనుదగుచు। చిన్నబోయినరాజు చేరనోడుచును। వె
న్నంగి బండితుం డితరుడేయనుచు। కన్నులు పుచ్చుట కానడాయను
చు। నెన్నిమార్లైన దా నిట్లు కాకనుచు। మన్నింపదగునంచు మా
న్పడా యనుచు। బన్నపరపనోపు ప్రజనెల్లననుచు। నెంతగా నోపునో యీ
ట మీఁదననుచు। కంతుసంహారు డెఱుఁగు గాకేమియనుచు। సందడింపుచు
న్న జనుల వీక్షించి। మందస్మిత ముఖారవిందుఁడై యంత। నందం
ద హాస్తనయన సంజ్ఞలందు। మందియుల్వాడఁచి సమాధానపరచి। యార్జిత
పుణ్యాండ వార్జితయశుఁడు। తర్జితాఘుడు మల్లికార్జునస్వామి। యాగాఢ
తద్గోపురాంచితహర్మ్య। చారుతరోన్నత ద్వారోపకంఠ। నిరవధికస్థాప్య
నిజతనుస్తంభ। పరికల్పితాంబక పటుమణిద్వయుడు। సారసద్గురుదృగం
చలవినిర్సద్ధ। యారసపూరితా యతలసజ్జనిత। వరవీరభక్తి సద్భావనా
యుక్త। సరసద్వితీయ లోచనపద్మయుగుడు। మానితా సంఖ్యాత మా
హేశ్వరప్రీ: తానదివ్యశరీర ధామసంపూర్ణ। తరచంద్రికా నిరంతర పా
నసహిత। నరనుతనిజలోచన చకోరయుగుడు। చిరపూర్వ జన్మసంచిత
భూరికర్మ। పరద్రైన సేవానుపాదితకర్మ। వినియుక్తభవకర్మ వివశసమ
స్త్ర జనచయాంతర్బహిస్సంగతధ్వాంత। నిరసనాత్మీయ వినిద్రితనేత్ర
పరచితాఖండ దీపయుగుండునగుచు। స్ఫుటభక్తియుక్తి విభూతిఁ బీఁడియ
ము। లటుగూడ భక్తులు కర్పింపబంచి। జననాథు తత్సభా జనసంకులంబు

గనుగొని దరహాస కలితాత్ముడగుచు । మహనీయమగు శివు మహి
మాతిశయుత। మహిమెప్పు భక్తసమాజంబు ప్రతిభ। కంటిరే నేడు మీ
కన్నులారంగ। వింటిరే నేడు మా వీరాగ్రభాష। మనుజేశ నీ యనుమా
నంబు వాయ।జనులకు నెల్ల దృష్టప్రత్యయముగ। బుచ్చినకన్నులు భువినా
థు దేవు।డిచ్చిన కన్నులు నివె నీవు చూడ। మాంబాస యింక దొక్క మా
టికి జెల్లె। నీబొద్ధమునులును నీ నియోగంబు।సభయును నీవు నీసారియు
చూడు। డభినవంబగు బాస యదియట్టులనిన। ఆకన్ను పుచ్చుచు నీక
న్నుపుచ్చ। చేకొని లోనన యాకన్నువచ్చి। యాకన్ను మునుపుచ్చు
నంతలోపలన। యీకన్ను నప్పుడ రాకుండెనేని । యతి ప్రతిజ్ఞాభంగ
మందురు వినుడు। కదసిచూడుం డెరుగరే శివుమహిమ । పోడిగా నేత్ర
మంభోజనాభునకు। నా డిచ్చినశివుడు నవిసెనే నేడు। అదిగాక శివనాగమ
య్య కక్షములు। మొదల సిచ్చినశూలి ముదిసెనే నేడు। కన్నప్పగారికి క
న్నులక్షణము। మున్నిచ్చిన శివుండు ముడిగెనే నేడు। కాళిదాసునకు ము
న్కన్నులరాశి। లీల నిచ్చినస్వామి లేండె యీనేడు। అరకాలగన్ను ము
న్నక్షపాదునకు। నెరయనిచ్చినకర్త నిలిచెనే నేడు। శ్రీగిరీశ్వరుడంట శ్రీగిరి
యనుట। ఆగమోక్తంబు ప్రత్యక్షంబుగూడ। నయనాద్రియది మల్లినా
థదేవుండు। నయనాద్రినాథుండు నాసర్వజనులు। తడయక నేత్రముల్
ద్రివ్వితండములు। బడయుట యిచ్చుట ప్రఖ్యాతి గాదె। యిలగొల్లడై
న గొర్రెల కాచి కాచి। యలరుచు చేతి దుడ్డటుపారవైచి। యతగ నే
త్రము లిచ్చి యప్పుడబడసి। యరుగు గొర్రెల గాననంతవాడనిన। యి
తరులు జెప్పంగనేల శ్రీశైల। పతి మహాదాన సంపద యెట్లుజెప్ప । వే
యేలడాచినవిత్తుబీజంబు। బాయని రొంపుల బైళ్ళనుజల్లి। ఫలములందు
ట జగత్ప్రఖ్యాత మనిన। ఫలము దప్పనె శివార్పణవిధులందు। మహిన
ట్లుగాక బ్రాహ్మణులాదిగాగ। స్పృహం బరమేశ్వర ప్రీత్యర్థమనుచు । ని
తరసమయులైన నీశుగురించి। ధృతి దిలాజ్యాక్షతాదిద్రవ్యవితతి। సడిస
ననగ్నిల్లో జల్లినీరైన। వడిజలంబులుజల్లి వరతిపాలైన। బొందు దత్తత్ఫ
లంబులు దప్పకనిన। నెందుసాక్షాత్పరమేశుకని ని। వేదించు దత్క్రి
యా విర్భూతఫలము। వేదెసదప్పు నీయిల నెట్టులనిన। యెన్నంగమెట్టు

న కేసినకోల। మిన్నుజూచిసదృష్టు మేదిని నేయు। చేయిదప్పనెయట్ల
శివునిగురించి। చేయుసెంతలు దప్పెన యానిసూక్తి। బోనరి యత్యు
త్కటైః పుణ్యపాపైశ్చ। యన్న నిహైవఫలంబు నన విన్నరెట్లు। భువిను
త్కటంబగు పుణ్యపాపములు। శివుని నుద్దేశించు సెంతలుగాన। తలలీ
సుబూన్చిన దశవదనుండు। తలగంటినన్నట్టి తామరసజుడు। నంఘ్రిప
ద్మముగన్న వ్యాఘ్రపాదుండు। నంఘ్రిలేగనియొదవన్న విష్ణుండు। భవు
వినుతించిన పట్టబాణుండు। భవుని నిందించిన పాపి దక్షుండు।హరుడు దై
వంబన్న యక్షపాదుండు। హరుమీద గలడన్న యట్టివ్యాసుండు। అభ
వుదలంచిన గూర్వేతమునియు। నభవుదలంపమి యద్వైతమునులు।
పరమేశుగొలిచిన బాణాసురుండు। పరమేశుగొలువని బ్రహ్మసుతుండు।
తలపంగమిథ్యలే తమ పుణ్యపాప। ఫలములు బొందుట ప్రఖ్యాతిగాదె।
దేహాంతరమున బొందెడు దద్బలంబు। దేహంబుతోడ సంధిలు టద్దుగా
దె। సంద్యః ప్రసాదైక సక్తియుచాల। చోద్యమంతకుగు చోద్యంబుబా
స। పలికినట్లన జగత్ప్రత్యయదృష్టి। ఫలసిద్ధిబొందించు భజనగావునను।
వచ్చిన నేత్రంబు పుచ్చునేత్రంబు। పుచ్చునంతటనె దా వచ్చునేత్రంబు।
వచ్చులోన నెమరి పుచ్చినకన్ను। వచ్చెనే కన్నులు పుచ్చుటగాక। తడసి
నగుండెలు దలకిన బిగువు। సడలిన జనులకు సంశయంబైన। శంకించినను
మెయిగొంకిన మది ద। లంకిన బింకంబు పొంకంబు సెడిన। జడ్డుపడిన
వ్రేళ్ళుసడలినకంటి। గ్రుడ్డపిసిన గోరు గొండిపీగినను। చేతులు వడకిన
చెమట దోచినను। ధాతువుల్ చెదిరిన తాపాశ్రుకణము। లు విరిసనరము
లు బిగిసిన నూర్పు। లెవసిన కొలకుల నెరదోచినను। తప్పనాటిన రక్త
ధారలుబెగడు। గప్పినరెప్ప లీల్కరచిన డెంద। ముదరిన తలపులు బెద
రినచిత్త। మదరిన ముఖకాంతి నైదరినకన్ను। లిచ్చుట యిదియేమి యి
చ్చుట యదియు। వచ్చుట యిదియేటి వచ్చుటమున్న। పుచ్చుటదానే
మి పుచ్చుట మీరు। మెచ్చుట యిదియేమి మెచ్చుట యనుచు। నాస్థా
న మద్భుతంబందనిష్ఠించి। సుస్థితి మల్లికార్జున పండితయ్య। ముందటియ
ట్ల యుండంధ సద్భక్త। సందోహ పాదాభివందనుండగుచు। ప్రమథపు

రాతన భక్త దివ్యాంఘ్రి। కమలస్వకీయ హృత్కమలస్థుడగుచు। నవిర
ళనిర్గళి శయ్యానందజనిత। శివపదధ్యానైక చేతస్కుడగుచు। నుద్ధత త
చ్ఛిన మోహసౌఖ్యాను। బద్ధసమాధి సంపన్నాత్ముడగుచు। నతుల మ
హాద్భుతోద్యద్వీరభక్తి। యుతసమాహితమహిమోపేతుడగుచు। తచ్చ
క్షురస్త్రసంధానావధాన। మచ్చెరువుగ మున్ను పుచ్చినయట్లు। పుచ్చె క
న్నులు రెండు పుచ్చె దోడ్తోన। వచ్చె కన్నులు రెండు వచ్చుట జూచి।
పుచ్చబూనిన కన్ను బుచ్చియాకన్ను। బుచ్చులోనన మును పుచ్చినక
న్ను। వచ్చె గన్నిదె వచ్చె వచ్చె నానదియు। వచ్చులోననమరి పుచ్చిన
కన్ను। వచ్చెగన్నదె వచ్చె వచ్చెనా నట్లు। చెచ్చెర దడవగు చెప్పనకా
ని। తడ వింత లేదు నేత్రంబులరాక। కడుచిత్రమంచు నొక్కట నరుల్
వొగడ। నంత పండిత మల్లికార్జునస్వామి। యంతకాంత కుభక్తు లందం
ద యలర। నూత్నతద్గత దయానుగతలోచనసు। రత్నంబులను భక్తిర
త్నరత్నాద్రి। కడర నివాళిచ్చె నట్టి నేత్రములు। వడిభక్తతతికి నివాళిం
చబంచి। మున్ను వచ్చిన నేత్రములు వెన్క గ్రొత్త। కన్నులు రె
ట్టింపగా చోడడాత్మ। గలసి వచ్చుచు నున్న కన్నుల జూచి।
తొలుత నేత్రంబులు దొడితొడిజూచి। మున్ను వచ్చిన నేత్రములు వెన్క
గ్రొత్త। కన్నులగూడ దిర్గగద్రోచిచూచి। నప్పండితుని నయనాబ్జముల్
జూచు। తప్పకనాల్గునేత్రంబులుచూచు। తనుజూచుమరియు నేత్రంబు
లుచూచు। మనుజావళినిజూచు మరినేలజూచు। ధరదలవంపయ్యె ద
శకనిజూచు। పొరిగొనకీయుల్క బోదనిచూచు। బండితు గ్రొగంట బలు
మారుజూచు। వెండియునట్లతా వికలాత్ముడగుచు। నింతింతచోద్యం
బు నినుమదిలజ్జ। యంతకునిదియున్మద్రైకడ లేని। కోపంబుకారోష్ఠ తా
పంబుమనసు। పాపంబునదివజ్ర లేపంబుగాగ। ద్వేషంబుతొలిమేని దో
షంబుపూర్వ। రోషంబుదనక విశేషంబుగాంగ। క్రోధంబునధికాపరా
ధంబుగణవి। రోధంబుదనకు ప్రబోధంబుగాంగ। క్రూరతబాద్ధోపకా
రతమద్గవి। కారత దనకపకారతగాంగ। యోనంబున్యాయ విహీనంబు
దురభి। మానంబు దనకభిమానంబుగాంగ। వాదంబుకును మహాహ్లా
దంబుగత వి। పాదంబుదన కపవాదంబుగాంగ్య। కర్మంబుహతపర మ

ర్మంబనయ్యె। ధర్మంబుదనకావ్య ధర్మంబుగాంగ। తన్నుదామరచి మ
ద్రగస్థుడగుచు। భిన్నమనస్కుడై పృథ్వీశ్వరుండు। కన్నులు బుచ్చుట
గంటినిక్కముగ। కన్నులు వుచ్చుట గంటి తెల్లముగ। యిటమీాదనే
త్రంబు లీనోర్చుటకును। యెటమీాద రాకకు నదిదృష్టమిదియ। యి
మ్మాటునేత్రంబు లిచ్చినయతడు। ముమ్మాటునీగిరి మోసమేయనక।
వృషమిన్నపుడు బౌద్ధపుంగవు నలిగి। మడియించునాతని మడియింపలేం
డ। అడగింతు దండింతు ననుచుపాపమున। కొడిగట్టికొనుట యట్లాడ
గూడదయ్యె। దండించ బంపిన దండనంబదియు। మండనంబయ్యెనా
పండితయ్యకును। బండితయ్యనుబట్టి దండింపబనుచు। దండనన్నృపయ
శఃఖండనంబయ్యె। ననిరిత్తసడివచ్చె నవనిలోనాకు। విసజాలమదిమున్న
వీక్షింపజాల। భంగింతు పండితు భంగింతునిపుడ। దుర్గింతుదనునేన
దుర్గింతుబోవ। నటకార్యమైనట్టు లగుగాకయనుచు। కుటిలచిత్తుడు
యామికులదిక్కుజూచి। దండుపండితు తెండు తెండుయీక్షణమ। రెం
డుకన్నులు కేల కుండుపుచ్చుండు। పరవుండువలచిన భంగినింకేల। మ
దిచూచికొనియెద మల్లికార్జునిని। బత్తియు గిత్తియు పండితుపాలి। మి
త్తియు గిత్తియు మీాదరండనుచు। రప్పించినేత్రంబు లుప్పించిచాల। నె
ప్పించి జిల్లపాల్ దెప్పించినిండ। బోయించి చోడండు బోయెనక్షణమ।
పోయెనాతనిపాలి పుణ్యంబుదొలగి। కలగుచునంత నిక్కడిసభాసదులు।
కొల్వున్న భక్తులు గొబ్బునలేచి। శివశివయిటువలె సేయధర్మంబె। శి
వశివయిటువలె జెడునెచోడండు। తమనేత్రములుదామె దరితరిబుచ్చె।
దమకించి మదియేల దండింపబంచె। కన్నులుబుచ్చుట గానడేజడుడె। క
న్నుల్లువచ్చుట గానడేపడుచె। బాలుడేయెరుగడె భ్రమితుడే చూడ।
జాలమిగాక యసహ్యంబుగాక। కుటిలచిత్తుడుగాక కూళుడుగాక। యి
టువంటికర్మంబు లెందును గలవె। యిచ్చమైపరపంగ నితరులేవారు। నొ
చ్చెబోవునెవారి నొప్పింపదగునె। చోడడిదేశంబు సాదగొనవచ్చె। చో
డడుజెరుపంగ జూచెనీపురము। తనకులంబునకు గుద్దలితానుకొనియె।
తనకకాల్దుర్గంగ దలచె.చోడండు। వెలనాడువేళ్లకు వెకలింపదలచె।
వెలనాడుశాపాగ్ని వేష్టంగదలచె। కటకటాయింక నెక్కడిచోడనృపతి।

కటకటా యింక నెక్కడి వెలనాడు । యెక్కడ చోడని కెక్కడి రాజ్య । మ
క్కట వెలనాటి కెక్కడి బ్రతుకు । యొకచోట భూరించి యొకచోట వెం
రసి । యొకచోట ఘూర్ణిల్లి యొకచోట నుఱిమి । యొకచోట బడుపిడుగొక
చోటదూరు । నొకచోట బడు క్రియ నొండొండ బుట్టి । యెక్కడి సనద
పో తెక్కడి బొద్ధు । డెక్కడి ప్రతివాద మెక్కడి చోడ । డెక్కడి పండితు
డెక్కడి క్రోధ । మెక్కడ నుండెతా నెక్కడ బొడిచె । రాజున కాభిచార
ముగాక తక్క । డో జెల్ల యెంతగా నున్నదో యితని । పాలి దైవ మెఱుంగు
భావింప నితడు । బాలించు భూమియు పాడుగా నోపు । రూపింప ప్రత్యక్ష
రుద్రుండు గాన । యీ పండితయ్యదా నితరమర్త్యుండె । యన నేల వేయు
ప్రత్యక్షంబుగాదె । మన మెల్ల జూడమే మాట లేలిపుడు । యిందరు నెరు
గంగ నిను మారుకన్న । లందందపడియుడే యాడినయట్ల । ననుచు పండి
తమల్లికార్జునదేవు । వినుతింపుచుండిరి వినమితులగుచు । అంతనప్పు
డు పండితయ్య దత్సభయు । గంతుసంహారు భక్తగణములు వినగ । నస
మాన మహిమ మహాదేవ దేవ । వసుధనీ మహిమాభి వర్ధనార్థముగ । త
మవాగ్గియే మేని దండించుకొనగ । మనుజేశ్వరుండు దుర్మతి వేగపడియె ।
పాపియెఱుంగడు భక్తుల మహిమ । కోపి యెఱుగడు లోకగురుడ మీ మహి
మ । యిమ్మహిజనులిప్పుడిందరు జూడ । నిమ్మాటువరుసల నీశ మన్నె
త్రి । కంజంబులొండొంటి గడవమున్ వాగడ । పింజపింజగడవ పృథుర
యస్ఫూర్తి । పుచ్చుట యిచ్చుట భువి నెప్పనింక । నిచ్చుటనీకు మహి
మతగాదు । పశుపతి మీ భక్తి పరులు శాపాద । పిశరాదపియనంగ పెనుద్రో
హిందుంచు । నంతకు సాతని నతని వంశంబు । నంతకు పురమున కనుచునం
తకును । శ్రీకంఠ కన్నులిచ్చితి వేని యిపుడు । నీకు భక్తులయాన నీయాన
యట్ల । శ్రీకంఠ యేను నాశించితి నేని । నాకు భక్తులయాన నాథనీయాన ।
యస్మదీశ్వర యమరారామమునను । విస్మయంబని బౌద్ధవితతి గీర్తింప ।
పుడమి మర్త్యులు మహాద్భుతమని పొగడ । బడయుట మాకొప్పు బడయు
నేత్రములు । యెడనిడుదలుగాగ నిచ్చుటనీకు । కడు మెప్పునట్టుల గరు
ణింపవింక । నొండేల యీదురాత్ముండేలు భూమి । నుండగూడదు భక్తి
యుక్తులకనుచు । నా పండితయ్య భక్తాజ్ఞాపనముః । శాపోదకము లెత్తి జ

నులెల్ల వినగ। కాలకోలాహల కాలాగ్నిరుద్ర। కాలకాలాంతక కాలాప
హర। రుద్రరౌద్రాంగ విరూపాక్ష వీర।, భద్రముఖ్యాఖిల ప్రమథాధి
నాథ। సవినయసమయ విజ్ఞాపనాలాప। మవధరించుటకు మహాప్రసాదం
బు। మలహరమీకృపామాత్రంబుచేత। మలినసంభవుపుట్టు మాన్పిన
యట్లు। ఆదిదూర్వాసు శాపాద్భుతశక్తి। యాదవవంశక్షయంబైనయ
ట్లు। అక్షపాదుని మహావ్యాప్యశక్తి। దక్షాధ్వరంబు విధ్వంసమైన
ట్లు। యొనరదధీచి శాపోద్ధతిసచటి। మునులు దేవతలు నిర్మూలమైనట్లు।
పరువడివ్యాసుశాపమున విప్రులకు। స్మరహరమీభక్తి మాలినయట్లు।
తిరునావకరిశాప దృఢశక్తిద్రవిళ। ధరణిజైనమును బౌద్ధముద్రింగినట్లు।
పిళ్లనయనారు శపింపంగనట్లు। తొల్లిజైనులును బౌద్ధులుద్రింగినట్లు।సరి
నట్లునమినంది శపియింపనూరి। సురభులక్షణమని స్తుత్యమైనయట్లు। పొం
గియర్యమశాపమునను మహేంద్ర। మంగళాధిపుదును మడసినయట్లు।
అందుండిగిత్తాండి యతులశాపాను। సంభాసమున జైనులంధులైనట్లు।
అరయ నేకాంతరామయ్య శాపమున। సరినబ్బలూరివసదులుబడ్డట్లు। గు
డ్డవ్వశపియింప కష్టువహించు। దొడ్డభూసురులెల్ల ద్రుంగినయట్లు। ఘ
నుడుహావిన హాళ్లకల్లయ్యశాప। మున బాములాగ్రామమున జచ్చినట్లు।
వేయేలమనదండ నాయకబసవ। ధీయుతశాపప్రతిజ్ఞాప్రశక్తి। నెల్లవారు
నుజూడ నీనేలుకడయు। బల్లహుపీఠంబు పాడైనయట్లు। యాదసంఖ్యా
తమహేశ్వరోద్ధతస। మాయతక్రోధోత్కటానలచటుల। విరచితజ్వా
లలవెలనాటిచోడ। ధరణీతలేశ్వరాధమపతంగంబు। భస్మమయ్యెడును
తద్బంధులు సుతులు। విస్మయంబుగ నిపుడు భస్మమయ్యెదరు। యనిశా
పమిచ్చుచు నాపండితయ్య। యొనరంగమునుపుచ్చి యున్న నేత్రములు।
తివిరిలింగోద్భవ దేవదేవునకు। తవిలియర్పించు నేత్రంబులునాల్గు। ము
క్కంటియును దనముక్కన్నులలదు। ముక్కన్నుధరియించి చిక్కనక
న్ను। తమవామపాదార్పితంబైనతొంటి। కమలాక్షుకంటికి కవయుగా
ధ్యాన్యు। పాదంబునందు విభ్రమలీలదనర। నాదటధరియించు నపుడుపం
డితుడు। నిరపరాధులగాచు నిజదయాదృష్టి। వరభక్తి మెరయనై శ్వర్యై శ్వ
కదృష్టి। శరమల్లినృపుజూచు కదనుగ్రదృష్టి। శరణులగనుగొను సద్భ

క్తదృష్టి । నానొప్పునీదృష్టు నాల్గునీశ్వరుడు । పూనిధరించిన పోల్కయ
ట్లసిన । శశ్వద్దయాదృష్టి చంద్రాంబకమున । నైశ్వర్యదృష్టిసూర్యాంబకం
బునను । చటులోగ్రతరదృష్టి జ్వలనాంబకమున । పటుభక్తిదృష్టి నీపా
దంబునందు; ముక్కంటిదాల్చె నామునుదాల్చియున్న। యక్కన్నుగవ
లీశు డవధరించుడును । అనఘుండు గురుమల్లికార్జునుండంత। తనశిష్య
పుత్రమిత్రకళత్రసహిత। మరిగె శీఘ్రం బమరారామమునకు । బరమ
మహేశ్వరప్రకరంబు దాను। నరుగంగ నరుగంగ నంత నిక్కడను। పురి
మహోత్పాతముల్ పుట్టంగ దొడగె। పాడుపారగజొచ్చె పట్టణంబెల్ల।
చోడందు తలలేని నీడ గన్గొనియె। కాలుని గలలోన గనియె శ్వానము
లు। మోలగింపగజొచ్చె రేలుపగళ్ళు। వీక కావిరివెల్లివిరిసె గుఱ్ఱముల।
తోకలనిప్పులు దొరగంగ దొడగె। నేలగాలగజొచ్చె నింగిపడ్డట్టు। చాళి
మేఘంబులు సన్నమైపర్వె। పవలుచుక్కలు గానబడియె ధూమంబు।
గలిసె నెల్లెడ వంటకంబులు పుచ్చె। భూకంప మధిక మద్భుతమయ్యె
పవలు। నాకంపరావమద్భుతమయ్యె రాత్రి॥ కాక కౌశికజంబుకములర్వ
దొణగె। గాలి ధూళియుబర్వె గడుమొరలెత్తె। తూలుచు పశువులు దొ
రుగంగజొచ్చె। నింద్రచాపములు ఖండేందు చాపములు। చంద్రార్క పరి
వేష జాలముల్ పొలిచె। మనుజేశునకు నంతమంత్రివిరోధ। మునుపరిధా
న విరోధమును నాప్తపటలి। రోధంబు పుత్రవిరోధంబు నిరుప। రాధంబు
పుట్టె నూరనుమారి మసంగె। ధర వెండియున్న మహోత్పాతముల్ పు
ట్టె। పురజనుల్ వచ్చె న్నాభూమికి నవధి। నదియేలతప్పు నాహరగణక్షోభ।
మదియేలతప్పు నాయయ్యశాపంబు। మొన్న పండితులు సమున్నతి బ
లికె। నిన్న నుత్పాతముల్ నెలకొనెనేడు। పుట్టెగోత్ర కలహములి ద
మలోన। నెట్టుగానున్నదో యింక చోడనికి। సిద్ధంబు భక్తవిరుద్ధంబు ఫ
లము। సిద్ధింపనోపు సేసేతనం బెట్లు। కలిహంబుగానోపు గ్రిందుగానో
నోపు। ప్రళయంబుగానోపు ప్రజలెల్ల నింక। బురినునికిమీద బుద్ధిగా
దనుచు। బొరుగూళ్ళకును దమ పొందుపట్లకును । వారివారికి నేగి వడి
నొక్కనాడు । ధారుణీశ్వరుడు నిద్రాసమయమునను । భసితావలిప్తక
పాలాస్థిధామ । లసితశుంభజ్జటాలంబితవిపుల । కటితట సన్నద్ధ ఘంటి

తానమెల్ల నిస్సంతానమయ్యె। పాదయ్యె తద్భూమి పండితవిభుని।
యీడితశాప మహిష్ఠత జేసి॥ అంత నక్కడ మల్లికార్జునారాధ్యు। లెం।

## సహస్రగణమాలిక.

తయు రయమున వేగుచు మున్న। బౌద్ధుని సమముగా బ్రీతియైనతప్పు।
బౌద్ధునిచేముట్టి పరిపిన తప్పు। హరదూషణంబు సేయగ విన్న తప్పు।
హరగణంబుల బాసి యందున్న తప్పు। ఆపదసమయము లణవని తప్పు।
పాపిచోడనితోడ బలికిన తప్పు। జగదీశ్వరునిజూడ సరసినతప్పు। మొ
గిన దీక్షితులు తన్ముట్టిన తప్పు। పాయదు వేరొండు భంగిని ననుచు।
పేయుభంగుల వింత వేడుక దనర। సన్నుతగణనామ సంకీర్తనంబు। చె
న్నారవాయార జేయంగ దలచి। యాద్యభక్తగణసహస్రనామములు।
హృద్యంబుగా పఠియించు టెట్లనిన॥—శ్రీనందిశివకర శ్రీనందికేశ్వ। రా
నందనంది నాథాక్షవిజయ। భద్రవీరకభద్ర భద్రభద్రాక్ష। భద్రమహా
కాళ పంచాక్షరత్రి। యక్షరద్వ్యక్షరైకాక్షరోగ్రాక్ష। రాక్షర ధూ
మ్రాక్ష యనలషడక్షర। వికటాక్షవిమలాక్ష విశ్వవిశ్వాక్ష। వికటాంగవి
మలాంగ విజయజయాభ్ర। వర్ణమహా భైరవ శ్శ్రేష్ఠసూర్య। వర్ణమహా
జ్వాలో జ్వాలసోమవర్ణ। నిష్కంపనీరద నిస్వననిత్య। నిష్కళ పుష్కళ ని
శ్శంకకాల। రూపనిరూప విరూపాక్ష విశ్వ। రూపసుందర శాంతరూపో
గ్రరూప। కోకిల కింకిణీ కుందకీకుముద। కాకపాదాపాదకటకాహికటక।
పింగళానక్షర పిండకమధుప। పింగళాంబక మధుపింగళాలోక। విజయస
ద్యోజాత విష్టంభశిష్ట। నిజబలశ్రీకంఠ నీలసమస్త। భూతజృంభణ సూర్య
పాతనసోమ। పాతన సురగిరి పాతనవింధ్య। పాతనాంగారకభక్షణ సర్వ।
పాతనసర్వ కంపన సర్వదాహ। చండకీర్తీశాన చండీశచండ। దండపాణి
కపాలధర హరహారిమ। హాకాయనందిమహాకాళపుండ। రీక ఘర్ఘరభృం
గి రిటిమృత్యుహరణ। సహానేశ దీర్ఘ హ్రస్వస్థూలసూక్ష్మ। గుహాక్షాద్రి
కూష్మాండ గోపతిజటిల। భిండిరుండాభరణాండాభరణ శి। ఖండిముండ
ధరనికర్షణలంబ। కర్ణసుంటాకర్ణ గజకర్ణ శంఖ। కర్ణద్వికర్ణ త్రికర్ణసహ
స్ర। కర్ణవికర్ణ గోకర్ణవరాహ। కర్ణ సంకర్షణోత్కర్షణవిపుల। సర్వాతా
భరణ దర్పకఘోర వచన। సర్వజ్ఞ సర్వాత్మ సర్వసంహరణ। కరిముఖ

నరముఖ కపిముఖాహిముఖ । శరభముఖాముఖోష్ట్రముఖశార్దూల ।
ముఖసింహాముఖమేష ముఖగోముఖాశ్వ । ముఖపంచముఖ చతుర్ముఖ
విముఖాష్ట । ముఖనవముఖ దశముఖ షణ్ముఖద్వి । ముఖ సహస్రముఖ
త్రిముఖ వరాహముఖ । దక్షభాస్వర విషభక్షణబ్రహ్మ । భక్షణ శ
తసహస్రాక్ష పంచాక్ష । భద్రకర్ణాగశని భాస్వరపూర్ణ । భద్రాస్ఫలి
తమహాభద్ర గుహేశ్వ । రాంతకాంతకపుష్ప దంత భుగ్వ్రజ । దంత
వియోక్త్ర సిత గ్రీవవృషభ । సాంబరచంద్ర గంగాంబుశేఖర ది । గం
బరడమరుకహస్త సుహృన్మిత్ర । దర్దుర రేణుక దారుక కాల । మర్ద
నదక్ష విమర్దనత్ర్యంబ । కార్ధనారీశ్వర హాటకేశ్వర ఘ । టార్ధదేహోద్ధవ
క్త్రార్ధ నాసార్ధ । ఫణిభూషణ క్షేత్రపాలకపాల । మణిభూషణ విప్రమా
లికపాలి । శంకరోంకారవషట్కారకాల । కంకాళధరవజ్రకాయ సుషే
ణ । ధూమ్రాంగధూమకేతు వ్యాఘ్రపక్త్ర । వామదేవాదోర్ధ్వవాహ
వరాహ । సంతానక ప్రపంచాంతక త్రిభువ । నాంతక దైత్యాంతకా శి
తకాయ । శూలాయుధస్సు మనస్సుగతి సుపాణి । కోలాహలోత్తుంగ
గురులఘువజ్ర । పాణిసుదర్శన పాణిపినాక । పాణిమహాకేశ భగ్నసుకేశ ।
భవమహావ్రత వృషబలమహాబాహు । శివమేఘవాహన శ్వేతసర్వాం
గ । కామాంగదహన ఝుంకారమహేంద్ర । భీషణదవసురాగ్నితనాగ
దంత । బభ్రుమృత్యుంజయోభయశిరోసర్మ । లాభక్రకాయాంతి కా
యాప్రతిమప్రవ । కంపనోన్నతభాను కంపనసోమ । కంపనసంవర్తక శ్రీ
ధరప్రవ । చండశతోచల చండోదరప్రవ । కుండకుండోదరాఘోరకుంభో
ద । రాంభోదనాది వృషాంకకంటకని । కుంభమహోదరకలిశోద
రేందు । ఖేటకనక్షత్ర కృంతనసూర్య । ఖేటనహరిజటా కేసరస్సూర్య ।
పేషణబ్రహ్మాండ పేషణసోమ । పేషణసూత్రని పీడినాంక్షోళి । కామే
ఘలాలా సురాంతకలాశూలి । సోమదత్తస్వయంధ జ్యోతిరంగాట్ట । హాస
భస్మేశ్వర హాలాహలాతి । హాసగుహావాస హారమహామాయ । దిగ్వా
సహానాశ సద్వీపనిర్దళన । దిగ్వాహణాహారి దిక్పాలకారి । సాగరాపోశన
సంహారకాల । సాగరధ్వానాష్ఠ నాగాంగుళీయ । శశిధరతత్పురుషస్థా
ణురుద్ర । పశుపతిఖట్వాంగ పాణికపర్ది । గరుడపక్షచ్ఛేద కాలాపహ

రణ। గిరికందుకాటనశ్క్తిలివియత్తాళ్! విష్ణుకంఠాళాంక విధిశిరచ్ఛత్ర! విష్ణునేత్రదాన విధిశిరస్ఫురణ। బడబాగ్నిశిఖిశిక పాదపంచశిఖ। భద్రబావలానన్నప్రళయాగ్నినేత్ర। కులగిరిపాతన కూర్మాహీనటన। విలయాగ్ని ఖేలన విద్యుత్ప్రభావ। లింగాక్షభగవన్మతంగమహేశ। ఖాంగద కాలరుద్రాక్షపాదోద్ధ। ఆదివరాహదంష్ట్రాంకిత వదన। బాదరాయణ భుజోత్పాటనసింహ। చర్మవసనయుక్త చర్మాసనేశ। చర్మచేలవ్యాఘ్రచర్మోత్తరియ్య। హరిరథారూఢచక్రవహస్తిర। శరనిధిపానవిష్వక్సేనహరణ। భీమకాయాకాయ పృథుభగదత్త। సోమదత్తాభిల సుచరిత్రమేఘ। ముఖపాదముఖకుక్షి ముఖబాహుముఖ సు। ముఖజానుముఖవిశ్వ ముఖమహాభిల। బహువక్త్ర బహునేత్ర బహుతాలుజిహ్వ। బహువర్ణ బహుకర్ణ బహుఘోణలోల। జంఘదుర్దరమహాజంఘోరుతాళ। జంఘోదర ప్రద స్వచ్ఛందచారు। దంతాభ్రతాళతత్త్వమతకుతార। దంతమహోక్షపతాకప్రచండ। బలదీర్ఘదంష్ట్రసుబాహుపాతాళ। తలవాసిహ్రస్వకంధరదీర్ఘలోచ। నోక్షవాహన సహస్రదరవర్తు। లాక్షకత్ర్యక్షరక్తాక్షవర్ణాక్ష। కాలకంఠమయూర కంఠోర్ధ్వబాహు। తూలాక్ష లంబాక్ష నీలాంబరాగ్ని। కుండలకతుహారాజాండ బాహుగ్ర। కుండలానంగసుఘోణాద్రి కుండ। లాండగర్భరగగ నానందనంద। పాండురాంగసితాంబర కుండకర్ణ। లంబోష్ఠదీర్ఘోష్ఠలంబకర్ణ ప్రలంబ। లంబోదర లంబాక్షలంబ। హనులంబ జింహాలంబాననలంబ। తనులంబనాసిక దశభుజద్విభుజ। సోమాక్ష రౌద్రాక్ష సూర్యాక్ష సోమ। భీమాంగలలితాంగ గోమాంగకర్ణ। సేనదుష్కరమహాశేన శాశ్వత సు। ఖానందకాల కూటాగ్ని జింహాగ్ని। కేశధూర్జటు మహాకేశ త్రిజటిసు। కేశోర్ధ్వ కేశనాశిపశిరోహరసు। జిహ్వాద్రి జిహ్వాత్రి జింహ్వాసహస్ర। జిహ్వావిద్యు జిహ్వాజిహ్వోదరోరు। జిహ్వామహాజిహ్వ జితకర్ణవహ్ని। జిహ్వానికృంతన శ్రీధరారాధ్య। లంబకంధర మహాలయమహాదంష్ట్ర। లంబోష్ఠ శంభు పీతాంబర స్థూల। విగ్రహప్రబలకంబు గ్రీవధూమ్ర। విగ్రహవికట ఫింహాగ్రీవదీర్ఘ। బాహుద్విబాహు త్రిబాహు సహస్ర। బాహుమహాబాహు పాదబాహు। బాహుభుపాదోరు బాహుముఖోర్ధ్వ। బాహుప్రము

ఖ మహాప్రమథగణములు॥— భువనేశ్వరాది విభూతికపాలి। భవభూతి
కరభూతి పాలనచక్ర। ధర్మమహాబల మహాదంష్ట్ర ప్రచండ। ధరదహన
క్రూరదంష్ట్రార్ధదేహ। వేదపారగ మేఘనాద త్రికల ను। నాదకపర్దిధ
నుంజయశ్వేత। భద్రనీలాశన బలకాలకాల। రుద్రశాశ్వతనీలరుద్రపినా
కి। సర్వజ్ఞదీర్ఘహ్రస్వస్థూలరుద్ర। సర్వేశసుఖ కరజ్వలనాక్ష మేఘ। వా
హనక్రాధీశ వటరుద్రహర వి। వాహనాహిత ధూమ్రవర్ణ విధీశ। కలవి
కిరణ రుద్రకాలమహేశ। బలవికరణ రుద్రప్రమథన జ్యేష్ఠ। సర్వభూతద
మన చరమహాతేజ। సత్వమనోన్మనస్థాణు సంహార।పూరకజ్యోతిర ఘో
రభర్గేశ। వీరేశ్వరానేక వీరవిద్వేషి। పింగేక్ష నాంతరిక్షాంగ విశ్వేశ।
పింగళానంతమాతంగ త్రిదంష్ట్ర। వృషభగణప్రియ విభువిరూపాక్ష। వి
షధరాక్షయరుద్ర విద్యాధరేశ। హరరత్నకరమార హరణత్రినేత్ర। హ
రిహరభభృక్షయాంతక దుఃఖ। కరభయానక విభక్షణ కర్తృశూల। ధ
రసుదుంబర జటాధర గణాధ్యక్ష। ధాతృత్రిదశవందితప్రమర్థక వి। ధా
తృగ్రసన పరంధామాత్మ పంచశిఖ యామ్యసూక్ష్మస్త్రీక్షణాతిభవేశ। సౌ
మ్యదేహోర్ధ్వకేశజ్వలన ప్ర। కాశభస్మాంకిత కాలలోహిత సు। శేశరు
ద్రాగ్ని హుతాశనశీఘ్ర। భీమభవోద్భవ క్షేమీశబుద్ధి। వామదేవ ప్ర
భుస్వామి సర్వాత్మ। సహానేశ గగనేశ శంభుగిరీశ। గుహరౌద్రపరమాత్మ
గోపతిప్రబల। వజ్రదంతావృత వాయువేగోగ్ర। వజ్రదంతాసిత వర్ణవి
యోక్త్రు। బడబముఖాసాధ్య పావకశ్రేష్ఠ। మృదుపరాపర కళామేయ
నివృత్తి। పాశహస్తలఘురూపధర మృత్యుంజ। యేశానరుద్ర ఫణీంద్ర గ
ణేంద్ర। బకరుద్ర బాధక ప్రళయాగ్నిరుద్ర। వికిరణార్చిత వీరవిటరుద్ర
మృత్యు। హరహరరుద్ర విశ్వాధిక రుద్ర। శరభరుద్ర • మహావృషభ,, రు
ద్రశబర। రుద్రమహాకాళ రుద్రసంహార। రుద్రమహానాట్య రుద్రకిరా
త। రుద్రార్ధనారీశ రుద్రమహాభాగ్య। రుద్రమృత్యుంజయ రుద్రవిరా
ఖ్య। రుద్రసదాశివ రుద్రవిజ్ఞాన। రుద్రవిజయజయ రుద్రఖర్మాఖ్య। రుద్ర
మహాశివరుద్రైకపాద। రుద్రాది రుద్రాది రుద్రగణములు॥— శ్రీవృద్ధమ
నవేద శిఖిజటామాలి। సోమశర్మ శ్వేత శూలిసహిష్ణు। ముండి జైమినిప
వ్య డిండిలాంగులిశి। ఖండిశరధిబాహు కంకసుహోత్ర। దారుకోగ్ర

త్రిసుతారులోకాక్షు। చారుహాసల కులీశ్వర గుహావాస। గోకర్ణ భృగు
యువాలోక గౌతమము। మహాకాయ వృషభ మహాకాయులనగు నసదృశ
మహిమ యోగాచార్యులనగ। నెసగు నయ్యిరువది యెనమండ్రు గురు
లు॥—నలరు ధర్మాచార్యులనవారి శిష్యు। నెలమిమై నూట పన్నిద్దరు
భువిని॥—తిరు నీలకంఠుండు తిరునీలయక్క। తిరుమూల దేవుండు తిరు
నాళ్కపోవి। మానకంజారుండు మంగయక్కరసు। యానయనా మొఱ
న్న యధరుండు। పిట్టనంగ రోహిణిపిళ్ళ నయనారసంగ। నంగభండుండు
పూసల నయనారు। పరమనాచార్య దీపదకళియూరు। కరిగణనాథుండు
కరికామ దేవు। డమరనీతి యిరువదాండారు మూర్ఖుఁ। నమినంది యేనా
ధి నాథుండు సాంఖ్య। తొండభూపతి చిరుత్తొండ తిరుకుడిపి। తొండండు
నంబి చిర్త్తొండండనంగ। చిరాల దేవుండు చేదిరాజయ్య! గారు కాళవ్వయే
కాశిసోమాశి! మారుండు వీర పేర్మాణి దేవుండు! వీరచోడండు జడయా
రిరిత్తాండి। యల్పుచలంది వాగీశనయనారు। కాల్పులి యలయా దంగుళి
నయనారు। చిరుపులి యార్కు లబ్బిరి నయనారు। మిరుమిండయూరున
మిత్తండియూరు। కళియం బయరహీలు కడమలనంబి। కళియంబగుగ్గుళ
క్కలినయనారు। కన్నప్పతాపసి కరయూరచోడు। చెన్నయ్యచోడండు
చేరమరాజు। డిడిగుడి మారయ్య యిడుమూర దేవు। డడిభక్త యొఱు
మూర్తి యరవత్తుమువ్వురు॥—హెన్నయ్య పాండ్యనాయుండు గుడ్డవ్వ।
కిన్నరబ్రహ్మయ్య కేతయ్యగారు। బీరహండయ్య బజ్జదేవయ్య। గారు
ఘేనాగయ్య గారునాగయ్య। గారుకాళవఫణిహారిసోమన్న। గారుచిక్క
లిగె నాగయ్య సేనాధు। దేవర బాచయ్య పూవుల బాచి। దేవుండు బాచ
ల దేలి షోడశులు॥—వీరఘంటామయిలూరి దేవయ్య। గారు బొప్పల
దేవి కామలదేవి। గారు చోడయ్య సింగయ్యబీచయ్య। గారు మాదేవ
న్న గారన్న బరసి। దశగణసింగయ్య దశగణంబులును॥—బసవరాజయ్య
ప్రభాతగణములు। శింగిదేవుడు బమ్మిశెట్టి సాతెక్క। సంగమైళిగ నిజసం
గయ్యదేవ। రసుగారుకన్న బరసిఫణిహారి। బసవయ్యపూసల, బాచిదే
వుండు। దేవుండు యోహిళ దేవియుబొప్ప। దేవియు కామలదేవి తేరసు
లు॥—శ్రీపతి పండితుల్ సింఘుబల్లహుండు। ధూపదమాచయ్య ధూర్జటి

కేశి। మడివాలుమాచయ్య మాదిరాజయ్య।బడవరబ్రహ్మయ్య బాచిరాజయ్య।కిన్నర బ్రహ్మయ్య కేశిరాజయ్య।కన్నడబ్రహ్మయ్య కాశిరాజయ్య। మోళిగ మారయ్య ముసిడిచౌడయ్య। శూలదబ్రహ్మయ్య సురియచౌడయ్య। కలికేతుబ్రహ్మయ్య కక్కయ్యగారు। తెలుగేసు మనసయ్య తెలుగు జొమ్మయ్య। యుత్తమాంగద కేశిహొన్నయ్యగండ॥ గత్తెరవాచయ్య కాలాగ్నిరుద్ర।దుదరదరామయ్య హొన్నబ్రహ్మయ్య।కదిరె రేమయ్య మహాకాళయ్యబిబ్బి। బాచయ్యసవరద నాచయ్యవీర। నాచయ్యయడపద రేచయ్యగారు। అల్లయ్యయును మధుపయ్యబల్లేశు। మల్లయ్యగోడల మల్లయ్యగారు। నిజలింగచిక్కయ్య నిర్లజ్జశాంతి। నిజభావుడును నిత్య నేమద మైలి। దసరయ్య దేవరదాసి గజ్జేసు। మనసయ్యగారునమాత్య మల్లయ్య। యట్టిమారయ గౌళిభట్టారకుండు। పిట్టవ్వగోవిందభట్టారకుండు।శంకరదాసయ్యశ్వపచయ్య సుంకి।బంకయ్య మొరటద వంకి దేవయ్య।యముగిదేవుడుచిక్కలముగిదేవుండు।నమరగుండము మల్లికార్జునయ్యయును।దారయ్య భోగయ్య దాస కేశయ్య। మారగౌళుండును మలయరాజయ్య। పంచాగ్ని సూర్యుడుద్భటుడు సన్యాసి।మంచయ్య మల్ల బ్రహ్మయ్య వెల్లగొండ।మహాదేవు డుడుతడ మహాదేవి బెజ్జ। మహాదేవి శివనాగ మయ్య బెలిదేవి। వేమనారాధ్యులు విజయాపురంబు। సోమిదేవుడు చిక్కసోమిదేవుండు। మాదర దూడయ్య మద్దయ్యగారు। కేదారబాచయ్య కెంభావిభోగి। దేవుండు రేవణ దేవుండు మూరు। జావదేవరవీర చాకిదేవయ్య। చేటల వేమయ్య సిద్ధబుద్ధయలు। హాటకేశ్వరుని మల్లయ్యయు నమృత। నాథుని యప్పయ్య నాగయ్య యుసుమ। నాథుతిప్పయ్య కల్లినాథుభీమయ్య। విరుపకకల్లయ్య నిర్విషథనాగయ్య।యురులింగపెద్దయ్య యును గొంగుడెరతి। ఆకయ్యశివరాత్రి యప్పిదేవయ్య। సాకలదేవియు సత్తెక్కచాకి। దేవర దేవయ దేవయపోతి। దేవుండు పెద్దిగదేవుండు వీర। కల్లయ్యవీరనాగయ్య జూటూరి। మల్లిదేవయ వీరమాచయ్యసకతి। దేవయ్యయును శివదేవయ్య రాము। దేవుడు చక్రవర్తియు పొట్లచెరువు। వీరచోడవదేవి వీరసంగయ్య।వీరబ్రహ్మయ్యయు వీరదేవయ్య।బాపూరి బ్రహ్మయ్య భోను దేవుండు। కోవూరి బ్రహ్మయ్య గొడగూచియన్న। బ్రహ్మయ్య కెరవూరి

బ్రహ్మయ్యపుండ్రి। బ్రహ్మయ్య సగరద బ్రహ్మయ్యసూలి। బ్రహ్మయ్య
రాజసబ్రహ్మయ్య వేంగి। బ్రహ్మయ్య రక్కస బ్రహ్మయ్యకుండి। బ్రి
హ్మయ్యయును మిండబ్రహ్మయ్య బాల। బ్రహ్మయ్యసాహిత బ్రహ్మ
య్యగారు। నులకచండయ చిప్ప నూతులప్పయ్య। బలదేవుడు కుమా
ర పాలఘూర్జరుడు। మేధావిరుద్రుండు మిండసంగయ్య। మైధునరామ
య్య మగతిలకవ్వ। అంగరాయుండు రాజార్ధదేవుండు। శృంగిబొప్పయగా
రు శివకుమారుండు। యోహిళయ్యయుహాలాయుధుండును రాము। సా
హిణిబెడగొండ చక్రవర్తియును। పల్లవరాయుండు పరమహంసుండు।
గొల్లవరాయుండు గురుగుంట్లదేవు। డల్లమదేవుండు హావినహాళ్ల। కల్లి
దేవుండు భాస్కరదేవు డిళ్ల। హాళ్లబ్రహ్మయ్యయై దంకె మాదన్న। కా
శ్మీరపుసుగ్గారు గణదాసివీర। యాదెయ్య వీరయ్య పాదాలయక్క। జో
తులమాయన్న శూలాయుధయ్య। యురగరాయుండు సద్యోజాత దేవు।
డరియమరాజయ్య యంపయ్యగారు। వేంగి సంగయగారు వీరపోలయ్య।
చాంగుబొల్లయ్య ప్రసాది బంకయ్య। యేలేసు కేతయ్య యిండె సోమ
న్న। చాళుక్య భీమయ్య చట్టయ్యగారు। కొట్టురుబాచయ్య గురు భక్త
తండె। జెట్టాణిపెద్దయ్య శివముద్దుమూగు। సంగయ్యవని పుర శంకరదే
వు। డింగుళిపై జవ్వ గంగాపురంబు। బసవయ్య ఫణిహారి బసవయ్యచెన్న।
బసవయ్యయవగళి బసవయ్యగంగ। మల్లయ్యశిఖరేశు మల్లయ్యవీర। బల్ల
హుడును తాండిపర్తి బొల్లయ్య। శ్రీకోటిపల్లెయ్య సిద్ధరామయ్య। యే
కాంతరామయ్య యిండె శాంతయ్య। సరవూరి బంకయ్య శంకర శెట్టి। బె
రళదమారయ్య బెట్టిద దేవ। రసునిర్ధనయ్య నిరాళిదేవయ్య। హాసితమ
స్తకుడు మారయ్య ప్రసాది। దాసయ్యకెరపూరి దాసయ్య యజ్జు। దాస
య్యనింబాళ దగణేశ్వరుండు। యోగాతిచందయ్య యాత్మదేవుండు।
ద్రోణేశుమల్లయ్య రుద్రియన్నయ్య। కొలిపాక మారయ్య గోణిమార
య్య। బలగర మారయ్య బైచయ్యమాయి। దేవయ్యయును శివదేవుం
డుభ్మాను। దేవుండు మహాబలదేవయ్యగారు। గుడ్డయ్య మారయ్య గొయి
దేవయ్య। లెడ్డు సోమయయు విరియోగిబైచయ్య। రాచమల్లయ్య బిక్క
రాచమల్లయ్య। బైచిదేవుండనిమిషయ్య వశ్లేశు। సోమయ్య బల్లేశు సో

మయ్యానుంకె। సోమయ్యయాచార భీమయ్యగారు। ధనళయ్యగారు బొంతాదేవిగారు। ధవళేశనాథయ్య దండిప్రసన్న। బసవయ్య కంగళ బసపయ్య చిక్క। లసదదేవయజితలట్టసోమన్న। శివలెంకమంచయ్య చిపురు చందయ్య। శివరాత్రి సంగయ్య శ్రీసూరసాని। శివ్వయ్య దరుమయ్య శ్వేతయ్య వైజ। కవ్వబొల్లవ్వే రెబ్బవ్వ రేకవ్వ। యమ్మవ్వ యరసవ్వ గూదెవ్వవీర। రెమ్మవ్వ కమలవ్వ నిమ్మవ్వగారు॥—నాదిగా గణసహస్ర నామములు। నాదరణీయ్యంబులై యొప్పు నిట్లు। నలితద్గణసహస్ర నామ స్తవంబు। వెలయు పఠించిన వినిన వ్రాసినను। విరచించినను భక్తి విస్ఫూర్తి యొసగు। దొరకును శుభములు దురితముల్ దొరగు। హరుప్రసిద్ధ ప్రసాదానంద మలరు। చిరమనోరథములు సిద్ధించు మరియు। దుస్స్వప్న దుష్కర్మ దుశ్శకునాదు। లస్వప్న సర్వగ్రహాది దోషములు। జ్వాలనాప మృత్యు తస్కరవృశ్చికాహి। జలమృగోరగ రాక్షస విష భూత। పవన మహాజ్వాలాద్యది పక్షదారిద్ర్య। పవిరాజ భయముఖ్య బాధలడంగు। నర్థార్థులీస్తవం బర్థిపఠింప। నర్థసామర్థ్య సమగ్రత దనరు। పుత్రార్థులీ నామములు పఠియింప। పుత్రపౌత్రాది విభూతి వటిల్లు। శత్రుక్షయార్థులీ స్తవము పఠింప। శత్రుక్షయైశ్వర్య శక్తి వర్ధిల్లు।భుక్తీచ్ఛ నీ నామములు పఠియింప। భుక్తియు నభిమత భోగముల్ గలుగు। ముక్తీచ్ఛనీనామములు పఠియింప। ముక్తులు వరసను ముదమున గలుగు। భక్తీచ్ఛ నీనామ పఠనంబు సేయ। భక్తి సౌభాగ్య సంపద సమకూరు। నెందు దిగంత సంయుత మహాకీర్తి। జెందు మరిగళ మహా శ్రీ శ్రీ ప్రపూర్తి॥—అంచు నూతన సృష్టి నభినవంబుగ స। మంచితభక్త గణావలి బొగడ। నవ్యగణ సహస్రనామస్తవంబు। భవ్య పంచాక్షరీపఠన ప్రియుక్తి। పఠియించుచును జనని జఠర కఠోర। పిఠరాపహరణ కర్మఘ్నుడు పండితుడు। నంతనీక్రియ నమరా రామమునకు। సంతోషమున భక్తసహితుడై యేగి। యాసక్తిమై యమరారామపుర ని। వాసు శ్రీయమరేశు వాసవాధీశు। నమరేశ్వరాష్టకంబందు గీర్తింప।కమనియ్య తద్దీర్ఘకామధ్యమముస। గణకూటమున సంఖ్యాత సద్భక్త। గణముల నెడ్డోలగంబుగా నునిచి। నదియుత్తరార్థ మాసరపతి భూమి। నది దక్షిణార్థమీ నరపతిభూమి। వె

డలితి మటుగాన వెలనాటిసీమ। బడయుదు నింకనంబకము లీక్షణము। యె
ట్టిన కాదె మాయాదిప్రతిజ్ఞ। యట్టును గాక వాదంతకు గూడు। నంభకు
బడసె మే మన్నార మట్టి। అంతకుకూడువాడంతకు ననుచు। పొరిబొరి
గూడ విభూతి వీడియము। లసదొందిభక్త గణావళికిచ్చు। నంతలోనన
ఫణిహారి యాదొప్పి। నంతకు ప్రోలికి ననిచి యేతెంచి। నలిభక్త తతికి
విన్నప మాచరించి। నలరుచు నసమ లోకారాధ్యమూర్తి। యతుల శా
పానుగ్రహసమగ్రకీర్తి। వ్రతచక్రవర్తి నిగ్రహభక్తజూర్తి। పండితేంద్రుం
డు శుంభన్మహాభక్త। మండలి కంతంత మహిజాగి మొక్కి। ప్రమథాతి
నూతన ప్రాక్తనభక్త। సముదయ శ్రీపాద జలజాత్ము డగుచు। విగత నే
త్రద్వార విని హితామృతము। లగు ప్రసాదప్రసూనాంబరావళులు। వృ
ష్టించునంతన పురహరు కరుణ। సొప్పార నుదయించె నూర్ధ్వనేత్రము
లు॥—బండరువందుల పద్మరాగములు। బండరు దెరచుకు భాసిల్లునట్లు।
తరుణతరద్యుతుల్ దళుకొత్త సూర్య। కిరణవిస్ఫురణంబు గీడ్వరచుచును।
పండితు కన్నులో పద్మరాగములో। పుండరీకంబులో పూర్ణేందుకళలో।
ముక్తిగోళదములో మోదాంకురములో। భక్త దర్పణములో భాగ్యఫల
ములో। యమృత పిండములో దయాకరండములో। సుమహద్గణస్థాన
సుకర దీపములో। యుదయార్క శకలంబులో మణిద్యుతులో। సద
మలజ్ఞాన బీజంబులో యనగ। నొప్పియుండియు భక్తయువతి నేత్రము
లోని యొప్పు నీకన్నుల యొప్పులనంగ। ధరవీరభక్తచింతామణిరుచు
లో। పొరిబొరి యీనేత్రము లరుచులనగ। దృష్టసద్గుణ దయాదీపిత జ్ఞా
న। దృష్టు లీకన్నుల దృష్టులనంగ। సంసార విజప్ప్రాణిసుని పదాబ్జము
లు। కెంపు లీకన్నుల కెంపులనంగ। నలిపాణిలింగాంఘ్రి నఖదర్పణము
లో। తెలుపు లీకన్నుల తెలుపు లనంగ। నిద్ధంబులై మహనీయంబు
లైల। సద్దయాన్వితములై శాంతిపూరంబు। లై కళాయుక్తంబు లై సుధా
మయము। లై కమనీయంబులై లసత్కాంతి। మంతంబులై యసమా
నంబులై ని। తాంతంబులై వినూతనములై విబుధ। సన్నుతములు న
య్యో జనునెడ నిడుద। కన్నులు లోకవిఖ్యాతిం వెలుగ। హరవమూర్తి
గురుమూర్తి యగు పండితేంద్రు। కరమొప్ప నెడ నిడుకదన్నులం జూచి।

పురజనుల్ బుధులు నద్భుతమని పొగడ। వరభక్త దిగ్గజావళిమిన్ను దాక। నార్థూత మతి మల్లికార్జునఖండి। తారాధ్యులంత నత్యంత నితాంత। చారుతరోర్ధ్వలోచనములు వరుస। దొరులతరస్వయం జ్యోతిరుద్దీప్త। విదితాంగుడగు శంభువికసితాంబక స। ముదితంబులగు గొన్న గొదమలో యనగ। పావనదివ్య తేజో విరాజితము। లై విలసిల్లు దిగంత దీధితులు। నెలకొని తనయెడ నిడుద కన్దోయి। నలివిచ్చి విచ్చి గణప్రదర్శనము। గావించుచును భక్తగణకరుణాసుధావార్ధి దేలంగ దనివోకమరియు। నన్యోన్యసందర్శనానోన్యవద। నానోన్యభాషణలగుచుదభక్త। గణములయ్యెడ నిడుద కన్నులు జూచి। గణుతింప చిత్రంబు గాదెమున్నాది। భవుచెంత కన్నులు బడసినవారు। భువి లేరె యన్న యద్భుతమెట్టులనిన॥—ఆ సరసిజ నేత్రుడాది జలంధ। రాసురుపైబోయి యని సేయ నతడు। సంధిల్లి తన బలక్షయముగావించి। బంధించితను వియత్ప్రాంతంబువైవ। నెన్న బదారు వేలేండ్లు వాపోవు। చున్న శ్రీవృషభేందు దుక్షవల్లభుండు। విని యట్ల శివునకు విన్నవించుడును। చని శూలినాతోడ సమరంబు సేయ। జను జలంధర నీవు శస్త్రంబుపుచ్చు। కొనుము నావుడు ముదిగొరగనీతోడి। యనికి నాకేటికి యాయుధంబిడగ। ననుడు నట్లైన నిరాయుధుతోడ। నని సేయు టన్యాయమనుచు మాధుర్య। వనధిలోవామాంఘ్రి వరనిజాంగుళము। నిడి త్రిప్పనయ్యె సురేంద్రుని జుట్టి। పడిదిరిగెడి జలావర్తపూరంబు। తివిరి భాస్కరకోటి ధిక్కారలీల। నవిరళస్ఫూర్తి చక్రాకారమగుడు। దనుజ క్రోచక్రాయుధం బదెయనుడు। తనువట్టదగు నాయుధంబయ్యె ననుచు। నురువడి తనుజట్టి యున్న చక్రంబు। కరమునకంఠోపకంఠంబుగాగ। పూంచి యెత్తుడు దైత్యపుంగవుశిరము। దెంచెనచ్చక్రంబు దెంచుడు నతడు। నంధకాసురగంధి సింధురాసురజ। లంధరాసురనిర్దళను ముట్ట గొలిచి। యాక్రమదైత్య నాశార్థం బనగ దిరి। విక్రము డంత నాచక్రంబు బడసి। బహుదైత్యతతి చక్ర బలమున నొడిచి। మహిజరించుచు త్సుప్రమతమునసంత। యొచినిష్ణుండు దధీచిపై నెలిగి। వైచుడు పడి విరిగె వరచక్రమపుడు। తుత్తుమురగుడు దైత్యులు విజృంభించి। చిత్తజాంతకు నిభజించి చక్రంబు।

పడయుదు తొల్లింటి పగిదినయనుచు । జడజాంబకుండు లసద్భక్తియు
క్తి । దప్పక వెయ్యేసి తామరవిరుల । నెప్పుడుకొనివచ్చి య్యేకాగ్రబు
ద్ధి। నమితసద్భక్తి షడక్షరభావ। నమున రుద్రసహస్రనామములందు। నొ
క్కొక్కదివ్య నామోచ్చారణమున । నొక్కొక్క కమలంబు నురుగ్రి
బూజింప। నజీయదన్యంతర సంభవంబనగ।ధరశ్రుతుల్ నేత్రిముత్పాట్య
నానంత । నొక్కనాడొకటందు దక్కువపడగ । గ్రక్కున దననేత్రకమ
లమర్పించి। చక్రింబు గన్న నీశ్వరు చేతభక్తి । విక్రమం బేర్పడ విష్ణుండు వ
డయ । హరుడ ట్టేపడయ వాదర్పించి కన్ను । హరుడిచ్చువాండ టే యం
దెంతయరిది । వారకమున్నారు వరసలవీర । ఘోరతపంబు గైకొని
యీశుగొలిచి । శ్రుతిసర్వతోక్షి శిరోముఖంబనగ । శ్రుతివిశ్వతశ్చ క్షు
రుతయనిలోచ । నాంగీకరణ సమస్తాంగు బేహరి దొ । డంగి కన్నొకడు
యిట్లుపడయునదియు । కడపట నొడలెల్ల కన్నులుగాంగ । బడయుటొ
ముక్కన్ను బడయుటొయెట్టి । పడయుట యీశుండు ప్రత్యక్షమైన । క
డపటనదిగాదు కాదంచు కాళ్ళి । దాసికన్గవపూంచి తనదునేత్రముల। తా
సులుబడసె నాక్రమ మెట్టులనిన॥—— బట్టుబల్లహభాను భవభూతిరుద్రి ।
భట్టుగోపాలక భట్టుపులింద। భారవిభాస్కర భట్టనుభాజ। వీరికపూర్ణార
విక్షీరవిభిక్షు । భరతవిద్యాధర పాణినిక్షేమ్య । హరదత్త వలరుచి వర
భట్టమాఘు । జయకీర్తి కవిరాజ శాకటాయన వి। జయదత్త కౌమార శం
కరప్రత్యక్ష । వల్లభాది కవీంద్రవరకవితాస । ముల్లసరచనామహోన్న
తిమిగుల। చాలితశాబ్దికుల్ బాణమయూర్ధ। కాళిదాసులు దమకవితా
విశేష । ములకు మాత్సర్యముల్ ముట్టుడులోక।ముల బుధుల్ విద్వ
త్తములు జూడదొఋత॥—— చని మయూరుడు సూర్యశతకంబు జెప్ప। ని
నుకు ప్రత్యక్షమై యిదినీదుపూర్వ । కర్మంబు కుష్ఠరోగముచూచిదక్క ।
నిర్మూలముగ జేయ నేరరట్లయ్యె। నొక్కింతనాదీప్తి యొసగుచునదియు।
గ్రక్కన వేదిశుష్టుగపువ్వట్లుగను । అంతస్థమగుకుష్ఠు హరునిచేగాని ।
యింతయుజడ దెట్లు యీశునుతింపు । తడయక రోగంబు దనకయ్యెశు్రి
తులు । నెడవమార్తాండ భానోకుష్ఠయనుచు । నంతతదోర్హాంబు హ
రపాదభక్తి । మంతుంచ్ఛనై కొల్వ మానెనావుడును । రతిమయూరుడు

మయూరస్తవంబనగ। క్షితిధరజాపతి గీర్తనజేసి। ధరభానుచేతోని దన లోనికష్టు। హరియింపన్నదిచోద్య మనుచునుపట్టు॥—బాణుండు వెండి యు భక్తిక్రియాధు। రీణుడప్పుడు దనరెండు చేతులును। కడిఖండలుగ దన కట్టల్కడునిమి। పుడమి జనంబు లద్భుతమందిచూడ। హరుబూన్చి గద్యపద్యావసానమున। శివభక్తి శివకర శివకరయనుచు। బడసె చేతు లురెండు బడయుటయంత। కడిదిదానను చు జక్కనద్కాళిదాసి। కన్ను లురెండు నక్షణమకెలంకి। పన్నగధరుపదాబ్జముల కర్పించి। ధరకాళి దాసి గద్యంబు తా చెప్పె। వరభక్తి యుక్తి నీశ్వరునిగురించి। యిచ్చిన కన్నులు యిచ్చట గనుట। యెచ్చెరువగునే మహదానయనుచు। నీసు ననఖిలలోకేశుచే కాళి। దానునేత్రంబుల రాసులుబడసి। యెన్ని దేశంబు ల నెన్ని పురముల। నెన్నిగ్రామంబుల నెన్నంగబడిన। నన్ని దేశంబుల నన్ని పురముల। నన్నిగ్రామముల జాత్యాంధులందరును। కనుగురుపులను రోగస్థులైయున్న। జనులు రండోయని చాటంగబనుప। తప్పవోటున కన్ను తడికన్ను పొరయు। గప్పినకన్నిర్కు గన్నొండుకన్ను। గుడ్డికన్నె లగన్ను కొడ్రేపకన్ను। బొడ్డికన్నునుపువ్వు బోయినకన్ను। పలుకుగ ట్టినకన్ను బ్రంగుడుకన్ను। కలుకన్ను పులిసీరు గారెడికన్ను। బొందక న్నునుపొరి బుస్సులకన్ను। మందకన్నునుపెక్కు మూదలకన్ను। పొట్ట కన్నును బొంగపోయినకన్ను। తూటికట్టినకన్ను దూలగొన్నకన్ను। మ యిలకన్నును మసుమసు కనుకన్ను। నయిరకన్నును పాయకదిరెడిక న్ను। తూటిపోయినకన్ను తొలగుడుకన్ను। తేటకన్నును మరిది మిరం బురక్త। దోషంబుదుర్మాంసదోషంబువాయు। దోషంబుపటలంబు దు ర్గశీకృష్ణ। కాసయునతిరక్త కాసయుశ్వేత। కాసయుననిరోగంపు కన్నులును। ఆదిగాగలుగు సమస్తాంధులక్షి। రోగస్థులునుగూడి వేగనే తేర। జెన్నారకాళిదాసియు శివుచేత ?గొన్నయాముయ్యాడు కన్నుల లోన। దారెండుకన్నులుద్ధతిధరియించి। వారివారి కనుగవలు నిచ్చిపు చ్చి। యిచ్చుచునంధుల నెల్లరుదనుప। నచ్చెరువంది లోకావలిబొగడ। గ్రక్కున తమతమ కన్నులరాక। కక్కజంబంది పూర్వాంధులుమొక్క। దాసిదాసనుమాత్ర దమనేత్రరుజలు। బాసినయతగులు బ్రణమిల్లులగు

చు। వ్రాసియాకన్నుల వ్రేడలుసమయ। రానందులకుడాసి దానంబుసే
య। క్షితినంధులకునెల్ల గృపజేసిశివుని। నుతియించివడసె కన్నులుకా
ళిదాసి॥—యనగనంధులలోన యతనిపాంగదుగ। కనుగవల్ బడయు
ట కష్టంబుగాదె। తక్కువయేమున్న తనదివ్యకంటె। నిక్కంబుసద్భ
క్తి నిష్ఠగావునను। మతిభక్తిరతియప్రమాణంబుగాక। స్తుతియును నిం
దయు శూలికిగలదె। పడసెకన్నులు శివుప్రార్థించిదాసి। పడయుదునే
నెందుభంగినెట్లనిన॥—దేవుండుమాబావ దేవియూయక్క। వావిదప్ప
కనె యీశ్వరునికె మరిది। కరమనురక్తియేకారణంబుగను। గిరిజేశు
గేకట గెమ్మ్రటలాడి। యును సరసముజేసియును గేలిజేసి। యునుమర్మ
ములు జేసియును నగించియును। మేలంబులాడియు మెప్పించియిపుడ।
సాంబుచేబడుతు నత్రంబులేననుచు। నంబికానామాంకుడంబ్బె ననగవ్రు।
దొంగలింపగగొట్టి దొనశంకరేశ। లింగంబు గుడివెన్క లీలగూర్చుండి।
మెచ్చులు దులుకాడ మేలుకబ్బములు। చెచ్చెరనొకవేయి జెప్పినంత
టన। మెచ్చిశంకరుడు సంస్మితవక్త్రుడగుచు। మచ్చికనోముద్దు మరిది
యంబ్మెన్న। వోరోరిలెడయప్పు లుడిగిముందటికి। రారయిచ్చెదము
నేత్రములునీకనుచు। బావదేవరచీకు పట్టినకోల। యేవచ్చువిధమెట్టు
లింకముందటికి। సడ్డలాడెదుగాక శంకరయేను। గుడ్డినోమరినీవు గుడ్డి
వోచెపుమ। కోలయిచ్చెడువాడు గుడికడనుండ। జాలకననుబెట్టి జగి
గెన్నింటికిని। అంబెన్నయననెట్టి యరుగుదేనేర। నంబాయనిన నెంటి
యరునదేనేర। నాకుముందరయును నతల్లోకనీవ। నాకువెనకయును
న్న నతలోకనీవు। యీదిక్కు నాదిక్కు నేదిక్కునెరగ। నీదిక్కు ది
క్కున నిఖిలంబునకును। నీదిక్కుయగు సర్వతోదిక్కునీదు। నేది
క్కుముందగ నేదిక్కువెనక। నటుగానవలతేని యక్కుమగండ। యి
టు ముగంబై కన్నులిమ్మనావ్రుథను। భావింపముఖమంటపము పరివా
ర। దేవతలగువాసుదేవవిరించి। రవిగజాస్యగుహభైరవమాతృకాది।
దివిజగణంబునందియునట్లయుండ। వెనకముందరయుద్యోవింతనవ్వొల
యు। దనయున్న గుడియును దానుశంకరుడు। దనయున్న తాను
శంకరుడు। వడిమృడుతోడనే వచ్చెనేత్రములు। గుడిదిరుంగగ గంట్టె

గుర్తుమదిరిగె । హరుడభిముఖుడగు నంతలోపలను । కరమభిముఖము
లైకన్నులు వెలిగె । అంతనయఖిలజనంబులు నెరుగ । నంబకంబులు
గాంచె నదిగాక మరియు॥—తెండియుండుడి రిత్తాండియన్ గణము। దండి
మైమును కాళిహాసునేత్రములు। యెడపక నంథుల కిప్పించికాని। పడయ
నొల్లండ లేపటు నేత్రియుగము । యేసటుగాక కన్నిచినయట్టి । జైనుల
కన్నుల క్షణములో జెరిచి । మదికానిపడయ నీమహాకన్నులనుచు । కర
కంతునాజ్ఞ దుష్కరజైనవితతి । కన్నులుసెడగ వేగమెళపియించి। కన్ను
లుబడసె జక్కననిరిత్తాండి॥— అదిగాక శివనాగమయ్యయన్ గణము।
పదపడినిత్యంబు పాణేశ్వరునకు। మూడుసంధ్యలనేత్రములు సమర్పించి।
పోడిగాబడయుచు భువిబ్రవర్తింప । హుళిగరసోమేశు డుద్యద్దయాధ్యు।
డలరుచు శివనాగమయ్యనుజూచి । కట్టగనీవూన్చు కనుదమ్మిజోళ్లు। తొ
ట్టునుమాన్పలేనిది యాదిగాంగ। క్రమమొంద సోమవారము సోమవా
ర। మమిత సద్భక్తి నేత్రాబ్జముల్ పూన్చు। మనవుడు నట్లకాకని వార
వార। మును దప్పకుండ సముద్యత్ప్రసక్తి। భవుని పూజింపుచు బడయు
చునుండె। శివనాగిమయ్య చెచ్చెరనేత్రవితతి। మరియును గన్నప్ప మ
హిమ యీశ్వరుడ। యెరుగు నేత్రద్వయం బిచ్చుటగొనుట । యిచ్చె గ
న్నప్ప మునీశ్వరార్థముగ। నచ్చుగా శివుడు భక్త్యర్థమై యొసగె। యి
చ్చుట శివునికై యిచ్చుటగాని। యిచ్చుట కొననని యిచ్చుటగాదు। బడ
యుట శివునకై గడయుటగాని। వడయుగ వలెనని పడయుటగాదు । క
న్నప్ప దేవుడొక్కడకదాయ్యాది। కన్నులిచ్చినవాడు గౌరీశ్వరునకు। క
న్నులు గొనియెడు గణములగాని। కన్ను లిచ్చినవారి గానముగ్రినకు ।
కావున కన్నప్ప కన్నులయాగి। దానివరింప నెంతయుచెప్పమరియు॥—
ఉదయ మజ్జన కాల మిదిగ్గదాయనక। మదియించి నిద్రించి ఘరచిన య
ట్టి। మిక్కిలి ద్రోహులు మీరకాకనుచు। గ్రక్కున దన రెండు కన్నులు
కెలకి। సుప్రసిద్ధంబుగా శూలిబూజించి। యుపవృత్తాక్షంబు లక్షణంబు
నను। మహిబడయదే భక్తమతివెల్లగొండ। మహాదేవశరణుండు మరియ
ట్లుగాక॥—స్థిరకీర్తికంగళ దేవయ్యనాగ । పరసయుడాను శ్రీపర్వతేంబే
గి। కన్నులు పుచ్చి శ్రీకంఠు బూజించి। కన్నులుబడసి యాక్షణమ యేతే

ర। యింతవేగమున నెట్లు తెంచె కన్ను । లింతవేగమ్మున నీశాను చేత।
తానెట్లు బడసె నింతయుకుటిలంబు। గానోపునని కూడి ఖలులు నిందిం
ప। ధట్టుండు వారిచేతనె యొకపిల్లి। బట్టి తెప్పించి సభామధ్యమున। ఖ
లులచేతనె పిల్లి కన్నులు రెంటు। దొలగించి సకల భక్తుల నాత్మదలచి।
కరుణాత్మ యీపిల్లి కన్ను లీకున్న । హరయ సంఖ్యాతుల యానసీకను
డు। కడునుబ్బి యప్పిల్లి కన్నులక్షణము । పడసె నా దేవణ్ణ ప్రతిజను
ల్ జూడ। నర్పించి పడయుట యరిది యేకన్ను। లర్పింపకను బడయుట
రిదియె కాక॥ యేల యిట్టివివేయు నెన్న ముక్కంటి। కాళివెట్టియటన్న
గణనాథు డొకడు। మిక్కుటంబుగ తొలిమేని పుణ్యమున। ముక్కంటి
తోడన మున్ను జనించి।మేదురభక్తిమైమించి లోకములు।స్వాది సాక్షాత్రి
నయనుడని నుడువ। కరికాలచోడనన్ గణనాయకుండు।వరవీరభక్తి ప్రవ
ర్ధనశాలి। వోసీకభోజుని పూజార్ఘ్యపాత్రి। యానలు వొడిపించి యా
దృతిర్వర్ణ। వర్షంచ వర్షనావారక కనక । వర్షంబు గురియించె వసుధపై
నంత। నభ్రంకషస్ఫూర్తి నలమి పారంగ। విభ్రమలీల కావేరి గట్టుచు
ను। ముట్టినహిమమమై ముక్కంటి కాళి। వెట్టినా కావేరి వెట్టికివలువ।ము
క్కంటి వాడేల మును లెట్టి జేయు। యిక్కంటివానికి నేజేయు ననుడు।
యిచ్చినవాడెవ్వ డీ నేత్రమనుచు। నచ్చుగా ముక్కన్ను నతని రూపం
బు। ముంగలవ్రాయించి మొగిదనకాలి। యుంగటంబున నట రొత్తముము
క్కంటి। కాళివెట్టి నొసలి కన్నటు బగుల। కాళివెట్టిన యహంకారంబ
డంగి। కరికాలచోడ విక్రమచక్రవర్తి। కరయ సాష్టాంగుడై యట బ్రి
ణమిల్లి। కరికాలచోడని కరుణాతిశయతి। బరగంగ ముక్కన్ను బడసె
గావునను॥ ఆకాళివెట్ట మహాత్వ మెంతని ని। రాకరించుచును నిరస్త ప్రి
తాపి। వెండి యుద్యద్భక్తి విక్రమాన్వితుడ। ఖండిత కీర్తి శంకరదాస
మయ్య। ముక్కంటిచేతను ముక్కన్ను వడసి। తక్కక నిఖిలాస్య దర్శన
స్థులను। క్రొవ్వడంగించుచు కుటిల దర్శనుల। ము వ్వొంటిగొనుచుండె
మును మహాహ్లాదతిని। యన్యదైవత దర్పహరణార్థముగను। ధన్యుండు
దేవరదాసి దేవయ్య। ముక్కంటిచేగొన్న ముక్కన్నులందు। యొక్కనే
త్రముకాదె యూర్ధ్వ నేత్రంబు। కరకంఠుచేనిట్లు కన్నులు బడసి। మెరసి

న భక్తుల మిక్కిలి కరుణ। పండిత స్తుతునకు పండితాఘునకు। పండిత
మల్లదిగ్భద్రేభమునకు। నూర్ధ్వలోచనయుగం బొప్ప చోద్యముగ।
నూర్ధ్వలోచనుని మహాత్మ్యత కరుణ। మరియు నేత్రములు సమ
ర్పణజేసి। వరలంగ జేర్చిన వారినెల్లెడల। గందుము విందుము నాక లో
కముల। కందుమే విందుమే కథలందు మరియు। నాడెల్ల నెరుగంగ నం
బెన్న యెంత। వాడును నేత్రమీశ్వరునిచే మగుడ। బడయునప్పుడ
నిజాంబకముగా కిట్లు। యడనిడు కన్నుదా బడసినవాడే। యానంబి
మాహాత్మ్య మదియెట్టిదనిన। దానీశ్వరునకైన దలప నక్కజము।—

## నంబెన్న కథ.

కావేరి యామ్య భాగంబున మరియు। నావలూరను నగ్రహా
రంబునకును। యిరువుర జంగమం బేతెంచినంబి। తిరుపాటలర్థి సంధి
ల్ల బాడుచును। వరదానమున కేగ వనితాలలామ। పెరియనంగ య
నంగ పృథుభక్తినిరత। వరగుణియొక్క శివద్విజురాలు। వరదానమి
డుటకు వచ్చి యాలించి। యీ తిరుపాట నిం దెవ్వరి కవిత। యీ తి
రుపాటల కేమి యర్థంబు। పాడిన విన్న నేఫలము సిద్ధించు। వేడుక జెప్పు
దా వినియెద మనిన। యీతిరుపాట లభీష్టార్థకరము। లీ తిరుపాటలై
హిక సుఖప్రదము। లీ తిరు పాటల హీన సౌభాగ్య। జాతంబులగు మో
క్ష సౌఖ్య హేతువులు। ప్రతిలేని యీ తిరు పాటల శివుని। నుతియించి
మించు ధన్యునిమాడ్కి వినుము। అంబికాధవు భక్తు డసమానుడొడ
య। నంబినాభక్త గణశ్రేష్ఠు డతని। చారుచరిత్ర మాశ్చర్య మెట్లని
న। గౌరివివాహాభిగమన కాలమున। మృడుడీశుడు శివుండు మేదురకీ
ర్తి। కడు బెడంగడర శృంగారంబు జేసి। వినువీధిదాటిన వీన విస్ఫుర
ణ। దనరారు నిలువు టద్దంబు జూచుచును। జలజాప్త కోటితేజము ధి
క్కరించు। విలసిత నిజదేహ విమల విభ్రమము। నతులితోద్యద్దర్ప
ణాభ్యంతరమున। ప్రతిబింబమై కానబడుడు తదీయ। సౌందర్యమునకు
నాశ్చర్యంబునొంది। సుందరమేయని చూచి హర్షింప। సుకరస్వకీయ
భాసుర దృక్సముత। ముకురస్ఫురితమూర్తి మూర్తిభావించి। యరు
దెంచి ధరణిపై సాష్టాంగమెరగి। కరమర్థిలేనెత్తి కౌగిట జేర్చి। మందస్మి

తముఖాంశు మంజరు లాలయు । సుందరాత్ముఁడు విస్ఫూర్తి నీమూర్తి ।
యగుట సుందరుఁడ వీవను పేరు వాఁపి । తగిలి శంభుండు సుందర
గణాధ్యునకు । వరకృపామతి గణత్వము ప్రసాదించి । పరిణయోత్సవ
ము శంభుప్రీతి సలిపి । యగజయుఁదాను సన్యోన్యసంప్రీతి । దగిలి సు
ఖంపఁగ దా నొక్కనాఁడు । హాటునకు సుందరుఁ డర్థి పుష్పముల । కరిగియు
ద్యాన వనాంతరంబునను । మున్న ద్విజకు పుష్పముల కనివచ్చి । యున్న
కనకలతయును కాంతిమతియు । ననుపతుల్ దాను సన్యోన్యానురక్తి ।
మనసిజక్రీడల మసలి యేతేర । కామసుఖాపేక్ష గలుగ మువ్వురను ।
కామాపహారియు గౌరియు జూచి । భువి మువ్వురును నిలపుట్టి డీతని
కి । యువిదలై యుండుఁడు యువిదలిద్దరును । తనివోవ భువి నేయతను
సుఖాంభోధి । నవయంబు నోలాడ నరుగుండు పొండు । నావుడు దండ
ప్రణామముల్ జేసి । దేవ దేవేశ్వరు దేవి వీడ్కొనుచు । నిలనొప్పు
ద్రవిళ మహీస్థలియందు । నలిదిరు వాలూర నంబియ్య పేర । వడి నుం
దరుండు శివద్విజుఁడైన । జడయారియను పుణ్యశాలికి బుట్టె । ధరనందక
నకలతయును దయించె । పరమనాచియనంగ పణ్యాజాతమున । మంగలూ
రను కాంతిమతియును నంగ । సంగణ సచ్ఛూద్ర జాతి జనించె । శంభు
మూర్తిని నంబిజడయారి యంతె । శాంభవదీక్షాభి జాతుఁగావించి । నా
నంబియును నంత ననుదినవర్ధ । మానాంశుముఁ గర్మమతి జడయారి ।
కపిముఖ ప్రియునిభు గర్భాష్టకమున । నుపనయనము సేయ నున్న నత్తరిని ।
ఘోరుద్రియనగ యా తేరుద్రియనగ । శ్రీరుద్రసూక్త నందిత భావ్యసర
ణి । ధరణీచరవిప్ర తనునాగ శ్రుతుల । బరగు జరాక్రాంత భావంబు
దాల్చి । కృతకకంపు విప్రు డుద్ధతి నేగుదెంచి । యితఁడు మీసుతుఁడె మా
యిలుపుట్టుబన్న । వడుగు సేయఁగ నెట్లు వచ్చుమాదాసి । కొడుకని యా
నంబి కుడి రెట్ట బట్టె । సకల పుణ్యాహవాచనమాచరించు । వరవిప్రులు
ను బంధువర్గంబు జూచి । యతి చోద్యమంది బ్రాహ్మణవృద్ధు ముదిసి । మ
తిదప్పినాఁడో యున్మత్తుఁడో భ్రమసె । నోకృతకంపు దైత్యుఁడో తన్క
రుండో । కాక యొట్టి దయ్యంపు గలుగుకో యనుచు । చెచ్చెర నేతెంచి చె
యిసుబ్బిపాపి । ఋవ్వుచు నటు ద్విజు బాహ్మణి దోయి । సొడసొడల్

జొత్రుము సోలుచు పారి। పడి బూడ గుంతలు బగుల దన్నుచును। వడి
లేచి మరివచ్చి పట్టుడు ది[illegible]లు। పడ కేలుగాగట్టి బిట్టుద్రోచుడును। వ
డకుచు దిరుగుచు వచ్చి [illegible]గడియ। కుడకపై బడి నీరు కూలద్రోయు
చును। మరివచ్చి పట్టు బ్రాహ్మణుని గోపించి। యరిమురి మెడబట్టి య
వల నూకుదును। పడిపడి మరియంత పందిరి కాళ్ల। యడుగులు పెనగొ
ల్చి యడుగున నూప। దండడి యగ్నికుండము మీదపడుక। బందిరి గు
బ్బున బడి మంట లెగయ। దిగ్గన లేచి నల్దెసలును గాల। నగ్ని లోనపడి
యరిగెడువారు। యిళ్లపై నక్కట యట నుర్కువారు। గళ్లుదూరియును
వేగమె పారువారు। చప్పరంబులు నూకి చనియెడువారు। యప్పాటజన
లేక యూర్లెడువారు। గోడలు బడద్రోచుకొని పారువారు। కూడ ము
ట్టిన నగ్ని కొని కాలువారు। గనుకని యొండొంటి గడువంగ విప్ర। జను
లివ్విధంబున జిక్కి నరుగ। మాకలోననజొచ్చి మునుముట్టనంబి। జాం
కిట నిడుకొని జడయారి యరుగ। తనబిడ్డడనుచు మాదాసి బిడ్డనిని। గొ
నిబోవుచున్నాడు కుటిలంపుటరవ। చూడుడీ పారులంచును పురివాడ।
వాడల మొరయుచు వడి బారిపట్ట। కర మద్భుతంబని గరికాలచోడ। నర
పతి య య్యాపనయున విఘ్నంబు। ముదుక విప్రుడుగూడ మొరలెట్టుట
యును। గదసి ముందటి యిండ్లు గాల్చి వచ్చుటయు। సభయును దాను వి
చారించి చూచి। యుభ[illegible]వాదులు గొల్వుండి పిల్పించి। కొడుకు జాంకిట
నిడుకొనుచు నేద్చుచును। జడయారి యేతెంచి సభయెల్లనడల। న్నొకకా
లు[illegible]చు నొకచేత [illegible]యు। నొకచేత నొకలేఖ యును గొంచు
వచ్చితిమ। తభ్యాపితోక్తి ప్రసిద్ధితకపట। లే ఖ్యా యనగ ద్విజముఖ్యు లే
తెంచి। జనులు చోడడు నక్కజంబంద నంత। తనచేతి లేఖయు ధర్మణీశు
వారలి। బెట్టి నరేంద్రమా భృత్యుడీ పాప। డెట్టన్న నంబి నాకెడరైన
కొడుకు। మును మునిముది తొండ్లు పీని స్వన్ బాపి। కొనివచ్చె వీండశే కొ
డుకశే తనకు। ధట్టుండ యారూర దప్పక వెదకి। యెట్ట కేలకు గంటి
నిన్నియ నేడు। చదివింపు మీలేఖ సభయెల్ల వినగ। చదువుచో మీ
స్వామిస్త్యములు లేకున్న। నిలగాదు మాభృత్యుడితడనియున్న। వెలియ
గుబాడ నీవిప్రులకెల్ల। ననవుడునట్ల కాకనుచు నాసభయు। జననాధుడు

ను లేఖ చదివించి చూచి। ధరవిప్రునకు నంబిదాసి యన్సాక్షి। బరగు పంచాక్షరాధి పత్రంబునుండు। హస్తామలక గతిఁనస్మదాదులు ప్వా। హస్త లిఖితదేవాంకములుండ। నా జడయారి స్వహస్తము లుండ । భూజనావ లిచిత్రముల నట్లయుండ।నీవిషయంబుమాకే మనగలదు । శ్రీవయరుగుధ రణీసురోత్తముడ। చంపు రక్షింపుము స్వామి యీ శిశువు । నుంపుము బెంపు నీయొప్పు గొమ్మనుచు। జడయారి దనచంక నత్పుత్రునిచ్చి । య డలుచు విభ్రాంతుడై పడి యరవ। హరమూర్తియును నంత నాదిశై వోక్తి । నరస భృత్యత్వేన జగ్రాహయనగ। భృత్యో గానంబెన్న బ్రీతి జేపట్టి। యత్యుద్ధతిని తిరువాలూరి కపుడ। కొనివచ్చి యేతండ్రి కొడుక వునీవు। ననయంబు యీ తిరువాలూరి శివుని। వాసంబు మనలకు వర్తిం పనిజని। వాసమేనింక నీవాల్మిక దేవు। సదనాంతరంబున జపము జేయు చును। గదలకుండెడపని గలిగె నేనియును। పిలువు మయ్యాయని బ్రియ మైన యపుడ। ఫలము లభీష్టాన్న పానముల్ కజ్జ। ములు సుగంధద్రవ్య ములు భూషణములు। వలువలాదిగ శైశవక్రీడలకును। వలయు పదార్థ ముల్ వంచింపకడుగు। వలసినవస్తువుల్ వారకనిత్తు। లింగార్పితము జేసి లీల గైకొనుము। జంగమవశుడవై జను మెచ్చటికిని । పట్టుకుబ్బుసము ను పట్టు కప్పడము। పట్టుచిందెయు పాపపట్టు కట్టంబు । గంధమాల్యా దులు కనకంపువాలు। బంధుర షోడశాభరణముల్ గొమ్ము । ఆడుము పాడుమీ నభిమతలీల। క్రీడింపుమని నంబికిని గృపసేయ। నంత నంబి యును సమధిగత సుఖని। రంతర క్రీడ నోలాడుచు జెలగి । ఆడుగుల్లను గట్టి హారునిల్చి మ్రోలి। ఖాడునొప్పగ తిరుపాటలభక్తి । పరుల పాపడి కిచ్చు వలయు కజ్జములు। కరమర్ధిసలుపు జంగమ మనోరథము। యే ప దార్థంబెప్పు డిష్టమైయుండు। నా పదార్థంబయయ్యా యని వేడి । కొనివ చ్చి సుఖయింప గొన్ని దినములు। ననసంబిజూచి యా నద్విజుండైన। తె ల్లంబు వాల్మీక దేవుండ నిన్ను। వాల్లభ్యమున నేవ దలచి గైకొంటి। వేడుక లాదవంగ వినయ మార్గములు। పాడుము నను దిరుపాటల నను చు। దోనొప్పె నగు హేమతాళంబు లొసగి । గాన విద్యాప్రౌఢి గరు ణింపనంబి। కంబళా స్వతరుల గంధర్వవరుల । తుంబురు నారదాదుల

మీరిపాడి। హరుని మెప్పించుచు నభిమతార్థములు। వరుడిచే బడయు
చు వర్తింపుచుండ। అంతయౌవన దర్పమా సన్నమగుడు। నంతంత బు
ష్పాస్త్రు డల్లనజేర। హరుని వాల్మీకేశు ననయంబు గొల్చు॥ వరవిలాసి
నులలో వర్తించిహావ। భావవిలాస విభ్రమరూప కళల। భావింప నెప్పా
రు భావజ తిలక। తరుణీలలామ యుత్తరభక్తి నిరత। పరమనాచియు
దాను ప్రతివాసరంబు। హరుగొల్చు పణ్యాంగనావలిలోన। పొరిబొరి వ
చ్చుచు బోవుచు నునికి। ధరవయోధర్మోచిత క్రియలెంచి। కర మర్థిగూ
డి యొక్కటియాడి పాడి। పిన్ననాటనుగోలె పెరుగ నిర్వురకు। నన్ను
తాన్యోన్య ప్రసక్తి పెంపునను। జిలిబిలిబోవు మచ్చికలు పిచ్చిర్ల। బిలిబి
లి లజ్జలు బిరుదు లాడంగ। పొందాన పాటు చూపులు చుట్టుముట్టి। దం
డడి కూర్మలు దగులంబు మిగుల। కర ముచితోక్తులు గలిగి పెంపెసగ।
నకుదొంద హృదయంబుల నగిపెనంగ। దరహాసదీప్తులు తట్టుముట్టాడ।
చెరలాడు చెయ్వులు చెంగడి గొనగ। చెనయు ముత్పులు కలు చెమట
జనింప। దనరు నిట్టూర్పుల దనువెచ్చ దోప। తరిదరి దనువుల దాపంబు
దొడర। వరలుచు నధరముల్ వరవట్టువట్ట। తమకంబు గమకంబు తల
పు లల్లార్ప। సమయౌవనత్వంబు సన్నలు సేయ। మక్కువ పెక్కువ మ
తులు గరంగ। నెక్కుడు రతిచిహ్న లెదురు కొనంగ। స్ఫురియించు క
ళలకు పొద్దులు సొరగ। సురత సౌఖ్యంపు ప్రసూతి దగ్గరగ। మరున కి
ట్లగపడి మరియంత నంబి। హరుని మెచ్చగ బాడి యయ్యె నాజియ్య। ర
మణీలలామ పరమనాచి దనకు।రమణిగా జేయవే రమణతో ననుడు।తన
తోంటి విప్రవతారంబు దాల్చి। చని యాపరమ నాచిజనకుల జూచి।
నంబి యొప్పగువాడు నాబిడ్డడితని। కింబుల మీబిడ్డ నిందు నావృషును।
మలువక ముప్పొద్దు మలహరు గొలుచు। చెలువలకును విలాసినులకు
నొక్క। మగని వరించుట మార్గమే మ్యాకు। దగున్నె యట్లునుగాక ధరణి
లో నంబి। కేతల్లి యేతోడు యేయిల్లు పుట్టు। నీతనూభవుడన్న నేరము
గాక। మెచ్చ దింద్రాదుల మొలత యానంబి। మెచ్చునే యరుగునే మీ
దాసి కొలది। కాంత సాక్షా ద్దేవగణిక సౌభాగ్య। వంతపద్మిని జాతి వని
తాలలామ। తరుణికి బ్రతివోల్ప ధరణిలో గలదె। తరుణు లత్తన్వి కతం

బోయి మారారికరుణ। నంగసంగను వివాహంబయి తోంటి। యటుల
కామసుఖామృతాంబుధి కేలి। విటులు పణ్యాంగనా విసరంబు గొలువ।
వర్తింపుచుండ నవారిత ర[?]। మూర్తి నంబెన్న సమున్నతలీల। యా
నంబిమహిమ యేమని ప్రస్తుతింప। నాకంబి పూర్వ వేశ్యాంగన పరమ।
నాచి కేళీగృహాంగణ మహత్వమదియు। గోచరం బెట్లున్న నాచోడనృ
పతి। పొలతి పంచత్వంబు బొందుడు శల్య। ములు గయకనుచు నప్పుడు
చోడవిభుని। యారాధ్యులాది ముక్కాలాశ్వారనంగ। మూరారి సద్భక్తి
మహిమ వీక్షించి। మనుజేశ విను గయామాహాత్మ్య మొక్క। దనుజు
డత్యుగ్రింపు తపమాచరించి। త్ర్యక్షునక్షణమ ప్రత్యక్షుగావించి। యీ
క్షితి సాష్టాంగ మెరిగి యిట్లనియె। యురు శిలారూపమై యుండంగ ధ
ర్మ। హరమూర్తి నావీపునందు మీరాయమ్మ। పాదముచ్ఛాత్రిక పర్ధితదు
ద్రి। పాదంబుమీద సద్భక్తి మానవులు। దారత పిండప్రదానముల్ సే
య। దారచేజేత భ్రితాల్లుగ్రహింప। కరమర్థి బిత్రు లోకగతికి నేగంగ। గ
రుణింపుమని వేడ గరుణించె శివుడు। అక్కజం బెంత గయాసురుమీద।
ముక్కంటి శ్రీపాద మొక్కండె కాదు। అనఘుబెల్లత్తిరు వాలూరనంబి।
వనితపరమనాచి వాటికాభూమి మృతుడు శంభుండు వాల్మీకేశు డర్ధి। నె
డపక ముప్పది యేండ్లు నిచ్చలును। గొనకొని నంబికి కుంటెనుబోవు। చు
ను వచ్చుచును సముత్సుకతమై పడుచు। జాడలు శతకోటి సంఖ్యలుండం
గ। గూడునే గయ కంప క్షోణీతలేశ। యనుచుం నుత్తుంగ చోడావనీ
నాధు। జననీక దోడ్తెచ్చి। చక్కననంబి। తరుణి పరమనాచి తద్గృహాంగ
ణము। తిరువీధియుం దవిధి ప్రయుక్తముగ। బిండముల్ దొడిదొడి బెట్టం
గబనుప। తండతండములు బితౄళ్ళ కొక్కొక్క। తరములవార త్తక్షణ
మ యేతెంచి। కరమర్థిచేజేత గైకొని యపుడ। కనుగొని రుద్రలోక
ప్రాప్తులు గను। మునుకులకోటి స్సముద్ధరేత్త నగ। ఘనసూక్తి నృపతికి న
త్యాశ్చెతనర। జను లద్భుతంబంది వంపుటుల్ సేయ। నుత్తుంగచోడ మ
హీభార్తికతిలకుడత్తరి గురునకు సాష్టాంగమెరగి। జియ్య సాక్షాత్తిరు
చిట్రింబ రేశ। యయ్యా తదియ్యా మాహాత్మ్యంబుదలప। యిదియెంతకో ను
క్క యిలుసొచ్చిసొచ్చి। పదపడి నిచ్చలు భాండముల్ మిట్టి। వారింప

జాలక శ్వానంబు నేసల। చారు త్రిశూలలాంఛన మొత్తి విడువ। యిం
టిలోన నది యథేచ్ఛాప్రవృత్తి। పంటింపకుసిఖి యబ్రాహ్మణు లెరిగి।
కుక్క యెంగిల్లు గైకొను భక్తి గలదె। యెక్కడ వినమని యెంచి నిం
దింప। కుక్క యేయదిదీని కుక్కయన్ త్రాట। కుక్కలు భువి చెడ్డ కుక్క
లుగాక। యెరుగరే శూలి సన్నిహిత మహిమ। మరి యగ్ని నాపత్య
మానాచ్ఛయనియు। లావున్నై యది త్రిశూలాగ్ని హతస్స। ధావతి య
నగ వేదములు త్రిశూల। ధారణత్వము మహత్వము నీరలుచు। నా
రంగదచ్ఛ్రుతు లందరు వినగ। సారమేయముచాత జదివించ రెట్లు। వారక
బ్రాహ్మణుల్ వడిజాగి మ్రొక్క। ఘనుడు హోవిసహాళ్ళ కల్లిదేవయ్య।
శునికి చే జదివించె శ్రుతి చతుష్టయము। గారవింపుచు మహా కాళ
య్యగారు। సారమేయంబుచే జదివించె తొల్లి। కుక్కచే వేదసూక్తులు
తెస్సనేడు। గ్రక్కున జదివింపగా మీకె జెల్లె। ననుచు నుస్త్వస్త హాసులై
భక్తు। లను కీర్తనలు సేయునట్లునుగాక॥—అత్యుగ్రుడొకవిప్రు డగణి
తబ్రింహ్మ। హత్యలు సేయ బ్రాహ్మణులు విధింప। జాలకశ్రుతులు వి
చారించిచూడ। నేల విచారింప నిదె కాదె సూక్తి। మహిశతరుద్రీయ్య
మధ్యగాయనగ। మహిత రుద్రాధ్యాయ మధ్యంబునందు। వేయునేల
నమశ్శివాయుచ శివత। రాయచయనుచు దురంతమై మోర్గియ। నెం
దంగ నారాయణోపనిషత్తు। నందొన్న మశ్శివాయై యనునట్లు। సరవి
రజానెళ్ళ స్వాహాంతముగను। వరుసనందు నమశ్శివాయేతియనగ। చ
ననసే నసదృశం జపంబనగ। సనుషక్తి సంత్యజోవాగ్రిజోవాపి। యన
బతితోవాపి యునయేన్మరంతి। యనజపతోవ్యాప్న యాచ్ఛివంబనగ।
అకుటిలమూల పంచాక్షరీ మంత్ర। మొకమాటుచాలదే యుచ్చరించిన
ను। ధర బ్రహ్మహత్యార్బుదంబులడంచు। నురుశక్తి మఱయొంటి కున్న
డే యనుడు। సర్వకృచ్ఛ్రాదులు చాంద్రాయణములు। సద్వదివీణదా
న సత్క్రియల్ భూప్రి। దక్షిణంబులు తద్వ్రతపరిచర్యలును। భైక్షా
న్నములు దత్కపాలధారణము। వెలియుగా నేశ్రుతి విధియింపనేర్చు। అ
లఘుతీరబ్రహ్మహత్యార్బుదమున। కిదియె ప్రాయశ్చిత్త మిట్లయ్యెనేని।
మొదలి వేదాగమ ముఖ్యకృత్యములు। చనుభాట్టకృత సహస్రన్యాయ

విధులు। జన విహితాష్ట దశస్మృతి క్రియలు। ధరకు దృష్టములె మిథ్యలె యెట్టులైన। ధర నెన్ని బ్రహ్మహత్యలు సేయరాదు। యిల నింతటనె బాయునే యెన్నిమాట్లు। అలరిర నమశ్శివాయ యనంగరాదు। యెందైన నిటువంటి లెద్దినారనిన। గొందిగట్టిదమను చందముల్ గలవె। యెప్పాట వినబడ దిదికుదృష్టంబు। చెప్పకుడీ యప్రసిద్ధంపు విధులు। విధిపూర్వకం బగు విధిగలైనేని। విధియింప డోల్లరే వినుచుండు డనుడు। పరగదధీచి శాపంబుచే జెడిన। చిరతమోవృతదుష్ట చేతస్కులార। ముసు గౌతముని శాపమున భ్రష్టులైన। ఘనతమోపహత సంగతచిత్తులార। పలుమారుభృగుని శాపంబున జెడియు। పలుక జూడగ రాని పాషండులార। పరువడివ్యాసు శాపంబున జెడిన। నరకాప్తులగు సమున్నతచిత్తులార। శ్రుతియయమధ్యాన రోచతేయనగ। హితమగునే నీకు నీశానుమహిమ। విధిలేకయే జగద్విభుడు రాముండు। విధిపాత్రురావణు వధియించినట్టి। హత్య బాపుకొనండె హరు బ్రతిష్ఠించి। సత్య పంచాక్షరీ జపములయందు। అరి యమరాజు షంచాక్షరీసిద్ధి। హరుగూడడే బ్రహ్మహత్యకు బాసి। సతత పంచాక్షరీ స్మరణ చందముండు। ధృతిబొందెనే హత్య ద్విజుదండిప్రజంపి। కాన పంచాక్షరీ కల్పనకంటె। దానున్న దేవిధి ధరనిట్లుగాక॥ ధృతినేకమేవా ద్వితియ్యంబనంగ। తతిన ద్వితియ్యాయతస్థేయనంగ। గురునద్వితియ్యాస్తి కుతంత్రచిత్తనగ। మురక యేకోరుద్రయుచ్యతే యనగ। యొనరలయాల్లింగ ముచ్యతే యనగ। చెనసి జగంబులు శివునంద యుడగుపాయక మరియట్ల పంచాక్షరేష్టి। తాయన నాజగత్ప్రళయ కాలమున। దలప వేదాశ్చ శాస్త్రాణియనంగ। నిలను మంత్రైరనేకథాయనగ। తరితరిశ్రుతులు శాస్త్రములు మంత్రములు। నెరిపురస్తస్తత్ర నిర్గతాయనగ। బరగుచు సకలశబ్ద ప్రపంచంబు। పరుస నట్ల యథాశివస్తథాయనగ। నడగ జనించు పంచాక్షరీయందు। నడర దన్మహిమ యేమని బ్రస్తుతింప। నట్టి పంచాక్షరి యతుల మహత్వ। మిట్టిదయని మీర లెరుగక భ్రమసి। మదియించి పలుకు దుర్మతములు గాక। యది కుదృష్టం బెట్టులనవచ్చు। మరియు। క్షితిబ్రహ్మహత్యాంచకృత్వాయనంగ। ప్రతిముచ్యతే సర్వపాపైరవంగ। ఖ్యాత వేదోక్త సంగతిపాతకోపి। భాతకేభ్యాయ నపూతో

భవతియ। ననుత్రిపుండ్ర ద్ధూళనమున జేసి। యనుపమంబగు బ్రహ్మహ
త్యలువాయు। నెనయ పంచాక్షరీ యింతయేమిటికి। ననియో యిదికుదృ
ష్టమనుట వెండియును। ధరశ్రుతు లేనాసి తత్రతియనంగ। వరున సరు
ద్రో భవతియన నిట్లు। తనరారు రుద్రాక్షధారణంబునను। యనుపమం
బగు బ్రహ్మహత్యలువాయు। నెనయ పంచాక్షరీ యింతయేమిటికి। నని
యొయిదికుదృష్ట మనుట వెండియును। అవికల్పరతిబాధకావహంబనగ।
భువి బ్రహ్మహత్యా వ్యపోహతియనగ। దనరారు నిర్మాల్య ధారణంబు
నను। యనుపమంబగు బ్రహ్మహత్యలువాయు। నెనయ బంచాక్షరీ యిం
తయేమిటికి। ననియొ యిదికుదృష్టమనుట వెండియును। విన రేమి పూతో
భవేత్యశురనగ। చెనసి మత్పాదంబు సేవనాత్తనగ। దనరు పాదోద కధా
రణంబునను। యనపమంబగు బ్రహ్మహత్యలువాయు। నెనయ బంచాక్ష
రీ యింతయేమిటికి। నని యొయిదికుదృష్టమనుట వెండియును। మేలుగా
వ్యాహిహాద్వమీపాశ్చయనగ। వాత్రిపూతావేర్భవంతియనగ। దనరు
ప్రసాదైక ధారణంబునను। యనువమంబగు బ్రహ్మహత్యలువాయు। నెన
యబంచాక్షరీ యింతయేమిటికి। ననియొయిదికుదృష్టమనుటవెండియు
ను। కరమఘోరాపాపకాశినీయనగ। ధరబ్రహ్మహత్యాయుతానీచయన
గ। ధరబ్రహ్మహత్యాయుతానీచయనగ। దనరు శివభక్తదర్శనంబునను।
యనుపమంబగుబ్రహ్మహత్యలువాయు। నెనయబంచాక్షరీ యింతయేమిటి
కి। ననియొ యిదికుదృష్టమనుచు వెండియును॥—దండడి బ్రహ్మహత్యాం
చాయనంగ।నంద ఏ తేఘ్నంతియనగనత్తుదిని। యతిఘ్నవర్ణంబునందుసో
మః౹విప్రమత్సేతి నావిశ్వైకజనిత।మయిన యీశుడయు మాయాసహా
వర్తి। తయితిసోమయనంగ దవరుగావునను। పనుగొనసోమాంకుపఠనం
బునందు। ననుపమంబుగ బ్రహ్మహత్యలువాయు। నెనయ బంచాక్షరీ
యింతయేమిటికి। నన్నియొయిదికుదృష్టమనుట వెండియును। శ్రీతిసమంయ
ద్యక్షరాన్నాస్తియనగ। రతిశివ ఇత్యక్షరద్వయంబనగ। శ్రుతియశ్శివేతి
స్మరేత్కశ్చరనగ। స్థితిశివమేవానుచింతయేత్తనగ। జనయశ్శివేతి వాచంవ
దేత్తనగ। వనరు నిత్యాదిసూక్తములు దలంప। పాశుపతంబేల షత్షికి
దొడగ। నీ శివస్మరణ దానేల హత్యలకు। శివుసమర్చన జేసినగానిపోని।

శివనామముచ్చరించినగానిపోని। యంతపాతకము సేయగలేండు మనుజు।
డంతపాతక మున్నదియు లేదనగ । సిద్ధపంచాక్షరిచేగానిపోని। బద్ధపా
తకకోటి పంబ్బు లున్నవియెయ్యి యొక్కవిభూతియు నొక్కరుద్రాక్ష। యొ
క్కపాదోదకమొక్క నిర్మాల్య। మొకప్రసాదంబును యొకసోమపథన।
మొకభక్తదర్శనం బొక్కడొక్కండు। సకలభవంబులు సకలదుఃఖము
లు। సకలహత్యయుపాప జాలునన్నట్టి। వచనంబులవిగావ వచనాప్రవృ
త్తి। వచనాస్నిహృత్తియు స్వచనంబుగాగ। నిఖిల ధర్మాధర్మ నిర్ణయో
క్తములు। నిఖిలశివాధిక్య నిర్ణయోక్తములు। అవిరళాచార వర్ణాశ్రమం
బులును। వివరింపనవియును వేదమోదములు। నవియు మీకెట్టుల నను
మతంబయ్యె। నివియు మీకనుమతం బెట్లునుగావు। భువినిదానింతనంబు
లో సమాక్షేయ । కవితలో ప్రత్యక్షకలితవాక్యములో । కతిపయ
స్వసమయ గతసాక్షికములో। శ్రుతిఫలంబులో ఫలశ్రుతులో కాదేని।
పూని శ్రౌతస్మార్త భూతసూతప్రతానముల్ గావో యత్తరినిషేధము
లో। నెరయధర్మాధర్మ నిర్ణయంబులకు।మరిలేదువచన ప్రమాణంబుగా
న। నెరయ శివాధిక్య నిర్ణయంబులకు। మరియొప్పువచన ప్రమాణంబు
భక్తి। మహిమబ్రత్యక్షప్రమాణముల్ జూప। మహిత పంచాక్షరి మహి
మనిష్ఠింతు। జనులకునెల్ల దృష్టప్రత్యయముగ। ననుచు ముందటిబ్రహ్మ
హత్యాత్ము చేత। నుపవాసమటమున్న యునిచినయట్టి। కపిలధేనువునకు
గసవువేయింప। మొదవు తాముట్టక మూర్కొనకున్న। యదియట్ల వె
ట్టి పాపాధికనీవు। నలరి నమశ్శివాయ యనుచు శివుని। వలగొని కసవింత
వైవునావుడును । వాయూరగ నమశ్శివాయ నమశ్శి। వాయనుచు
వాడు వచ్చివైచుడును। యెదురుగా నేతెంచి యప్పటి కసవు। మొదవం
దుకొని మేసె ముదముదలిర్ప। సకల భూసురులు మస్తకతటన్యస్త। ము
కుళితహస్తులై మ్రొక్కంగనంత। పాటిగా నిజ్జగ త్ప్రత్యయంబునను। తే
టపడగ శివాధిక్యతమరియు। శ్రుతిమూలమగు మహాస్తోత్రమస్మృతిని।
ప్రతిభదలిర్స సంపాదింపదెట్లు।గావున మీదు విఖ్యాపితమహిమ। మావ
శంబగునె సమాఖ్య గావింప। ననుచు చోదనరెండు దంకింపనంత। నన
ఘుండు యొడముక్కు లాళ్వారునంబి। వనిత పర్వమనాచి పాటికామహి

మ। జనులకు నెల్ల దృష్టముజూపెగాన। యదియవారాణసి యదియ శ్రీ
శైల।మదియెదాగేదార మదిగయయదియు।యుది యవిముక్తభూమిదాన
నుచు నంబెన్న। ప్రవిత్రమ హిమయు బరమప్రాచిగృహ। వాటికాస్థల మ
హత్త్వము జంగమంబు। పాటిగా విరచించి పరమార్థమిదియు। యనవృష
హర్షించి యాశివద్విజుని। వనిత పుత్రులునాకు వర్ధిలిరేని। నంబి పేరిడి
దాన నవిరెందరైన। నంబి కాథవునానయనుడుజంగమము। మానంబికరు
ణా సమగ్రత జేసి। పూని సత్పుత్రుండు పుట్టెడునను చు। లలనాలలామఫా
లంబున భూతి। తిలకంబుగా బెట్టి దీవించి చనుడు॥—మగువకంతట నెల
మసలె గర్భంబు। మగువయేరాలికి మసలెగర్భంబు। సతులకు నవమాస
సంప్రాప్తిగాగ। సుతులుజనించి రుత్సుకశనిర్వారకును। పెరియనంగయ
నంబి పేరిడతోడి। తరుణియువతి గన్నతండ్రి పేరిడుడు। ననుదినవర్ధమా
నాంగులైయుంత। తనయులిద్దరు బెర్గ తరుణులిద్దరును। యొక్కనాడ్కా
వేరి యుదకంబులకును। చక్కన దనయుల చంకల బెట్టి। కొని పోయినది
దరి గూర్చుండ డించి। తను ధర్మములకు నత్తరుణులేగుదును। నంబియు
ననుజుండు నలిబ్రివాహెూద। కంబులదరి జరుల్ గట్టియాడంగ। గసి
మెసంగుచు తీవ్రగతి నంబి నొక్క। మొసలియేతెంచి సముద్ధతిబట్టి। కొ
నిపోవ దరినున్న కొడుకువాపోవ। విని యుల్కిపడి బలువిడి వచ్చినంబి।
నొక మొసలీడ్వంగ నువిద వీక్షించి। యకటకటాయంచు హాయంచు గర్భ।
మడచ్చికొంచును దేవుడాయంచు నేల। బడిపొరలుచు నుతుబనుపుచు వా
యి। విడిచి యేడ్చుచును గావేరిలో దాను। బడబోవుచును శోక పారవ
శ్యమున। పొడిపొడి పొక్కుచు పొరలుచు నంత। దొడరంగబతియు బంధు
లు నేగుదెంచి। సంబరంబులు జేసి శైవోక్తవైది। కంబుగా నాముష్మిక
క్రియల్ సలుప। కనురెప్పపాటైన గనలేదు తల్లి। తనయుండు నినుబాసి
దరియింపగలనె। సంకటడిగ్గినజీవి స్తనిమెదు దల్లి। యింకిటనినుబాసి యే
గంగగలనె। ప్రక్కబాసిన భయపడియెడుతల్లి। యిక్కడ నినుబాసి యే
నోర్వగలనె। వెసనిల్లువెడలిన వెతబడుతల్లి। మొసలికొప్పించి యిమ్ముల
మనగలనె। నెట్టణచెమట యేనెత్తురందల్లి। పట్టి నిన్బాసి యేబ్రతుకంగగ
లనె। యనవేల వేయు న్నాయున్న నేరంబు। నినుబాసి నిలువంగ నేర్తునే

యనుచు। నున్న పుత్రునిమన్కి యున్కియురూపు। చన్న పుత్రుడు నొ
క్క చందంబు గాన। యేరాలిసుతుమాట లెప్పుడాలించ। కూరిమి సు
తుపలుకులు నపుడు తలచు।యేరాలి సుతు నెప్పు డీక్షించునపుడు। గారా
పుసుతుని యాకారంబు దలచు। యేరాలి సుతు నెప్పు డెత్తి ముద్దాడు।
నారంగసుతుముద్దు లాటదలంచు। మడతి పేరు యనంగ మఱియా క్రమ
మున। నుడుగని పుత్రవియోగ దుఃఖాగ్ని। వందుచు గందుచు వన
రుచునాత్మ। గుందుచు డయ్యుచు గ్రియ్యుచు సుతుద। లంచి తలంచి
ప్రలాపించునుపిద। సంచలమతినట్ల చరియింపనంత। గడగి మరిది సుతు
గర్భాష్టకమున। వడుగు సేయంగ నవ్వటుకుమారుండు। సరసర జనినమ
స్కారంబు జేసి। పెరియనంగను స్వర్ణభిక్షంబు వేడ। భిక్షంబుదీవించి పె
ట్టుడు సతికి। టాక్షcబునందుదుఃఖాశ్రులు కొరుగ। నెక్కొన్న బుడి
బుడి నీరుకన్నులను। గ్రుక్కికొంచును సమాకులత బొందుచును। యి
చ్చట సుతునల్చి యేడ్చినదిట్టు। వచ్చునంచును గడవయు నొక్కచుమ్మ
యునుగొంచు కావేరి యుదకంబులకును। చనుక్రియ జనితొంటి చక్క
నసుతుని। బనుపుచు నేడ్చుచు బలవరింపుచును। తనయు బేర్కొని తరి
దరిరాచి। హానcబి హానంబి హానంబి నcబి। యోనంబి యోనంబి యో
నంబి నంబి। నానంబి నానంబి నానంబి నిన్ను। యేనమ్మి యేనమ్మి యే
నమ్మి చెడితి। సనుచు వాచరువంగ నంతకమున్న। యనఘుండు సంత
తో ద్యద్గుణస్ఫూర్తి॥—హతభవజూర్తి దిగంతైకకీర్తి। గతనతజన స
ముత్కర సంశ్రితార్తి। కమనియ్య సకల జగద్వ్యాపవర్తి। ప్రమథేంద్ర
మూర్తి చేరమచక్రవర్తి। యొడయ నంబిని సుమహాదాత్త యశుని।
మృడ సమన్వితదయా మృతవార్ధిచుగ్ను। సద్యఃప్రసాద భాస్వద్భక్తి
యుక్తు। హృద్ధ్యానవద్యమహిష్ఠ చరితు। నతులదృష్ట ప్రత్యయారూఢమ
హిమ। రతిపతి సన్నుత రతికళాదక్షు। ప్రత్యక్షకలియుగ ప్రమథగణేశు।
నిత్యశివానంద నిరవధిసౌఖ్యు। వినుతసాక్షాద్వీట వేషితగ్రుద్రు। ?నుపమ
గానవిద్యాపండితేంద్రు। విత్తేశ సఖసఖు వీరసద్భక్త। సత్తముసర్వప్రసా
దసర్వాంగు। విస్మయాభిష్టితా విశ్రుతవ్రతుని। సంస్మితముఖవికస్వరుని
భాస్వరుని। శ్రీలింగపరికరు శివపదాచార్యు। పాలితస్వసమయ ప్రథితప

తాపు। సందర్శనము సేయు జను దేరభక్త। బృందంబు సెలగ నంబియు నె
దురేగి। యన్యోన్యసందర్శ నాన్యోన్యవినమి। తాన్యోన్యవాగ్బంధురాలిం
గనాది। సముచితసవినయ సత్కారపూర్వ కముగ జేరమరాయ గణ
నాథుతోడు। కొనిపోయి భక్తసంకుల సహితముగ। చెనేసి లింగార్చనల్
సేయించుతరిని। శీల సంపన్నుండు చేరమవిభుడు। పాలుమాలింగంబు ప
శ్చిరంబునను। వడ్డింపదగదొక్క వ్రతమునావుడును। వడ్డింపగారాని వ్ర
తమేమియనుచు। నంబెన్న లేచి విన్నపమాచరింప। నంబియీశుడు వ్యా
ఘ్రపాదునిమ్రోల। తాండవం బాడను దాత్తతవెలుగ। పాండురాంగు
ని యామ్య పాదదర్శనము। గావించినప్పుడు గానియుద్వింప। మీవిధం
బునబాసయిది వ్రతంబనిన। నట్టిదకాలంచు నప్పుడు నంబి। చిట్టితాళ
ము వ్రేసి చెయ్యెత్తి మ్రొక్కి। తిరుపాట నీశు ప్రార్థించి నుతించి। యురు
దయాంభోధి యిందొంకమాటేల। చిక్కక నిచ్చలు చేరమమ్రోల। నొ
క్కొక్కమారు చెన్నొలయ తాండవము। నటియించుచును శివానాథ
మన్నాథ। పటుకాంతి వెలుగు నీపాదంబు జూప। రక్షింపవేయని రాయు
డు దాను। నీక్షితి సాష్టాంగ మెరుగుడు శివుడు। నప్పుడు లింగ పూజాం
తంబునందు। యొప్పార నిజతాండవోద్ధతినిలిచి। చేరమయావజ ఝుంకృ
తుల్ దనర। నాదూథవాద్య తూర్యాదులు మొరయ। మలయక చిణిచి
ణి మణిఘుర్ఘురములు। చెలగ నాడుచుదీర్పు చే గాలుజూప। మరి నంబియు
ను జేర మయుభక్త తతియు। తరిధరి మ్రొక్కుచు తద్ద్వతోద్యాప। నంబా
చరించి గణములు చేరమరియు। నంబియు లింగార్చనంబు జెల్లించి। కడు
బ్రీతి నిష్టలింగప్రసాదంబు। లదర భోగింపుచు నహర్నిశము। శివభక్త
తత్సంగోష్ఠిప్రసంగమున। దివురుచుండ గాగొన్ని దినములు సనియె। చక్రి
వర్తియు నిజాస్థానికి జనను। పక్రమించుడు నంబి పటుభక్తియుక్తి। వా
హనవస్త్ర సువర్ణాభరణాస। మహోద్యభీష్టార్థ ముఖ్యవస్తువుల। రాజిత
కీర్తి చేరమచక్రవర్తి। బూజించి తద్భక్త పుంగవుల్ దాను। ననుపంగ వి
చ్చేసెనయ్యావలూరి। దనరారు కావేరి దరినొక్క శివగృ। హాబాస
కంఠమున గొల్వుండగ నపుడు। వాపోవుచున్న యువ్వనిత యార్తార। నం
బు నాహారవంబునాలించి। నంబి యిదేమిరా నంబెన్న నంబి। చెడితిరా

యని యెడి చెడి యొక్క వనిత । కడుచిత్రమరయుడు గ్రిషమునననుడు।
ద్యూతలు చని యేల దుఃఖించెదిచట। నాతి యేపూరిద్యానవు నామమేమి।
యెక్కడనుండి నీవే తెంచితివప్పు। డిక్కడ నీవేల యేడ్చెదవనుడు। పోదు
రుగాక మీ పోయెడిత్రోవ। మాదిక్కరియనేల మాకును మీకు। కార
ణం బేమేని గలదె మే మాడు। వారము బ్రాహ్మణవారమట్లయిన। యే
కతం బొక్కతే నేనున్నయడకు। మీకుపచ్చుట ధర్మమే యేగుడనిన।
ఓయమ్మ యేగక యుండెద మెట్లు । వాయెత్తి యేడ్చుచు వాచరుచుచు
ను। పనుపుచు నరచుచు పలవరింపుచును । పనుగొన నెన్నుచు బలుమా
రు నిట్లు। నంబి నంబెనయని నంబిబేర్కొనుచు। ధంబేమి యెక్కడి తల్లి
వినంబి। యెక్కడిసుతుడు యిదేమి యాశ్చర్య। మిక్కుతయున్నట్లు యెరి
గింపుమనిన॥ హారునికుంటెనబుచ్చు నటువేయుమాడ । లరుదుగా పని
గొను నటె యనుదినము। నంబి నానొక్క గణింబంచు జంగ । మంబు
జెప్పగవిని మరుల్కొందనంబి। పేరుబెట్టితియొక్క బిడ్డవియట్టి। గారాపు
పట్టి యిక్కడచెరుల్ గట్టి। కొనియాడునట్టి యెక్కడు ముద్దుపట్టి। గొ
నిపోయె బుత్రి గ్రక్కున దిట్టమొసలి। నడచాటు ప్రాయమున వరత గ
లసె। నడర బుత్రుడు జచ్చి యైదేడులయ్యె। కుంటెన బుచ్చు మిక్కుటపు
భక్తుండు। కుంటెనబోవు మిక్కుటపు భక్తుండు। కుంటెనబోవు మిక్కు
టపు శంభుండు। పడిగొను నంబియు పడివెట్టుశివుడు। కడునర్థినాసుతు గా
వంగ లేర। తన పేరువీడు గదాయననంబి। తనపేరు నంబెన్న దాగావవల
దె। తననంబి నంబిగదా యనిశివుడు। తననంబినంబి మున్ దాగావవలదె।
యననేల వేయు దా నదియట్టులుండె। వినుడు నేడే నేడ్చు విధముచెప్పె
దను। నేడు నాయూరాలి నిజసుతు వడుగు।వాండువాండును నొక్కపయ
సుగావుసను। చెచ్చెరసుతుడున్న జేయనేనేడు। నచ్చుగావడుగంచు నడ
లుపుట్టినను। యచ్చోటనేడ్చుట యవనీతి గాన। యిచ్చోట నొక్కతే నే
డ్చెదనంచు। వృత్తాంత మంతయు వినిపింప దూత। లత్తరి నంబెన్న క
ట్లువిజ్ఞాప। నంబాచరింపుడు నంబి నవ్వుచు ర। యంబున నప్పుడ ధృతివ
తద్వారుని। వెస బిలువగ బంచి విప్రుడ నొసలి। పనుపు నక్షతలును పరిగి
గెడ్డంబు। పసపు జన్నిదముల పసపు నిదేమి। మొసగంగ నింట నేడెమి

శోభనమో। నందను లెందరు నామంబు లెవ్వి। యందుచు నేడేల వనిత
యేడ్చెడిని। యనవుడు నేడు నాయనుజ ద్వితీయ। తనయునివడుగు సం
తానంబు లేక। పెద్దకాలంబు మాపిత్రియభామ యుండె। యిద్దరు జంగము
లేతెంచి నంబి। నంబియనుచు సుక్క నరుని గీర్తింప। యింబనగొండి
మాయింటిపై కొలిపి। పుట్టెడు తనయుండు పుట్టెడునతని। బెట్టుడునంబె
న్న పేరంచునరుగ। బుట్టెపేరిడుడు నాబుట్టెనో పుత్రు। డట్టనుగాక దై
వాధీనమునను। పుట్టెనో యరుగము పుట్టెడునాతి। పెట్టెనా నంబెన్న పే
రెంతవాడు। కావేరిలో చెరులగ్గటియాడంగ। వానిని మొసలి వేవచ్చి భ
క్షించె। మరిలేరు పుత్రులు మద్భార్యభ్రమసి। పెరు మనుష్యుని పేరు బెట్టి
ననరుడు। గావంగ బ్రోవంగ గలడె వాల్మీక। దేవుని పేరేల ధృతిబెట్టవ
య్యె। హరుడు కుంటెనబోవు నటెవేయుమాడ। లరుదుగా బడిపెట్టు న
టెనంబికట్టు। నంబియు గింబిపినాకిగినాకి । నంబి పేరిడ్డ తనయుగావలేరె।
గొడ్డుపీగిననిన గొడుకు గారాపు। బిడ్డని మొసలి కొప్పించితిగాక । చె
చ్చెర కొడుకున్న జేయనే నేడు। నచ్చుగావడుగంచు నహరహంబులను।
నది యాదిగా దుఃఖమారదు యింక। నది యెట్టులుండె మా కరుగంగ
వలయు। ధరశివద్విజుడ స్వాధ్యాయపరుండ। పరమ పతివ్రత భార్యసద్భ
క్తి। యుతమిధునమునకు యోగ్యులమేము। రతినుమామాహేశ్వ రప్రీ
తిగాగ। దగిలిపెట్టినయట్టి దానమనంత। మగుదాన మణ్యాపిచాత్మయం బ
నగ। వనుచు దీక్షించ ధ్యానర్థి నవిప్రు। గనుగొని నంబెన్న కన్నులనగు
చు। నీవు సెప్పినయట్ల భూవిబుధేంద్ర। భావింప నీకొండు పానలేమిటికి।
నంబినంబి యని తనయు మన్నెనేవి। నంబిగింబియు నీతనయు మన్నదేని।
ఆనంబి శివునంబి యయ్యెనేనియును । ఆనంబినంబివం బయ్యెనేనియును।
హరుడుకుంటెనబోవు నవి తథ్యమేని । హరుడును పడివెట్టు టదితథ్య
మేని । పంబినీ తనయుండు బ్రతికెడుగాక । నంబరపడనేల చర్చింపనేల।
నంబియుగలిగి పినాకియు గలిగి । సాంబసద్భక్తి మహాత్వంబుగలిగి। నీ
యగ్రసుతుని సన్నిధియు గల్గినను । జేయుదావడుగు చెచ్చెర నెడ
యనుడు । వత్తురే చచ్చిన వారుయేనాట । నుత్తములకు నిట్లు యో
గ్యమే బొంక । భవుభక్తిపరుడవు భాగ్యవంతుడవు । తవిలి మమ్మడ

కింప ధర్మమే నీకు । పొలుపుగా నారిన పుండుగోలలను । కెలికినక్రియ
కెల్ల కెదుఘుతుచావు । వలదు నీవుదికింప వారక మమ్ము । పిలిపించిదా
నంబు పెట్టువే యిదియు । దీనికి రప్పించితివె మహాపురుష । దీనులమని
యేము ధృతిహాని చెదవు । మును మహాదేవుని ముట్టంగ గొలిచి। య
నుభవించెద వైహికాదిభోగములు । ఘనుడ మమ్మిట్లాడి కానియేయిం
క । ననుభవింతము మీఁద నపవర్గసుఖము । వేయేల నీయీగి వేయును
వచ్చె । పోమెదననుదాను పొలతియుబోవ । భూసురోత్తమయేల పో
మెద వింక॥ నీసుతు పేరుగొనిననంబి నేను। హరునికుంటెనవుచ్చు నానం
బి నేను। హరుని చేపడిగొన్న యానంబి నేను। మొసలి మ్రింగినయట్టి ము
ద్దుతనూజు। ననలార రక్షించు నానంబి నేను। మొసలిపుత్రునిదిన్న మును
రేవునకును। మసలకపనుపు నీమగువ నీక్షణమ । మీఁతనూభవునాఁడు
మ్రింగిన మొసలి। యే తెంచి సుతుగ్రక్కి యేగెదు నేఁడు। సేయుమువడుగ
భిజిత్కాలమునన। ఘ్రాయతంబుగ సుతునంచు నర్థంబు। గమియనిచ్చు
డు వులుకలు మేనదొడర। ప్రమదాశ్రులడర సంభ్రమలీల గ్రాల। నల
రుచు సాష్టాంగులగుచు మ్రొక్కుచును । నలిజెలంగుచు సమున్నతి మి
న్నుదాకి। యుపనయనోద్యుక్త యుక్తమై విప్రు। డపరిమితప్రీతి నరిగె
నింటికిని। సతియు బుత్రోత్సవా సక్తమైనరిగె। సుతుని మొసలిదిన్న చో
టికినంత। నానంబియును ననంఖ్యాతమాహేశ్వ। రానీకమునకు సాష్టాం
గుడై సహజ । శంభుండు చేరమ చక్రవర్తులప। దాంభోరుహోత్తంసుడై
తదీయాజ్ఞ । నాలింగమూర్తి నయ్యాయని పిలిచి । తాళముల్ వేసి స
ప్తస్వరోదాత్త । బంధురధ్వనిదిరుపాటగీర్తించి । సంధించి శివుని ప్రస
న్నుగావించి । మొసలి యాహుతిగొన్న ముద్దుతనూజు । నొసగవేయు
సమసముద్యద్దయాబ్ధి । యంచు విన్నపమాచరించుడునయ్యు । దంచ
దయాకరుండంతకుదలప । నంత నయ్యంతకు డంతంత మ్రొక్కి । నం
తకాంతకు జోరియంతక మొసలి । దినిన తనూజు డెద్దివినున్నవాడొ।
గొనిరమ్ము నాచిత్రగుప్త తృతీయ। భృత్యుండునంబెన్న పేరాట జేసి। ని
త్య స్థాన్నిధ్య సాయుజ్యతబడసి । యున్నాడుగాని వేరొండులోకముల।
నన్నందనుంపు లేడని విన్నవింప। బ్రహ్మాదలంచుడు బ్రణమితుండగు

చు। బ్రహ్మయు రెండేండ్ల ప్రాయంబునందు। రయమున గ్రాహోదరంబు
నజీర్ణ। మయినసర్భకుని నధ్యయన వచస్కుక్తి । గర్భాష్టకప్రాప్తు గా
వింపమొసలి। గర్భంబుసం దిడి కావేరిలోన। నుదక మధ్యంబున నున్న
కార్మొసలి। యుదరంబుననపుత్రు డుదయింపగాలు। డరిగిసీయుదరంబు
నందున్నయట్టి। వరపుత్రు రప్పింపు వారకననుడు। గొసరక మొసలియు
గొబ్బునబొడిచి। యసమనదీ ప్రవాహమున కెదిర్చ। నదివచ్చెవచ్చెనా న
క్కుమారుండు। వదన గహ్వరమున వ్యక్తిభజింప। కడు నెప్పు గర్భా
ష్టకప్రాప్తుడై నకొడుకు నత్తటమునగొనివచ్చిదింప।నుద్ధతి నాయూవలూ
రియాబాల। వృద్ధాదులటమున్న వీరువారనక। కావేరితటమున కట్టలుగ
ట్టి। భావింప విస్మయ పడగ దత్సతియు। నల్లంత సుతుగాంచి హర్షించి
మించి। యుల్లంబు దళుకొత్త యురువడినేగి। వచ్చి తానంబెన్న వర త
నూభవుడ। వచ్చి తానంబెన్న వడుగ నాయన్న। నాకన్న నాపట్టి నను
గన్నతండ్రి। నాకుమారుండ రానాకురయనుచు। క్రూర్మి నెక్కొనసెత్తి
కొనిగాగిలించి। యర్మిలినందంద యప్పళింపుచును। చనుగవదొరగు నా
స్తన్యధారలను। గనుగవహర్షాశ్రుకణపూరములను। జెన్నారసుతు నభిషి
క్తుగావించు। చున్న యత్తరి బతియును నేగుదెంచి। సుతుని కౌంగిట జే
ర్చి సూరెల జనులు। నుతియింప సతియు దానును తనూభవుడు। నరు
దొందనంబి పదాంబుజంబులకు। వరుసజేరమ చక్రవర్తికిమ్రొక్కి। రియు
నరానుసూక్తి గ్రాహోదరజీర్ణ। మనగ నంతక ముఖాంద్రానింతధా
త। ముంగలి మొసలి కడుపున జీర్ణమైన। పింగలి నొకవిప్రు ప్రియపుత్రు
నంబి। వనర నంతక ముఖంబునన రప్పించి। కనియె కేవల భక్తగణనిధి
మరియు॥ హరి గరుడారూఢుడై సుదర్శనము। ధరియించి వైష్ణవోత్తము
భటుల్ గొలువ। పంబి తత్సూక్తి స్వాచాంబుజగ్రాహ। ణంబని
మ్రోయస్వార్చాంబుజగ్రాహి। యగు గజేంద్రు మొసలియట్లు బట్టుట
యు। దగిలివిష్ణుండు యుద్ధంబాచరించి। కాని గజేంద్రుని గావంగలేడ।
యాన్నంబిమహిమ మేమేమందు మనుచు। క్రొచ్చెర నటమున్న గ్రా
హోదరంబు। సొచ్చిన యప్పుడు వచ్చినజముని। జచ్చినప్రాణంబు వ
చ్చినయదియ। తెచ్చినపుత్రుని వచ్చిన విప్రు। నెచ్చిన వనితకు నిచ్చిన

నంబి। నిచ్చినమహిమకు మెచ్చిన బుధుడు। విక్రమభక్తి నిర్వక్రియాప।
రాక్రమక్రముడు చేరమచక్రవర్తి। విశ్రుతాసంఖ్యాత వీరమాహేశ్వ
ర శ్రేణియును నుబ్బి ప్రస్తుతింపగ స। మస్తమానవులును మస్తకన్యస్త।
హస్తులై జయవెట్ట నంతనద్విజుడు। నంబినంబెన్న యానందస్వరూప।
నంబినంబెన్న యున్నత జగద్వ్యాప। కతలేల మీధర్మ కవిలెలమేము। గతి
యును మతి నేడ్గడయు నీవనినన। దానమొక్కడు వేండ్రదనకుల సత్పు
త్రి। దానమిచ్చితి మహాదాని మహాత్మ। దేవ భవన్నామధేయుసినంబి।
కావుము బ్రోవుము కరుణాబ్ధియనుచు।దివిరి ద్విజత్వంబు ద్విజులకేలసగ।
నవనీసురోత్తము డాశ్చర్యమెసగ। నంబెన్న యాజ్ఞాపసంబునజిన్న। నంబి
కప్పుడ యుపనయంబు చేసె। నీత్రియినంబి మహీష్టతమరియు। చిత్రంబు
వేయును జెప్పనేలనుచు। నఖిలభక్తానీక మంకనల్ సేయ। సుఖలీల మల్లి
కార్జున విభుడంత। గణముల కనుదృప్తిగాసర్వమపుడ। యొనరంగ జేయిం
చి యుచితముల్ దనర। వరవస్త్రభూషణావళుల బూజించి। యరయంగ
గంధపుష్పాదుల దనిపి। కర్పూర సహితంబుగావీడియంబు। లర్పించి భ
క్తసమగ్రత మెరసి। యానందగీతంబు లర్థి బాడుచు శి। వానందలీలల నల
దియాడుచును। శంకరగీతముల్ సరవి బాడుచును। శంకరలీలల జతలకా
డుచును। పరమశివానందభరితమై మరియు। హరగణాగ్రణులున్న యవ
సరంబునను॥ పటుభక్తి గర్ణాటభాషయర్థించి। యటమున్న బసన దండా
ధీశుకడకు। జచ్చిన జంగమంబును భక్తవరులు। వచ్చి యాబసవన్న పర
మహాత్వంబు। బ్రస్తుతింపుచు సమర్పణసేయు బసవ। హస్తానుగతభూతి
యందునంతటన। కర్ణాటభాష సాంగముగ బ్రాణేశు। గర్ణాటగీత సంగతు
ల బాడుచును। మరియును బసవయ్య మహిమయు వినుచు। తరిదరి బస
వయ్య దలచి మ్రొక్కుచును। వినుకలిసుఖము చివ్వలివోవునంత। కనుక
లినాత్మముం గలిదొంగలింప। బాపక్షయాత్మీయ బహువాక్షరత్రి। యోప
లాలనపరనోన్ముఖమనుజ। రక్షణాపేక్షు బ్రత్యక్షత్రిచక్షు। ప్రత్యక్షప్రసా
ద పంచాక్షుసాక్షాన్మ। హోమాక్షుఫాలాక్ష ప్రియుక్తఫాలాక్షు। శిక్షిత్రపి
రిపక్షు శివభక్తదక్షు। నక్షీణ కరుణాకటాక్ష వీక్షణాసు। రక్షిత స్వాసమ
య వక్షునానతము। ముక్షుసంస్కృతి పాశమోక్షుకూర్జనప। రోక్షుశితక్షార

రుద్రాక్షవిహిత। పత్తుక్రియాదక్షు. పక్షమహాధ్వ। రక్షయదక్ష సద్భృత్తు
జంగమస। మత్తుబసవగణార్యత్తువక్షణమ। వీక్షింతుననువింత వేడ్కమై
నంత। స్ఫుటకీర్తి మల్లికార్జునుడు కళ్యాణ। కటకంబునకు నభిగమనంబు
సేయ। మారారిసద్భక్తమండలిదాను। సూరూర సద్భక్తు లొాగి నెదు
ర్కొనగ। ముదముననిడు గడుములకునే తెంచి। సదమలాత్ముడువీరచాకి
దేవయ్య। ప్రవ్యక్తభక్తి సారంగేశునంద। నవ్యశివమాలంఘునవ్రతాసక్తి।
నతులత్రికాలలింగార్చనాయుక్తి। సతతజంగమ పరిచర్యానురక్తి। శివభ
క్తతత్వ గోష్ఠిపముద్యుక్తి। యవధూతపూర్వ వర్ణాశ్రమవ్యక్తి। శ్రుతిచో
దితాచార సుపథప్రయుక్తి। మతిగొని యాడుచు మరిపండితులని। జాగ్రి
శిష్యుండన మరుదొనమయ్య। కగ్రిజుండై వ్రతోద్యన్నిష్ఠ వెలయ।, నాపీ
రచాకి రాజయ్యచేభక్తి। భావనమై ప్రణిపత్తిగైకొనుచు। కరమనురాగ
సంగతిపానుగంటి। కరుగుదేరగ శిష్యుడైన బండరువు। గోవింద ప్రెగడ
యు గోరిమాహేశ్వ। రావలియును పురం బభిరమ్యముగను। యెల్లెడజా
ళియంబిప్పించిరంగ। నల్లులు బెట్టించి వాడవాడలును। ముకుళపల్లవమ
ణి ముక్తాఫలాది। మకర తోరణములు మార్గపార్శ్వముల। నుప్పరపట్టం
బు లొాగికట్టడములు। నుప్పరగుళ్లు మహోక్షపతాక। ములు వాతపూ
రణంబులు నాతపత్రములు నలంకారించి మొత్తముల్ గాక। సిద్ధవా
ద్యధ్వనులెల్ల ఘూర్ణిల్ల। శుద్ధసాళగగీత నూలాదులువియ। నంతంత గో
లాట్టు మంతంతబోక। లంతంత గేళికలభినయింపంగ। చాంగుబళాయంచు
శబ్దంబు మ్రోయ। వీగుచు పురజనుల్ విభ్రాంతులుగను। గోవిందప్రెగ
డయు గురుపాదసరసి। జావలోకనవంద నావసానముగ। నంతననంతసా
ష్టాంగంబు లిడుచు। సంతతోత్సవలీల స్వర్ణపాత్రములు। భ్రాజిల్లు దివ్యా
భరణసమూహములు। రాజిత కనకాంబర వ్రితానములు। నానాఫలంబు
లు నానాప్రసవవి। తానంబులును సుగంధ ద్రవ్యములును। కర్పూరసహి
తంబుగా విడియంబు। లర్పించియు మరియు సాష్టాంగుడై మ్రొక్కి। యానం
దజలముల నడుగులు గడిగి। పూనిస్వకీయ హృత్పుష్పంబుబూన్చి। సతత
సద్భక్తి వాసనధూపమిచ్చి। నుతసంస్మరణ వాంఙ్మణుల నివాళిచ్చి। తను
మనోధన నివేద్యంబు లర్పించి। వినుతానురాగ మన్నివిడియంబులిచ్చి। ను

## పర్వతవర్ణనం.

గిరినేలయేరులు సురనదులనిన। పురినదినదములే పోల్కివర్ణింప। గిరిచు
ట్టుమ్రాకులు సురతరులనిన। పురియుపవనములే పోల్కివర్ణింప। గిరి
మందయైక్యుర్వీశు సురభులకనిన। పురిపశురాసియే పోల్కివర్ణింప।
గిరిసమస్తంబును హరిమూర్తియనిన। పురిలింగమహిమయే పోల్కివ
ర్ణింప। గిరిగిరాతులముక్తి పురినాధులనిన। పురిభక్తవరులనే పోల్కివ
ర్ణింప। గిరియంత్యజులుధరామరముఖ్యులనిన। పురిబ్రహ్మాదులనే
పోల్కివర్ణింప। గిరిసర్వజీవులు గీర్వాణులనిన। పురిజీవకోట్లనే పోల్కి
వర్ణింప। నైననొక్కించుక నానేర్చుభంగి। మానుగాబాగడెద మహి
వస్మదాది। కవులపాఠకుల వాక్పావనకరము। భవత్రసీకరము దుర్భ
రకర్మహరము। ప్రమదమందిరము సద్భక్తిభాస్వరము। కమలాకరము
చూడ గడునవస్వరము। భంగురేతరము శ్రీపర్వతపురము। లింగమే
దురమన్న వేదత్రిపథము। శుభసముత్కరము విశ్రుతసౌఖ్యవరము।
నభినవకైలాస మాపురవరము। శ్రీశైలమిదినదా శివుమీదశిరము। నా
శిరోమణిమల్లికార్జునస్వామి। దేశిగానప్పురిదివ్యలింగములు। నానదాశి
వుని నేత్రాదిద్రిదియములు। చెనసిదర్శనముక్తి శిఖరమద్దేవు। ఘన
నజటాజూట సంగతశిఖరంబు। మల్లికాకుండ యామ్యజకుండనలిల।
వల్లరిశివుమాళి మల్లికామాల। పరివృతపురవర ప్రాకారమీగు। వర
మధ్యమేఖలా వలయభూషణము। భవ్యచతుద్వార భరితహర్మ్య
యములు। నవ్యభూషణ నాయకమణులు। భావింపతత్పుర ప్రాజితన
దులు। దేవదేవేశ్వరు దివ్యాంబరములు। వరసపురోద్యాన వనములీశాను।
చరణార్చితలతాంత చారుమంజరులు। వరగృహప్పురివీర భక్తపుంగ
వులు। హరువరకర చరణాద్యంగకములు। భంగిగానప్పురి జంగమావ
ళులు। సంగజహరుసపరావతారములు। నటుగూడపరనయు నాపౌర
జనులు। వటురతిశివుమౌళి బ్రసరించుప్రజలు। పురిబహురత్న భాసు
రతోరణములు। కరమొప్పు పురనాదుగ్రైవేయకములు। అమితత్పురవ.
రోద్యత్కేతనములు। ప్రమథేంద్రులిడు చామరప్రకానములు। గాని
ట్లుపురము సాక్షాదుత్రిరూప। మైనివ్వటిల్లదదీయమహాత్వమునను।

యేపారనిట్లొందు హేతుదృష్టాంత। రూపనిరూపణల్ రూపింపనెట్లు।
మొగుడుకీర్తనసేంత కీలనెట్లుపాంగ। మగుగవంగగ నాకారమువగ।
నాగిసాగఁగ సాగ శ్రోపవఱుంబునగ। జగదభినుతలీల శైలాధునాథు। పుర
ముపురితునే పోలు గాకనఁ। నగుధగుళీమల్లి కాశ్ఞనపుష్పము। శ్రీగిరం
బైజగ తైర్వ్యాప్తిమెలుట్లు। పాత్రిటంబుగగని పదనయుపాంగి। సంతసిల్లు
చును భేఱముఱయు ఘుమ్మచు। సంత్రనెంతయుబ్రీతి సప్పరిదరియ। మంజి
యుమంద్రియు మల్లడిగొనగ। కిఁందుముకిందుము గజిబిజిపుంగ। పడ
గలువడగలు పూడిపడిగాఁలి। గొడుగులుగొడుగులు ద్రొడ్డాడినగర।
కల్లయంగి సతపంధితులు సదనంద్రి। రులు। పేఱువంజ్రాలు రుచిఁవిబ్యర్వ।
వినుకులువినుకులు విద్వధిమ్మోర్తి। మనికులుమనికులు మానకతగుల।
మదళీలుమదళీలు మత్పరింపంగ। సుదతులుసుదతులు శ్రుతిరవింప।
తాళధరుల్ తాళధరులు సుప్పొంగ। తాళముల్ తాళముల్ దండడిగొనగ।
గాళెలుగాళెలు గల్లసిఘూన్నిల్ల। నాళములునాళముల టిద్రాటిగొనగ।
నటకులునటకులు నలిరేగిపాడ। నటవిలునటవిలు నలిబ్రిస్తుతింప।
వాద్యముల్ వాద్యముల్ వపుసలుదప్ప। పద్యముల్ పద్యముల్ గద్యాలు
గాఁగ। పాటలుపాటలు పరిపాటుదప్ప। మాటలమాటల మంద్రియడంగ।
రినములురినములు రత్నలుదలిర్ప। రసికులురసికులు సునగులువీడ।
దిట్టలుదిట్టలు తెల్లెల్లజెప్ప। దోట్టరుల్ దోట్టరుల్ దోలగిచనంగ। మిండ
లుమిండలు మొలత్తలునెరయ। మండిలుమండిలు మందగింపంగ। దాను
లుద్దానులు దమకించిపెట్ట। ఏనుఁగులేనుఁగులు విరుగుడుపడగ। చూపరుల్
చూపరుల్ సుడిపడితిరుగ। మోపరుల్ మోపరుల్ ముందటనడవ। కావ
ళ్లుకావళ్లు గ్రిందుకొసంగ। జావళ్లుజావళ్లు సందడింపంగ। నందలాలం
దలా లందమైవెలుగ। మందళ్లుమందళ్లు మల్లయుచునడవ। నాయకుల్
నాయకుల్ ధాయునేతేర। గాయకుల్ గాయకుల్ ఖచరములేబాడ।
భట్టులుభట్టులు పత్రికగట్టిబొగడ। గట్టులుగట్టులు జట్టులుకెలగ। సేవకుల్
సేవకుల్ జేరికొల్వంగ। భావకుల్ భావకుల్ పదములిచ్చితొలగ। బాంధ
వుల్ బాంధవుల్ ప్రీతిగొంగలింగ। సంధులుసంధులు పటమున్ననడవ।
సంగళ్లుసంగళ్లు సటయిటదనర। సంగళ్లుసంగళ్లు జనుశేంగిపిలువ।

మిన్నేటిజలములు। మొత్తనిమ్మణులు। క్రొన్నలతిలకముల్ క్రొమ్మురుబ్రా
ఘ్రములు। చుక్కలసేరులు సురధేనువులును। చక్కనిమావులు ఫంతా
వతరులు। సజదామరత్వంబు। నైరావతములు। గజవైరిజడలును గావు
రూపములు। రవితేరిపాకుల్లును రథరూపములును। దివియెక్కనిచ్చెనలి
దీర్ఘాయువులును। వెన్నెలపూతలు విద్యుల్లతలును। కిన్నరగానముల్
ఖేచరత్వములు। జంగమతరువులు స్వర్గాంగములును। సింగంపుకాద
ములసి ద్ధమాలికలు। భవగదాపదములు పండితత్వములు। దివిజేం
ద్రపదవులు దివ్యదేహములు। నిలగమ్మనసడియు నిత్యఫలములు। మల
యనుపుష్పముల్ మంచుముద్దలును। అష్టాంగయోగము లణిమాదు
లైన। యష్టసిద్ధులును దృష్టాదృష్టసౌఖ్య। ములు నేదుకన్నులు పులిజు
న్నవిలుగ। గలుగుచత్సవిధమార్గములుజూపుచును। నరిమురిదనర
నయ్యంతఃపురంబు। దరియంగజొచ్చునత్తరినలుగూడ। నడతెంచుపరనయ
నడవసందిరులు గొడుగులుపడగలు నుడువీధినరు। నాలుగుద్రోవల నలి
వచ్చుబరన। నేలయున దివియు నింగియు దెసలు। గోపురద్వారముల్ గోట
లుకోమ్ము। లాపురంబును మల్లికార్జునుగుడియు। మండపంబులునిండ్లు
మార్గముల్ నదులు। కుండముల్ వనములు గూడంగమునిచి। శ్రీగిరీశ్వ
రుశిరశ్శేఖరమైన। యాగంగపరిమత్సమాగము వేళ। నలరియుష్పాంగి
మిన్నంది వెవ్వరియు। పాలుపువపరనయప్పురి వెల్లివిరిసి। గిరికరినెక్కని
పిక్కటిల్లగిరి। గుర్రిక్కదంబై కట్టు కొనిగుండుగూలి। నిట్టుద్రొచియలమి
దట్టమైతూటి। కట్టిసంపూర్ణమై బిట్టిచ్చికూడ। నక్కడనెంతెంత నెచ్చో
ట దెలిపి। వక్కడనక్కడ నటగూడపడియు పండితమల్లయ్య పదపద్మ
మట్టు। దుండగుశిష్యుండు దోనయ్యగారు। శ్రీపర్వతావాసు శివుభక్తు
జిరధ। యాపరుశ్రీమల్లి కార్జునదేవు। దర్శించిహర్షించి తద్భక్తి
పరుల। దర్శించియుత్సులి తోత్సవలలదనర। జంగమారాధనల్ జక్కొ
ల్పినిత్య। లింగార్చనములు నల్లీలగావించి। వండకపూవక బత్తిరియందు
నిండారుఫలములునిటలాక్షుభూవ్ప। పండొక్కడీశ్వరార్పణచేయనొక్క
పండువండనకల్లు ఫలగోల్లమరియు। శ్రీగిరీశ్వరున। కంచితరత్నమణిపు
రోగమణివానువిధా రూధవస్తు పరిశానసమర్పణా ద్రవ్యమంతయును।

గానుకయగునిది గడుచిత్రమనుచు। ఫలములుపుష్పముల్ పత్త్రిరిగాచు
కలుదళితానంబులీ గాంచునంతంత। గంతులునెరసి సంగడములువెరసి॥
బంతులేర్పడిబెట్టి బట్టలుబట్టి। కట్టలుగట్టి తీగెలుసాగియల్లి। పట్లులుబట్టి
కుప్పలుగోనిగములు। గట్టిపేరెలువారి తిట్టలుచదివి। దట్టంబులైన ముద్ద
తినేగుదెంచి॥ కూడనప్తాణ వఘోషజేలంగ। నాడడిపాడడి యబరెడి
బృంద। ముల వినుకుల వేలములుసంపదాయ। ముల కొలువుల భోగ
ముల దీళ్ళపంగ। డముల తోయముల తండంమ్ములనాట। కముల మొ
త్తముల జోకలమంగపరచి యుదిక్తమైశీన గోత్తుంగనిలయ। రుద్ర
శ్రీమల్లి కార్జునుదర్శింప। నలినుబ్బిపౌరగణ సహాయులగుచు। కలక
లాకర్ణ సాగరముత్తరించి చనువారుదర్శించి చనుదెంచువారు। చన
లేకనడవ్వగ్రచ్చరజక్కువారు। కెరలినందడికోడి గిలబడువారు। మొక
బలిమినుమును మట్టజన్వారు। పరనపాదంబులు బాయంగనడుచు। కర
ణినందడివాయగానడ్పువారు। అట్టులబుష్ప మాల్యపతానముల। నట్టు
లగైకొని యరిగెడివారు। మహితత్ప్రసాద మంటపేద్వార। గహనప్ర
దేశముల్ గాచుండువారు। తమకించిచొచ్చి తత్ప్రసాదమంట। పము
నందతిరుగుడు పడితిరుగువాడు। చొత్తముగాంచు సొకనాసినుండి।
వత్తుమేయని యురువడిజొచ్చువారు। యిరిసిననందడి దరసికెంరదేరపి।
నరిమురిగర్భ గృహముజొచ్చువారు। తోమునొరగుచు దోటిలు
గొనుచు। పాచుచులింగంబు పైబడువారు। పిరిపీరులనుమంది బెనుగు
లాడుచును। పరపరిలింగంబు తడవేకువారు। తలలులింగంబుతో దాకిం
చుకొనుచు। మలయమల్లయ్యాయని మలసెడువారు॥ పరసవమ్మగబోక
పసిడియయనుచు హారునొకమరిముట్టి యరిగెడువారు। మంటిమిమల్ల
య్య గంటిమిముట్ట గంటిమిమేమంచు గ్రమ్మరువారు। వచ్చెజమ్మయ్య
యావ్రతముమల్లమ్మ। విచ్చెజూచెదమంచు నేతెంచువారు। మల్లయ్య
రక్షించు మాపర్వతంపు। మల్లుమీరంచును మగుడెడువారు। పలికిన
స్వర్ణ పుష్పములుమల్లయ్య। మెలమిగైకొనుమంచు నేతెంచువారు।
నెల్ల మొక్కులునీకు నెక్కజమయ్య। మల్లయ్యయంచు గ్రమ్మనద
ర్శించి। వచ్చువారును జూచువారునుజూత। వచ్చువారును జొచ్చువారు

వెండియుఁ గన్నులఁజూచిన కర్మారిపుదృష్టి। కర్మేతరునిజూడ గాదన్న
యట్ల। కన్నులు గెలికి క్రొక్కనబుచ్చికొత్త। కన్నులుబడసి లింగము
జూచువారు। నమనేత్రిగారి తత్త్వమియునింక। నమ్మనేత్రిడైయున్కి
చాతుర్యమనుము। సమమతానొకకన్ను శంభునకిచ్చి। గ్రమమునన్
క్రొక్కక కన్నిచ్చువారు। చెన్నుగాహారికి తన్మిన్నిజమునమా। రన్నత్రి
మనగ నేత్రి బొందుబూన్ప। గలిగెందునభక్తి। ఘనతయేయనుచు।
కలగకరెట్టుగా కన్నులుబూన్ప। పూచినకన్నులు భక్తియుముక్తి। యం
చు నేత్రిద్వయం ఖపిఁంచువారు। యిదుత్రి షడాస్యవాగీంద్రాదివాసు।
క్రిందగత్తలకు నేత్రినేత్రిములు। తనులెల్లగూడ నేత్రిములుగావలదె।
యనినవపిఁంపుచు నవ్వీరగణము। కన్నులవృష్టి ముక్కంటిపైగురియ।
సన్నుతిసేయుచు శరణనువా...। కడుబ్రీతి కానుకల్ గట్టన్నములిచ్చి। య
డుగుడురేమైన యడుగమేమట్లు। కడుభక్తినిచ్చిన కన్నులుగుడ। నడు
గుదురేయంచు నర్లేగువారు। పరులగీర్తించుపాపంపునాలుకల। హరు
నిగీర్తించుట న్యాయమన్నట్లు। నాలుకల్ గోసి పినాకిచేగోత్త। నాలు
కల్ బడసి- వర్ణనసేయువారు। యుదరార్ధమైచేతు లోరులకెత్తు
చును। మదనారికెత్త సన్మార్గమన్నట్లు॥ చేతులుసరికి యాశివునిచే
గోత్త। చేతులుబడసి చెచ్చెరమ్రొక్కువారు। కలలోనజంటిమొగ
ముగాగడనుచు। నిలనిచ్చుక్రియ జన్ను లిచ్చెడివారు। తలలేనిశివుడని
తలగాసిబ్రతుకు। తలలెద నెడిమాడ్కి తలలిచ్చువారు। గరళాంకుకృప
లేని కర్మదేహములు। ధరయించియున్కియు దప్పన్నయట్లు। చనలేని
స్సార సంసారవిరక్తి। నటుగూడదనువుల నవిఁంచుబరిభ। వృత్రాసుజ
లభక్తి విధిధూపదిప। పాత్రిలునిజకర పల్లవంబులుగ। బరమేశుమె
ప్పించ్చి బడిసినదైత్య। వరులంతబోక తద్వతునిగురించి। ధృతిశిరంబులు
ధూపదీపపాత్రిముల। గతినావహించిన కరణియువ్రాలె। శిరములుదా
ల్చిన చిరధూపదిప। పరిమళప్రిభలు శ్రీపర్వతుముంప। చూడచోద్యం
బంగ ధూపరుల్ బొగడ। నాడుచుబాడుచు నలరెడివారు। ఆరంగవెం
డియు నతివలుదారు। నిచ్చిరిశోద్ధతి వేషంబులలర( ఘనకీర్తిపెలకాల
గంటపెండెరము। లును పేరమద్దియలును నంధియలును( చాలనొప్పను

చేతి సంకిలయలును। వ్రేలియాడెడు వలువేల్పుగొమ్మనుచు। కనుగడు దే
లుపారు కర్ణపత్రములు। నిసుదపావలును నెరసోల్లిములును। నిండారు
గంధంపు నెరపూతలునున। ఖండితనేత్రి వికస్వరాంశులును। నిండారు
గంధంపు నెరపూతలునున। ఖండితనేత్రివికస్వరాంశులును। వ దీటలో
నారసంబులు బొట్టుబొందె। కాలలుబసపులు కాటుకలును। భసితంపు
తిలకముల్ బాసికంబులును। వెనతోటినడుపులువీరపట్టెములు। దనరా
రుపువ్వుల దండలుగండ। ఘనతరంబగు మోల గచ్చుతోకలును। గొరిగిన
గడ్డముల్ గోరమీసములు। మెరుగుపట్టెసలును మిళితమైతనర। తలల
మూపుల గరతలములవ్రేళ్ళ। గళములజింహ్వల గణరంధ్రముల।
కనుపుల మెడల వక్షములబుక్కిళ్ళ। తొడలరెప్పలతోడి తొడదీవితతు
లల రంగపెనుదివిటీలకారసములు। కలయగళరమొయు గాఢసం
ధించి। శ్రీపర్వతునికి సుస్థితినివాళింప। దీపవృక్షంబు లేత్తె చుభావ
ముః। లీలబర్వతుని వాళించుచునట్లు। గాలిచునోలుచు సతివాడువారు।
రొమ్ములయుచు వెండియు నోక్కొక్కగెలన। ములు సమర్పించు ముద
మందువారు। యేకాంతమున హాటకేశ్వరంబేగి। యాకాంతగెలసంబు
లర్పించువారు। కలసుబాతాళగంగాస్నానవిధులు। సలుపంగదిర్మై
జనియెడువారు। ఖ్యాతిమైతిప్రద గంగాన్వితమైన। పాతాళగంగాప్ర

## పాతాళగంగవర్ణనం.

వాహమెట్లనిన॥ ఉరగాంకు శ్రీచరణోద్భూతయగుచు। బరగుభాగవతి
నాపాతాళమునను। భవునముద్ధూళిత భస్మసంజనిత। యవున్భాగీరథి
యనగమర్త్యమున। కరకంతువర జటోత్కరజాతయగుచు। వలుమం
దాకిని స్వర్గలోకమున। ధరస్వర్గమర్త్యపాతాళప్రవాహ। చరం।
సంగమంబు శ్రీశైలమాడమ్మున। ప్రకటితంబగుచున్కి పాతాళగంగ
సకలతీర్థత్వ ప్రసాదితమహిమ। దావెలుంగుచున్న తదర్శనస్పర్శ
స్నావగాహన పూరణాదులువలన। సాలోక్యసామీప్యసారూప్యముక్తి।
లోలినీజాలు మహోర్మిదోర్లతిక। యనిమిషలోచన యావర్త
నాభి। ఘనతరపులినజఘనకమలాస్య। యనురథాంగస్తని యనుఫేన
హార। వరహంసగమన ప్రవాహంగయగుచు। కారండహంస బకక్రౌం

చభసల। సారసకుక్కుట చక్రవాకాది। జలపక్షిరవవాద్య శబ్దముల్
మోగ్రియు। నలిమృదురీతినా నాగసమెసగ। వడిబరికుతోట్కటి నడతేర
గాంచి। డీయకబి చు హస్తములనటించు। భంగిబాల్పారు నుత్తుంగ
తరంగ। రంగిణిశ్శాతాళి గ్గంగదర్శించి। తగుయథానంభవ దానధ
ర్మంబు। నోగినియోగించి బుణ్యోపేతులగుచు। నరిగిశ్రీగది పాదాభి
వందనము। కరమధికాజేసియా కర్మారినురుకు। ననిఘులభవ పరిత్యక్త
మానసుల। గనుగొంచునద్భుతా క్రాంతమ్ములగుచు। నతిముదివనలి
కర్మారీశ్వరము। నురుకుపుణ్యులజూచి యొగినుతించుచును। పాసకం
టక మసోత్పాటసముళుల। పాపవినాశక ప్రభృతిలింగముల। నంతం
గదర్శించి యంతనప్పరస। యంతయునాశ్చర్య హృదయమైపోగడ।
సిరిగిరినిట్టు విచిత్రంబుగలదే। వరన యింతనిగుట్టు పరపంగరాదు। యొ
క్కొక్కకోటికి నొక్కొక్కడురుకు। నక్కబంబైన కర్మారీశ్వరమున।
నుస్వృత్తివింటి కాథుమవీధినేయు। నాద్యంతమధ్య బాణాటనంబట్లు।
నడియడిదేహంబు వడినదేహంబు। నడిమిదేహంబు లెన్న గబెక్కాడు।
చుండెనద్దిశముల నుడుగకయునిన। వెండితీతాధుకాల వీవరింపఃరామె॥

## పర్వతవర్ణన.

వరభక్తి శ్రీవారణాసికిని। కరమధిక జను సాతుకరణిజూచితిమి। గుడి
పూడిసోమేశు కూర్మిపెండ్లికి। నడతెంచుపరసల నాంజూచితిమి।
పెనుమెట్టపురి శివుబెండ్లిండ్లకధిక జనుదెంచిదర్శించు జాతుజూచితిమి।
చిరతరభక్తిమై సిద్ధవటంపు తిరునాళ్ళకేతెంచు పరసజూచితిమి। గుడ్డ
న్వాపురమున కునుజాతి వచ్చు। దొడ్డపందడివాడు తోలుతజూచితిమి।
బీరితదాక్షారామభీమేశు పెండ్లి। కేతెంచుపరస నాడేముజూచితిమి।
విజయాపురంబున వీరసోమంన్న। భజయింపజనుదెంచు వరసజూచితిమి।
సరిబేచుకాక్షేత్ర పూజలకుపాన్నలిక। పురమునకేతెంచు పరసచూచి
తిమి। సౌరాష్ట్రనాథుని చీరగట్టించు వారంబులకువచ్చువార్లజూచితిమి।
ఆదటసింహాబ్బహన్పతిపరస। గోదావరినిజూడు కొలగిజూచితిమి। మహా
నివృత్తినిర విగ్రహాణాదులందు। బహుళంబుగాగూడు పరసజూచితిమి।
నలిగాలికాకంపు పుంన్నమనటిపరస। కలిమియద్రిపురాంతకమునజూ

చితిమి। రమణశ్రీరామేశ్వరంబేగువరన। గ్రిమమునఃబలుమూరు గందు
ముగాని। యట్టిపెన్నందడ్ల నంతంబు గాంతు। మిట్టునదడిగాంతు మే
యందునైన। మరియొక్కచోద్యమీ మల్లికార్జునుడె। యెఱుగుదానె
ట్లంన్న నేమనిచెప్ప। నంతెంతపరసదా నేతెంచిపిడియు॥ నంతంతనాయ
తంబై యుండుపురము। యెంతెంతబఃసదా। నేతెంచికోరు। నంతంతజ
లపూరమైయుండునదులు। యెంతెంతపరసదా తెచియుండ। నంతంతవి
స్తీర్ణ మగుశివాలయము। యెంతెంతపరసతా యేతెంచికాంచు। నం
తంతయున్నత బగులింగమూర్తి। లక్షింపగసపాద। లక్షనేపాళ। మీ
క్షింపగసపాద లక్షకేదార। మీక్షింపగసపాద। లక్షకేదార। మీక్షిం
పగసపాద లక్షదీర్ఘార్తి। యీక్షింపగసపాద లక్షకాశ్మీర। మీక్షింప
గసపాద లక్షకన్నోజి। లక్షింపగసపాద లక్షకొంకణము। లక్షి పగసపాద
లక్షకళింగ। మీక్షింపసిరికొట్ట యిలసప్తలక్ష। క్రిమమొందజాలంధర
బష్టలక్ష। ప్రమితయాదహాలక్ష వంగాళభూమి। గౌరిసప్తదహాలక్ష గుజ
రాష్ట్రభూమి॥ మరియునదహాలక్ష మాళవభూమి। జానొందనెరవి పంచ
ద్రావిళములు। లోనవ్వలక్ష తెలుంగువీనికని। యామ్మైముమ్మడి యుతర
దేశంబు। నిస్సృహిదేశంబు లెన్నంగనేల। ధరదూరుపుననేగి దానగ
రంబు। పరగద్వారావతి పశ్చిమంబునను॥ నరుననుత్తరమున వాబకా
నదియు। తరమిడిగంధమా దనమయామ్యమున। రతినసంత్తంబుత్తరాప
ధంబనగ। క్షితివామవంతంబు సీమగామరియు। యెంన్నంగదేశంబు
లెన్నియెన్నియును। యెంన్నంగమోక్షార్థు లెందరెందరును। శకునో
ప్పిదక్షిణ కైలాసమనగ। బహుగానయిట్టిశ్రీపర్వతాధీశు। వారకదశింప
వచ్చినయప్పుడు తారొక్కకొలదియై తనరుననిన్నియును। మానుగాబర్వ
తుమహిమ యెట్టిదియో। జానొందశిఖపుడైన చదిగాంపలెంను। యొగినెట్లు
బోయెననోయనుచుండ। నొగ్గివచ్చితిమికుల బుద్ధగించితిమి। మ టిమిశి
రిగిరి మల్లయ్యజూడ। గంట్టిమిగట్టముల్ గడచితిమింక। ఫుట్టువుల్ సఫలత
షొందెగర్మములు। చెట్టులనటమున్న గట్టవచ్చితిమి। పెల్లిడగంటిమి బిక్ష
లదొల్లి। యూళ్లమొక్కినమొక్కు లోగిబూరగించె। మదిలోనశివ
యని మముమేమర్కొంగి। నదిమూదిగాకబో యెదముపోయెదము। సిరిగిరి

పూగముల్ బలుపతాకలును। అరుణాబ్జకర్ణి కారాశోకరక్త। కర
వీరవంశక కైరవాద్యఖిల। సురుచిరప్రసవని సూత్రితమాలావ్రకర।
బంధతత్పువ్వు ఘంటికావళులు। యింతయునింపు వహింపగల్పింప। నం
తద్భక్త మహోత్సవంబుచూచి యిలదివాహంతి బహిస్తిమోయునగ।
వెలిచీకటిన హేమవేళనుకాని। చెడదుసూర్యాచుకాల చేతశ్రీగిరిని సడి
సనుభక్త దర్శనమాత్రమును। పడిబహిరంతర్వి వానిశంబనగ। పడి
యునురాత్రింటి పగలింటలోన। వెలితమంబంతయు వేగంబ క్రాగు।
నిలమీదదనబ్రతు కేటికినచు। గడుగునులజ్జచే గడగివారాసి। బడిన
భావంబున భానుండుగ్రుంకె। ఘూనుగసూర్యాస్త మానంబుజెప్పి।
జానొందనారాత్రి సంస్తుతిసేత। దాసవశ్యముకవి శాధర్మమునకు। యే
నింకనీరాత్రి యెట్లువర్ణింతు స్పృధులకాహళ శంఖభేరీరవంబు। ప్రధి
తమృదంగాది బహుఘోషణంబు। ఘాస్యతాళానేక ఘంటికాతీవ్ర। శ
స్తోత్రరావంబు జయజయధ్వనులు। నలరిసంధ్యావేళ లందందమేసి। నిల
వాద్యరవమెదా నొప్పొద్దుగూడ। గర్జిల్లునభ్రము ఘనఘనాటోప।
గర్జనంబునగిరుల్ గర్జిల్లుచుండ। వారకచీకటి వర్ణింపమంద। మూ
రాదుతద్దీప మాలికాతతుల। ప్రాసాదగోపుర బహుహేమకలశ। భా
సురద్యుతులు శంభధ్వజదండ। ఖచితభాస్వద్రత్న కలితదీధితులు। ప్రి
చురప్రబలప్రేమ। రాత్రిల్ బగిల్లు। కరగుచవెలుగారతి మిరమఫ్పురిని।
గిరికన్నడునులేరు నేడేలచెప్ప। నరిజాడచోరుల చర్చింతమేసి। చరి
తాధర్మవంతులు శైలాగ్రచరులు। యుడుపతివర్ణింప నూహింతమేని।
యుడుపతిగనక దాంగుడునభావీ। పంక్తంపఘనసముద్భవ ధూమధూమ।
పటలంబునీలాభ్ర పటలమైయునికి। జలజోత్పలావి కస్వరవినస్వరత।
కలవపవర్ణింప। కందమేయును। భానురాభ్రంకవ పర్వతోన్నతిక।
నాసూర్యచంద్రోద యాస్తమానములు। కొలకులకలువలకును దామ
రులకు। నలినహన్నిర్ణశముగా నంగరాకునికి। యప్పాటవర్ణించుట

## మృగవ్యాధునికథ

వివేకమెట్లు। చెప్పచిత్రంబగు శివరాత్రిమహిమ। యొక్కమృగవ్యాధు
డుతుకాననమున। గ్రక్కు నొక్క మృగంబువీక్షించి। శరమరిబోసి భా

స్వదృష్టిముష్టి। నరససంధానకౌశలమువట్రిల్ల। తొడరియేయుడు గోల
తోడనమిట్టి। పడినమ్మృగమునుచ్చి పోరితభ్బరము। చక్కసనిమ్మ భూస్థ
లినతినిద్రి నక్కొన్న కాల్పులి సత్త్రపైబడుడు। చిట్టిల్కిపడి వరిస్ఫీతో
గ్రవృత్తి। గట్టికట్టి వ్యాఘ్రంబు శీఘ్రంబ। పైబడ నతిభయ భ్రాంతిమై
యెరుకు। వేబారియొకబిల్వ వృక్షమెక్కుడున। తలచుట్టుపెనురక్త
ధారలుగ్రమ్మ। పులినొచ్చివచ్చియా భూరుహాగ్రమున। నున్నలుబ్ధకు
గని యురుకోపవహ్ని। గన్నులగ్రమ్మ నుత్కటధూమలతలు। ముక్కు
న వెడల సముద్ధతివృత్తి। మెక్కజూచుచు శాఖ లిడగమించుచును। సరి
మురినూచుచు నరచుచుకరచి। కరచివైచుచునొడు కరచుచుచుట్టి। చు
ట్టివచ్చుచు మూల్గుచును। బోరచరచి। బిట్టప్పళించుచు బిల్వవృక్షంబు।
తోవాలమడచుచు దాటిక్రొల్చుచును। పోవకయిమ్మాడ్కి పులియునిక్క
గలిగి। తానెక్కచచ్చునే ధరనెల్ల పులికి। నైనవృక్షాగ్రంబు ననకవ్యా
ఘుండు। ప్రాణభయంబున భ్రమసియాత్మయు। బ్రాణతాపోపతాప
మునవ్యాఘ్రంబు। యెట్టునుబోనేర దెగురుమాప్రినక్కు। పట్టుజంపును
తను భంగించునొంచు। నంచుతదీయబిల్వానీరూహాన। ముంచితస్కం
దంబ హారమూత్రిగాగ। పులికిజిక్కతినని పొగలుదచ్చోక। జలబిందు
తతులు వర్జనజలంబులుగ। వరులైన వేతపత్త్రిరిదుంచివైవ। తరిదరినది
నిరంతరపూజగాంగ। పులియేనుజంపక పోవననియుండ। పులికోడియ్యా
తంపు బోదకయుక్కి। దలిలియాకామ కృతమునజెంచుచుకు। శివరాత్రి
యదియట్ల చన్నైజాగరము। కందర్పహారుడిట్లు గైకొన యెరుకు బొంది
తోడన గానిపోయెవ్వను। యల్లరాత్రులయట్ల యీశివరాత్రి। జె
ల్లునేకవితావి శేషతబాగడ। శివరాత్రిమహిమ యీశివుడెగ్గునక।
తవిలియట్లాప్పు సంధ్యకాలమునను। అత్యర్థిబ్రియుణ సంయ్యముడు
నయ్య। నిత్యలింగార్చనానియమముల్ దీర్చి। శ్రీలింగచక్రపతిత్రికిభ
క్తసత్కృత్రి। యాలోలుశ్రీమల్లికార్జునదేవు। సంధ్యాయుతాంబోద
సద్వర్ణజూట। సంధ్యోచితార్చనా సంతుష్టజేసి। అంతంతదీయుని
తాంతోపమంట। పాంతరంబునపురాంతరంబునను। రంతరదేవా యాం
తరంబులను। భాస్వరసద్భక్త భవనంబులను స। ఆస్వతివాహి నిష్ప్రం

తదేశముల। సుఖతరగోపుర చూడాగృహముల। శిఖరశృంగాటక। సిద్ధ
శృంగముల। రమణసారంగేశ్వరము హాటకేశ్వ। రమును వరాహేశ్వ
రమును సిద్ధేశ్వ। రమును పాపవినాశనము గిన్నరేశ్వ। రము నాదియ
గు నీశ్వరస్థానములును। సల్లలితంబుగా సన్నయమిప్పించి। పెల్లుబమ్మ
గ్గులు బెట్టంగబసిచి। విదితలింగార్చనా వేదికోన్నతులు। పసపడిబింది
యల్ పడిగంబులర్ఘ్య। పాత్రలునూతన భాండముల్ వంశ। పాత్రలు
ఘంటలు బహుళధూపదీప। పాత్రలుబహు స్వాహామ పాత్రలురజత।
పాత్రలువిడెములు ఫలములుకజ్జ। ములుసుగంధద్రవ్యములు సి పుష్ప।
ములు మాలికానికరముల ఖండబిల్వ। పత్రిరుచ్యములు పంచామృత
ములు నుత్తమాత్తతములు దివ్యోదనావళులు। సతిసుగంధంపుద శాంగంబు
గంధ। పతిసురభియును నావర్త్తధూపంబు। మలయానిలంబును మహి
సాక్షిమద్ది। కలహంసధూపంబు కామికామోద। మునుమనోహర
ధూపమునుందివ్యధూప। మునుజనవల్లభా మోదధూపంబు। లాదిగా
ధూపం లానందసర్తి। యాదివర్తులును గృహాంగవస్త్రాది। వాస
స్సులునుగూడ వరభక్తతతికు। పావనామతిసమర్పణ జేసిమరియు। నే
వస్తువలుబ్రియం జెప్పుడువలయు। నావేళవారికి నభిమతార్థములు।
సేయుచునిభంగి। శివరాత్రిపర్వ। మేయతమతిజెల్లె నంతభక్తులకు। కల
పంబుబన్నిరు కస్తూరిచాందు। నలిగూర్చిసమ్మార్జనము సేయువారు।
కళికలుపత్రిసుల్ కమలముల్ గంధ। ములు ముకుళంబులు ముత్తియం
బులును। నిగ్గానునైదు వన్నియలతోగూర్చి। ముగ్గులత్యాశ్చర్య ము
గబెట్టువారు। తలకానిసంతత ధరాసహస్ర। కలశాభిషేకముల్ గావిం
చువారు। శిష్టాగమోక్త విశిష్టతదనర। సష్టవిధార్చ నంబలరించువారు।
నలిసుబ్బిభక్తగణప్రకర ము। దలచుచు ధూపార్తితము సేయువారు।
మంగళంబగుభక్త మండలికనుచ్చు। రంగత్కరముల నాళతులెత్తువారు।
అంచితభక్త హితార్థకల్పనల। పంచభక్ష్యాదు లర్పణసేయువారు।
కర్పూరగసహితంబు గావిడియంబు। లర్పించువారు సొంపారంగనిట్లు।
సముచితాష్టోత్తర శతసంఖ్యనవన। రములు సంకల్పించికతిజేయువారు।
అష్టోత్తరసహస్ర మవనరతతివి। శిష్టతమైనట్లు సేయించువారు।నాల్గు

యామములు సన్నుతిసేయువారు। నాలుగుపండ్రెండు నైనసత్క్రియలు।
ప్రేమతోనావగల్ సేయునుజాము। జామునకర్చనల్ సరిసేయువారు।
ఘటికలర్వ్వదియును గలయజెన్నొలయ। ఘటికావసరములు గల్పించు
వారు। తరిబూన్నుపూజయు దరముపూజయును। వరలబూన్నుగ నలవర
చుపూజయును। గానిరంతరపరి కల్పితార్చనలు నానందలీల బాయక
సేయువారు। శతషోడశోప చారక్రియార్చనలు। సతతంబునతిభక్తినలి
పెటివారు। ఆదిరుగ్వేదాది నలదారుసూక్త। లాదిగాబ్రాహ్మణాద్యం
తసూక్తముల। తుదిగాగరుద్ర సంస్తోత్రసూక్తములు। చదువుచుబో
దవి ప్రశంసించువారు। రుద్రవిధానని రూపితన్యాస। భద్రాత్మసం
జ్ఞులు పదసకొంటికిని। గ్రమముందచమక సూత్రంబులేకాద। శములు
నొంచొంటికి శాంతులుగాంగ। తివిరిఛందోఋషి దేవతాశక్తు। లవిగూ
ర్చిబీజాక్ష రాన్వితంబులుగ। సద్రితిశ్రీశత రుద్రంబుగూర్చి। రుద్రం
బునంద పురుషసూక్తములును। నాయజుర్వేద వేదాంతసూక్తములు।
బాయకచదువుచు ప్రణుతించువారు। సామంబుదావేద సామరహస్య।
సామాదులగు నవసామాదులందు। జనుసీశ్వరప్రశంసావరసూక్తు। లను
షక్తిజదువుచు నగ్గించువారు। ప్రవిమలాథర్వ శిరశ్శిఖాదులను। తివిరు
రుద్రపశుపతివ్రతవరదు। శ్రీరుద్రమహిమయు జెప్పుసూక్తములు।
వారకజదువుచు వర్ణించువారు। అంచితభాణగద్యాక్షరగద్య। పంచ
గద్యాదులు పటిగణాడంబ। రంబు వర్ణాడంబరంబు వ్యాసాష్ట। కం
బును శ్రీనీలకంఠస్తవంబు। శ్రీరుద్రకవచంబు శారభంబునుమ। యూ
రస్తవముహాలా యుధమనామయము। మలహణమును మహిమ్నంబను
స్తవము। మలయరాజియ్యంబు మానిదండకము। స్తుతిమాలమగు ను
హాస్తోత్రసూత్రములు। శతకంబుశివతత్వ సారంబుదీవ। కలితమహానాట
కమును దాహరణ। ములు రుద్రమహిమయు ముక్తకావళులు। గీతసూ
క్తములు భృంగిస్తవంబులు జ। రాతమునిముఖ్య రచితాష్టకములు। హ
రలీలరుద్ర సహస్రనామాదు। లరుదొందజదువుచునంకించువారు। నరు
దగుదానయ్య నరువత్తుమూరు। చరితంబులును శ్రీబసవపురాణంబు।
నేలలువెట్టంగ నింపుసొంపారు। శైలిచేగ్రాలుచు జదివెడువారు। చాతు

ర్యమెసగ బసవదండనాథు। గీతంబులాదిగా గీతాధ్యులైన। సకలపు
రాతన చారుగీతములు। ప్రకటించి ప్రకటించి ప్పాడెడువారు। చదువుల
పాటల సంగతిభేదముల్। పోదవిమాటల యందపొగడెడువారు। ఆమాట
లకు మనంబందమి మల్ల। యామల్లయామల్లయాయన్నువారు। జయజ
యయు ఘోషఘోషజయజయయనుచు। జయవెట్టుమ్రొక్కుచు సరిబే
చుకావారు। నలరుచుపడిహారు లట్లయందరును। లలినుబ్బిచాంగు భళా
యనువారు। తనరశబ్దము గద్గదంబున వెడల। కునికితప్పక చూచుచుం
డెడువారు। చూపులుశివసుఖాశ్రుల వెల్లిముంప। నాపోల కెగయుచు నాడె
డువారు। మెఱయంగమొగమొంగ నెంతయుగాళ్ళ। మొగయఁదననెక్కి
యిలవ్రాలువారు। ఆటలాత్మీయ్య సర్వాంగవిస్ఫురణ। పాటిదప్పినజొక్కి
పడియెడువారు। చప్పట్టువెట్టంగ జక్కనలేచి। యప్పాట వెడలంగ నాడె
డువారు। వేడుకతో జిందులాడంగనుబ్బి। కోడంగియాటలు గుని సెడు
వారు। ప్రస్నునినిజదేశ భాషలజతల। కన్నిబోషంగాట లాడెడువారు।
భ్రమరులుజాళెముల్ బయనముల్ మెరసి। రమణపంచాంసి పేరణియా
డువారు। ప్రమథపురాతన పదుచరిత్రములు। క్రమమొందబహునాట
కములాడువారు। లలితాంగరస కళాలంకార రేఖ। లలవడబహురూప
మాడెడువారు। కరములు మెరములు గతులుజిత్రములు। నరుదుగ వేదాగ
మాడెడువారు। అమరాంగనలు దివినాడెడుమాడ్కి। నమరంగగడలపై
నాడెడువారు। అపియద్గతి బత్తులాడెడియట్టి। భావనమోత్రికుల పైనా
డువారు। భారతాదికథరు చీరమరుగుల। నారంగబొమ్మల నాడించు
వారు। కడునద్భుతంబుగ గంభసూత్రంబు। లడర్గంగబొమ్మల నాడిం
చువారు। నాదిటగంటర్వ యక్షవిద్యాదథ। రాదులైపాడెడి యాడెడి
వారు। విధమునప్రచ్ఛన్న వెషముల్దాల్చి। యధికోత్సవము దొంకా

## ఆటలపాటలు.

టనట్లాడు। శిరమునసురమున జెవులగంతమున। కరములగూకట గాళ్ళ
జెల్వారర। కవదండలును గనుగవకరుణికలు। జవరంబులును। గలశముల
దరడలును। భసితంపుపూతపై బరగుపచ్చనలు। ననలారుచిరుగజ్జియలు
నందియలును। సరిరత్నపంజ్తుల జలపోసనములు। కరముప్పతంగళ్ళ గల

చల్లడముబు। పొల్చుదంతావళుల్ పుష్పమాలికలు। దాల్చియత్యద్భు
తోత్సవలీలదనర। జనులుహర్షించిప నాస్థానముల్ జొచ్చి॥ యమునకూలవి
విధ వాద్యసమేళనమున। నాభర్ఝటంబిచ్చి యొయ్యనజవనికలు। గర్భం
బువెడలి యక్కజముపట్రిల్ల। నందకముందట నభినయంబొలయ। జూ
డః ముందట చోద్యంబుదనర। నిక్కుచునిమ్రిభంగి నిలుచుచునట్లు। సొ
క్కుచుసభజూచి యొక్కింతనగుచు। నలినంగసంచల నమునందగతులు।
లలిగొనిభ్రూలత। లనసర్తనంబు। మొనయుచిత్తోల్లాస మునసర జగతి।
దనరకటాక్షంబు ననుకూలంబు। అలరిశిరఃకంప మాచరింపుచును। నలి
నంగుళిస్ఫోట నంబుసేయుచును। లాగువంజళము దాళమువళితిరువు।
బాగువహించిచాళి బయగతిసుగతి। బహుగతిగతియనా బరిపాటిదనర।

## భరతశాస్త్రిలక్షణం.

సహజమైతనుగతి స్వరవంచనములు। పటురసాలంకార భావముదనర।
స్ఫుటవాద్యతాళ సంఘటన ఘటిల్ల। తనపాదఘట్టన దనదునుద్భటన।
లనునటించుచు, నందియల్ గదల్చుచును। ఓహో యనుచు గతు
లొడగించుచును। నాహాయనుచు లాస్యవనుఃయింపుచును। జతులుబా
డుచు తాళగతులనాడుచును। శ్రుతులగూడుచునేల ద్రొక్కనొకు
చును। వీంగుచుగరణికల్ విస్తరించుచును। లోగుచుదంతావళులు నటిం
పుచును। బొబ్బలువడచుచుపొంగియార్చుచుచును।గుబ్బనలేచుచుగునిసి
యాడుచును। జాఱుచుజంగలె జాచుచుమంది। నూర్చుచుచు మొగంబోర
వచ్చుచును। జంకజాపుముబయల్ జప్పరింపుచును। చంకలదనుకొంచు
శంకరుబాడు। చున్న నురుకుచు గెళ్ళచూపుచుబన్ని కొనుచు గంతు
లువైచుచును మణికట్లు। చెడమరింపుచు వ్రేళ్ళ పిడికిలించుచును। యొ
డలడంచుచును। రంబొగ్గుచువీంపు। విరిచికొనుచు ఫురివిచ్చుచుమోము।
బోరదుప్పచ్చుచు భుజంబుఉబవియుచును। మోర్కాళ్ళదొడలును ను
డివరచుచును। గూంకటిగిరవుచు గోకటింపుచును। మూతులునురుపుచు
మురకటింపుచును। మోత్రికునుబ్బుచు మురియుచుజనుచు। మిన్నక
చూచుచు మెడవిర్చికొనుచు। కన్నులార్చుచు చెవుల్ గత్తరించు
చున్న వెప్పరలాటుచు పెక్కరింపుచును। గప్పానతమతమ గతులుప్పచ్చు

చుచు। బొమలెత్తి త్రిప్పుచును। బుగ్గరించుచును। తమకించిదాటుచు
దండయిచ్చుచును। కొంకుచువడకుచు కొనచూపుచూడు। వంకలబోవు
చు శంకించికొనుచు। బరులచేవేయుచు। బకపకననుచు। కోరముబ్బు
చుచు। చొల్లుగారిచికొనుచు। సరసంబులాడుచు జప్పటవిడుచు। విర
సంబులాడుచు విరివీగుచును। యొండొలగంబులో నోరసితిరుగుచును।
సద్దంబువిగటంబు నన్ని వారుచును। మరగాలనడచుచు మట్టిగాలగుచు।
నోరిగాలఁ దచ్చుచు ధరగంతుగొనుచు। మోకాళ్ళనడచుచు మొగికా
ళ్ళనేల। దాకుచుండగనేగసితటుకునజనుచు। కూచుండినడచుచుగుం
పించియుచట। నాచుణాచుమొరములందందవైచుచును। యురముననడు
చుచు। నూడకుండనుచు। ధగబోరలుచు సముద్ధతిలేచినగుచు। యుర్వి
దిరిప్పటమున నొకవేళలయిడియు। గుప్పుగాదిరుగుచు గుర్పించికొనుచు।
గరతలంబూనిశీఘ్రమసారియట్లు। ధరదిరుగుచు దెసల్దన్ని నిల్చుచును।
ధరబొమ్మరమునట్లు దలకిందులేచి। తిరుగుచు దిక్కిదన్ని తివుటనిచ్చు
చుచు। నమలియుబోవెనున్న తినటించుచును। భ్రమరంబుక్రియను దా
బరిఘటించుచును। జలుకయుంబోలె జెన్నొలయుబల్కుచును। జలచరం
బులవ్రోలె జనులకుల్కుచును। కలహంసయునుబోలె గతులనెంచుచు
ను। యిలమృగమట్లరిమిచూచుచును। గండుగోయిలవోలె కడగికూయు
చును। వెండికోతియుంబోలె వికృతిసేయుచును। అలరంభనువోలె నట
యిటజనుచు। జలకాడునుబోలె కూర్మెనగొనుచు। మదగజంబునవోలె
మారుమలయుచు। పొదలివ్యాఘ్రంబట్లపొరిమలియుచును। కేసరివోలె
లంఘించిపట్టుచును। వనటీదునువోలె మడ్డలెట్టుచును। మహాభుజంగ
మున్బోలె మలకలుకొనుచు। విహగంబుక్రియనభోవీధులజనుచు। నరివి
లాసినివోలె నభలమురియుచును। వరవియినట్ల భావంబులరయుచు। కలి
యట్లఁ వరస గ్రాహకుండగుచు। శివయోగియట్టులచిరినవ్వునగుచు। పగ
లేనినృపునట్ల బరిణమించుచును। పోగలేనివహ్నియు పోలిమించుచును।
ఛాయలేనివెలుంగు ఛాళిగవ్వుచును। మాయలేనిశివుని మాయనొప్పు
చును। పురముబంగాల్చిన పొల్కియాడుచును। మరుజిరుపుచ్చిన మాడ్కి
యాడుచును। సతికర్ధమిచ్చిన చందమాడుచును। యతులుబోల్పగ

వానవిశ్వేతి! వానయుమగుమార్గ వానయుబుధ! వానయునుభువన
వానయుశ్వేత! వానయుభూషార సానయురుద్ర! హాగివానవిధివాన
యశ్వదిగ్వేప! కరమొప్పుబుష్మీ వాన కార్తీకా వాన! జీవను శ్రీఘోర
వానయు బ్రింహ్మవాహ! శివసిద్ధిపురవాన! శివశక్తివాన! వ్రాలివభు
వనాది పతివానయునగి! వ్రాలియష్టాదశ వాంశనామములు! ఆళాప
కాళ నవ్యాప్తిబెడంగు! పాళనముల్లికేయు వరమింపునుంపు! అణుప్రుతి
రుపు జయయమజయకాంత! వృణప్రాణవల్లిభజ వణపాళిప్రనైజణ! వహా
ణీనవ్యాంగు శివహావియునవర! మహాణియొ నాసిగువది రెండుగతులు!
సరిగమపదనిసా నప్తస్వరములు! నకయంగనారోహి యనరోవాజక్రి!
హాళసంపదల బ్రివ్యస్తసువ్యస్త! లాలితనొప్పు సప్తాలాపనములు! తెలి
యనల్పాదితొమ్మిది విధంబులందు! ధలుకొత్త వంశ నాదంబులింపార!
జనగషడ్జయును బుషభయుగాంధారి! యును మరిమధ్యమంబును పం
చమంబు! ధైవతయును నిషాదయునునాసిట్లు! భావింపబరగునప్త
గ్రామజనిత! ములును! దితస్వరంబులుపుట్టి కాల! ములు తిధినక్ష
త్రములు యోగములును! జాతిభేదములు స్వజాతిస్వరములు! జాతులు
దనర నాస్వరములలోన! కళయుగూడ నిష్కళసంపూర్తియు! ప్రకటం
పషడ్జ సంభవములువాల్గు! ఆవళిమధుర యేకార్తినాగ! భావింపరు
షభ సంభవములుమూడు! భృంగిజాతియును! బరాంగతియనగ! సంగ
తిగాంధార జనితముల్మూడు! చనబూణ్ణరాశి వింజకయలంకారి!
నీసంగమధ్యమ జనితముల్మూడు! వరరేణుకయు ప్రస్తావాసయుల
లిత! స్వంవాసిపంచమ జనితముల్నాల్గు! దనధుభాషాగ్ని నర్తకియు
నాపూర్ణ! యును నాగదైవత జనితముల్మూడు! వరనప్రిప్పన్న
సర్వవ్యాప్తులనగ! బరగునిషాద సంభవములు రెండు! తలపసప్తస్వ రా
త్మకములైయిట్లు! యిలనొప్పుశ్రుతుల్లు నిర్వగరెండు! దీర్ఘలాలిత
యును దీర్ఘకదీర్ఘ! దీర్ఘోల్లసితమును దిఘకంపితము! యొల్ల
సితంబు సమొల్లసితంబు! నుల్లాసితంబును! నుచ్చరితంబు! స్ఫురితమూ
ర్ఘ్న క్షిత్తమునుగోమలంబు పరగునక్షిత్తంబు భ్రమితమహాతేము!
లలితోత్తమంబును! లలితప్రస్తుతము! వలరుగ్గుంపితము సూక్ష్మాంతం

చాళకీతులును। స్థానంబులగుమండ్రి మధ్యతారములు। తానాంగతత్వం
గతను ..డులాడ। చేసియుమార్గణంబు దీటుకొనంగ। భాసురంబుగదశ
పాత్రిణాములులియ। లలితసావర్ణ నాలంకారభావ। ముల్గు మృదుమధు
రసముచితోక్తులలర। యున్ననువావేశములలోనవేసు। గొన్న బాణుల
లోన కుపితవేషమున। కంబళాస్వదరాది గాణాదిపతులు। తుంబురునార
దులు బీత్రితిబాడ। అంగదాగంబుగ తాంగరేఖయును। రంగశోభయు
ముఖరాగంబుతతము। వితతంబునిపయుంబు విగతంబునంశ। గతియు
నావత్త సంగ్రహాగతిలవణి। దేశికారతన భాదిరదయుచునుక। లాళం
బుబొక్క చళావళిభ్రమరి। యవధానమును సంధియును నొకవిధము।
వ్యవసాయమును నిజవణియు గ్గితము। తాళమభినయము తాపనయు
నును। తాళమభినయము తాపనయునును। తాళంబునుబ్రిసన్నవయు
వివర్తనయు। వయువాటము లలితపవయుగనిష్ఠ కయును వప్పణ
మునుళయునుగోమలక। యుల్లాసమును లళియును మనోహరము। దిల్లా
యితుశాణి దేవయుజంకె। డాలంబుకరగి సౌష్ఠవమువిభ్రమము। చాళి
యొయ్యారంబు సరసంబుచనర। వరుసచతుర్విధ వక్త్రవిభ్రమము।
శోరిసప్తవిధ నిజభ్రూలతానటన। షడ్వింశతిక్రియ చతుశ్చింకతము। ష
డ్విధనాసాల సత్కుంచితంబు। ఘనయుక్తిదశ విధకర్ణావధాన। మును
నవవిధగళముఖోల్లపనము। సుమచిరతిత్రివిధ వక్షోవిలాసంబు। ధరజెవ్వ
ప్పు బాదద్వయపంచ। కంబునూరుద్వయకలితపంచకము। పంచిమ
గతి సమభంగద్విభంగ। అరుదగువింశతి యంగహారములు। ధరనిరుపది
రెండు దానకంబులును। సత్త్రింశద్దృష్టి చౌనష్ఠహానహస్తములు। చిత్ర
విక్రియలు పచింపముప్పదియు। యోగకరణంబు లష్టోత్తరశతము। మొగి
నూరలంకార ములుశిరోభేద। ములు బదమూడును ముప్పదిరెండు। ఫా
లుఘారుమంటనంబులునొప్పహంస। గతియును మాతంగగతియును వృ
షభ। గతియును। మర్కటగతియును మేష। గతియును మాయూరగతి
యును సింహ। గతియును నాబెక్కుగతులుబోల్పా। రంభయాదిగనప్సర
సమూహంబు। కుంభిణీసతులలో గూడియాడంగ। నాదటినుభ యామ

రాచార్యులు। నాదధీచియుపమన్యు లాదిగాఁగొల్వ। తక్కినతాపసోత్తము
లలోఁదలఁసి। మ్రొక్కుచుభృగుముఖ్య మునులుభజింప। ప్రమథులప్పరి
వీర భక్తసంఘంబు। రమణనుబ్బుచు శివార్చనములుసేయ। నాఁజనా
దరను దుపయోగజగఘటించు। పూజారితపసుల పోల్కఁబూజింప। విభు
తరంబగుదాన పతులలోఁగలసి। యిభముఖషణ్ముఖులిరుదెసఁగొలువ।
చండాంశుశశికర జ్వలనతారకలు। ఖండదీపములలోఁ గలసివెలుంగ। నా
రంది మహాకాళవిభులు। ద్వారపాలకులలోఁ దారునుగొలువ। కమనీయ
ముగు మౌక్తికచత్రిధికలు। రమణనిందుఁ్రెండు ఛత్రిముబట్టిగొలువ। బొ
సరుచు భానసంబులవారిలోన। ననలుండుశౌక పాశాదులోనవఁగ। వా
లాఖఫురితల పరులలోఁగలసి। బాలుబాలాయంచు బిముడసుగొల్వ। పరి
చర్యలోనరించు ఫణిహారులట్లు। గరమధిక బడిపనుల్ సిరుతిసేయంగ।
సమ్మార్జనము సేయు జనులలోవరుణు। డిమ్ముగలసమ్మార్జన వంమ్ము
సేయంగ। కసవులుదుడుచు కింకరులలోఁగలసి। శ్వసనుండునటమున్న
కసవులునూక। భువినిమ్ముగ్గులుపెట్టు పుణ్యులలోన। నవరత్నములమ్ముగ్గు
సరవాహుడిడగ। తవిలితాండవమాడు తవసులలోన। దవిలియాశౌ
ను డు తాండవంబాడ। బాణాసురాది శుంభదైత్యవితతి। క్షోణీశ్వరుల
లోన గూడిభజింప। పండితసత్కవి ప్రవరులగలసి। చండకీర్త్యాదులు
సంస్తుతిసేయ। అరయతక్కినవాన వామరముఖ్య। గరుడగంధర్వ కిన్న
రసాధ్యసిద్ధ। వరగణావళి నొంటివరసలప్పారి। పరువనబనిసేయ భానసం
బునకు। సురగిరిముఖ్య భాసురగిరితతులు। పురవరగిరి నంఘములకిరియ
గొలుప। సురతరుముఖ్య భాసురతలతరులు। పురితరువర చయంబులలో
నగొలువ। సురధేనుముఖ్య భాసురధేనుతతులు। పురిధేనువులలోన పారి
బారిగొలువ। సురమణిముఖ్య భాసురమణితతులు। పురమణి తోరణంబు
లలోనగొలువ। ఖ్యాతిభాగీరథి గంగాదినదులు। పాతాళగంగాను బంధ
మైకొలువ। యేడువార్ధులలోని యేడుద్వీపములు। వేడుకబురవీధి వీధు
లగొలువ। ఆకాంతుమువ్వది యారుతత్వములు। పాకారహర్మ్య సోపానం
బులైకొలువ। ముల్లోకములనాదు మల్లికార్జునుని। ముల్లోకములలో
నమున్నతికెక్కు। సచరాచరములు శ్రీశైలంబుమీఁద। సచరాచర్యాదులు

చాప్పునగొలువ। సుస్థితిమల్లికార్జున దేవదేవు। నాస్థానమిట్లు చెంన్నారం
గవరవ। నంత నంబునను ఖేచరు జయయ్యగ। నంతసూర్యోదయంబయ్యె

## సూర్యోదయం.

నట్లువిన। మంధరకందరమందిరనియతి। సుందరుడబ్జసుకేశునినసంధ్యా
ముల। నొప్పమిచేసిన నొడలికినలిగి। యెప్పుడీయుదియంచు నప్పురవైరి।
నిప్పులుకన్నుల నుప్పతిల్లంగ। తప్పజూచిన నప్పుడుధరణి। తాళఫల
ములు వాతూలచేబడిన। చాలిదోప్పనబడి జలజమిత్రుండు। వడిదొల్లి
దొల్లి శ్రీవారణాసికిని। కడుచిత్రమునివసుల్ గమిగట్టిచూడ। నప్పుడ
బోయి యుద్యద్భక్తిముక్తి। తప్పకశివునాజ్ఞదలమోచియుచట। నవ్యయు
నభవుచాలార్కేశునాపు। దివ్యలింగంబు బ్రతిష్ఠగావించి। చిరతపోనిష్ఠ
భజించిమెప్పించి। హరుచేతతొంటి సూర్యత్వంబుబడసి। భాతిగాతొల్లిం
టి వగిదినభాను। డేతెంచియుదయాద్రి యెక్కినమాడ్కి। నంతసూర్యో
దయంబగుడుమపరస। యెంతయుబ్రీతితో నిట్లుహాళిశేషు। నవికళమతి
మల్లికార్జునుమ్రోల। శివరాత్రిపర్వంబు జెల్లుటజేసి। భావింపదమతము
భవరాత్రిలెల్ల। వెలిగించిక్రియపొద్దు వేలెలెండనుచు। పాతాళగంగాడ
బారెడువారు। భాతిగాశిఖరేశు భజియించువారు। పారణసేయు నొప్ప
గబోపువారు। యూరకదమతమ యూళ్లేగువారు। తరలక శ్రీపర్వత
ప్రదక్షిణము। యెలమి లింపుచుకయేగెడువారు। వరలకసంతోత్సవమునా
య్యజూచి। మరికానిపోమని మసలెడువారు। తప్పకపంచరాత్రంబునిక్క
చాలు। నొప్పశ్రీగిరినంచు। నుండెడువారు దండివిరక్తులై తత్పురంబు
నను। యుండెడువారునై యుండంగనంత। పండితునోనయ్య వంచరా
త్రంబు। యుండంగదలచి సూర్యోదయవేళ। నలిదీటికొాన మల్లినాథున

## దోనమ రాజయ్యగారికి మల్లికార్జునుడు ప్రత్యక్షం.

ఘనశ్రీకలశాభిషిక్తునిగాజేసిమరియు। తడయకపంచామృతస్నపనంబు।
నడధూపదీపాదు లెత్తిమ్రొక్కుచును। క్రమమునమృష్టోప కములగం
ధోద। కములను మరిజలకంబు గావించి। సంధిల్లదడికొత్తు లంభునలిచ్చి
బంధురాంబర మహాభరణముల్ బూన్చి। ఖ్యాపితభక్తి నక్షతగంధపుష్ప।
ధూపదీపాదులుత్సుకతనొనరించి। యుంచితప్రీతి మహానివేద్యముగ। పం

చభక్తౌదులేవఁ డసమర్పించి శిష్టసద్భక్త రాజికి ప్రేమమీఱ। నిష్ఠాం
స్నపానోదు లెలమినర్పించి। కర్పూరసహితంబు గావిడెంబు।
లర్పించిసవ్య పుష్పాంజలులిచ్చి। వరుసనే వేమాఱ్లు వలగొనివచ్చి।
హరుచెక్కుభంగుల నభినుతించుచును। కనుమూయునంతటఁ గలయును
బోలె। తనుసేయుభక్తి తత్పరతకు మెచ్చి॥ మదనసంహారుడు శ్రీమల్లి
కార్జునుడు। పొదలుచువృద్ధత పోధనుఁడవ। యరుగుదేవర. శరణార్థి
సేయుచును। గురుమూర్తిదనయొద్ద గూర్చున్నఁజూచి। యెటనుండీవ
చ్చెద రేయూరువారు। లిటయేగుదెంచితి రెంతగాలంబు। నావుడుఁదపసి
దోనయగారెవారు। శైవలోకమున కాచార్యుండుపండి। తారాధ్యవి
భుడు తెన్నెయున్నవాండు। వారును మేముబూర్వస్నేహితులము। నా
పండితుండు మేలైకూర్చుమాకు। మాపేరు సర్వజ్ఞ మల్లికార్జునుడు।
సనయంబుసిరిగిరి యదటిగూడ। వనములగిరుల దుర్వారకాంతార।
ఘనబిలాంతరములో గంహారంబులను। యునికియాశివరాత్రి యొప్పు
చూడంగ। యరుగుదెంచినవార మనుడుదోనయ్య। కరపద్మములుమోడ్చి
ఘనుడు సర్వజ్ఞ। చూచినమునువిన్న చోద్యముల్ గలుగు। నాచెవ్పజూప
శ్రీభగమునననుడు। రమ్మ దోనమ రాజుదోడ్కొనుచు। గ్రమ్మరబిల్వ
వనమ్ముమధ్యమున। నరసతనందొక్క శైలశృంగమున। విరచింపజనుదీప
వృక్షమెక్కించి। శిరమునజెయ్యెడి శ్రీగిరిగూడ। గరతలామలకమై గా
నవచ్చుడును। అన్నతాకాంతాత్మ దనుమదోనయ్య। సద్భక్తిదపసికి
శరణార్థఁ జేసి। నెడనెడనేగంగ నేటికిజూడ। బడసిరిజూడ శ్రీపర్వతంబెల్ల।
సముదుతపోధనుండద్దేవపురము। ఘనతరంబగుహేమ కలశముల్ గుళ్లు।
కోటలుగొమ్మలు గోపురంబులును। నాటకూటంబులు నామల్లికేశు।
ప్రాసాదముమమంట పంబున క్షేత్ర। స్నానులౌభగ్గఁ వర్గంబులజూడు।
హాటకేశ్వరమ దేయుండుసద్భక్తి। హాటకేక్కిన వీర భక్తవర్గంబు। వీర
శంకరుడును వీరభద్రయ్య। వీరభోగయ్య వీరదేవయ్యయు మలహార్యన
ద్భక్తి మతిగల్గినట్టి। పొలతిచాకలదేవి హరిప్రభాతయ్య। మరియువీరా
దిగా మహితసద్భక్తి। నెంబ్రతిష్ఠించిన నిష్ఠులజూడు। శిఖరేశ్వరముజూడు
శ్రీనగేంద్రంబు। శిఖరంబునను ముక్తి శిఖరమైవెలుగు। సిద్ధకామేశ్వర

మిల్లిదేచూడు। మహాసిద్ధులకు నిజావాసమదియు। యౌషధవనంబుల యీర్వా
శుభజింప। వేడుకకామ్యార్థ విభవంబులొసగు। యిదెచూడుకర్మ

## కర్మహరిమహిమ.

హారేశ్వరంబనగ। మదనాంతకుండు దన్మహిమమెరుంగు। నచ్చారుశృం
గంబునందొక్కపాము। చచ్చితద్దేహంబు వ్రచ్చియుండన్నదను। ఆరిము
రియొకగద్ద యాసాపశబము। గరచికొంచునుదీవ్రగతిమీదకెగయ।
వాతోపహతినందు వడిరెండుపురువు। లేతెంచికర్మహారేశ్వరంబందు।
బడి జలంబులలోన ప్రాణముల్ విడువ పుడమిబల్లహాలవంశమునవభ్రి
వించి। యాపుణ్యఫలమున నతివయుబతియు। నైపూర్వజనియంత నని
లోపహతిని। కర్మహారేశ్వరోద్గతసరంని। నిర్మలవారి మునింగిచచ్చు
టయు। పరిమళతత్పుణ్య పటుఫలప్రాప్తి। భువిబల్లహానివంశమున
బుట్టుటయును। జాతిస్మరాత్వను నంధిగాజేసి। యీతెరంగంతయు
నిద్దరునెరిగి। వేగంబనకల నియోగంబుగొలువ। శ్రీగిరికేతెంచి చెలువ
యుదాను। బల్లహానత్యంత। భక్తిసంయుక్తి। మల్లికార్జునిమహా
మహునిదర్శించి। భాసుందివ్య ప్రభాభామరముగ। ప్రాసాదమునుమం
టపంబు బానసము। మఠముపదంతిక మఠముగానొక్క। మఠముగ
ల్పించి ;యామఠమునిండంగ। మరకతమౌక్తిక మణిపుష్యరాగ। వర
వజ్రవిద్రుమ వైడూర్యముఖ్య। భూరిరత్నావళుల్ ప్రోకలుఖోశి।
చారుషోడశవర్ణ సంపూర్ణమైన। వ్రతిలేనితనయింటి బండరుధనము।
శతసహస్రార్బుద సంఖ్యానునిలిపి। వివిధాభరణములు వివిధాంబరములు।
వివిధవస్తువులును వివిధమాల్యములు। కనకచామరములు కనకచత్రి
ములు। దనరారుబహుసుగంధద్రవ్యములును। స్వర్ణోపకరణముల్
స్వర్ణపుష్పములు। స్వర్ణభాండములు సకలవాద్యములు। గనకధ్వ
జములు ముక్తావితానంబు। లును సర్వసంపదలును। నివేదించి। యతిశ
యకరితురగాందోళకశ్వవి। తతులుగోమహిషీవ్రితతులొప్పించి। మం
త్రులువిబుధులు మాత్యులునీశు। మంత్రులువిబుధుల మాత్యులుగాంగ।
భృత్యులుకరణముల్ పెగ్గడలునీశు। భృత్యులుకరణముల్ పెగ్గడలు
గాంగ। బండరుగోర్ధ్వ బానిస్సలీశు। బండరుగోర్థ్వ బానిసెల్ గాగ।

తలవర్లులెంకల్ ప్రధానులునీకు। దలవర్లులెంకల్ ప్రధానులుగాంగ॥
హితులునాప్తులు పురోహితులునునీకు। హితులునాప్తులు పురోహితు
లునుగాంగ। గాయకుల్ నర్తకుల్ గలివరులీకు। గాయకుల్ నర్తకుల్
కలివరుల్ గాంగ। పండితుల్ తార్కికుల్ పాఠకులీకు। పండితుల్ తార్కి
కుల్ పాఠకుల్ గాంగ। దాసులుబంట్లు విలాసినులీకు। దాసులుబంట్లు
విలాసినుల్ గాంగ॥ దండనాయకులును। తంత్రింబులీకు। దండనాయకు
లును। తంత్రిముల్ గాంగ। పౌరాణికుల శివ పౌరాణికులుగ। ద్వారపా
లురు శివ ద్వారపాలురుగ। ఘనకీర్తి నెండియు। గలుగబహత్తు। వివి
యోగమునునతి। ప్రీతినర్పించి। ఘనభక్తులంక్కజంబుగ యెన్నవేయు। నన
నేలతానును నతివయుదక్క। నటుగూడగా దేశ మంతయునపుడ। వటు
భక్తినిశ్వరార్పణముగావించి। తరుణిపీక్షింప సత్తరుణియునట్లు। యార
సమరంబున నందాక్రమతము। పెండిగట్టించి యావ్విభునట్టితనదు। బం
డరువఖల వంప్రద్వేస్తుసమితి। యఖిలరత్నావళు లఖిలాంబరములు। నఖి
లాభరణములు నందుబెట్టించి। ముక్కంటిశరణంచు ముగుదయుదాను।
నొక్కచీరయుకట్ట యొగిబల్లహుండు। ఘోరదుర్వార సంసారవారాసి।
పారమొందింపుమో పర్వతనాథ। పాయనిదుష్కర్మ పాశబంధములు।
కోయవే దేవ శ్రీకుధరాధివాన। యెల్లకాలమునిట్లు యిరువురవనుల।
చెల్లింపకొనుమయ్య సిరిగిరినాథ। వరలంగపింపు నావాడనినన్ను।
తురువకుమయ్య శ్రీమల్లినాథయ్య। యిలవేయునెన్నంగ నేలనాయిచ్చి
నలుపుమోజయ్య శ్రీశైలవల్లభుడ। యనుచు దేవియుదాను సాపాంగ
మెరసి। చనుదెంచిమొక్కినచౌదంతితోన। యొడపకకర్మహారిశ్వరంబందు।
ఇడియుగారీశు గర్భమునందు జొచ్చి। భల్లహుండుశివుని భజియించు
నపుడు। నల్లలితాంగియు శంభునిదలచు। భవహరుండైన శ్రీపార్వతీర
మణు। శివునభిషేకంబు చేసినయన్ని। పాలుకొలనిలోపలనూటపెడల।
పాలూటయనభువి బరగెదామరియు। పడికామితార్థముల్ బడసిన
వార। లడరనసంతంబు లట్లనుగాక। ఆమూర్ధశృంగంబులందునుభూరు।
హొమ్మలు మూడున్న యదియపెచూడు। పరుడెవ్వడే దర్శనంబాచ
రించు। నరిదియాకారతి యంబుసిద్ధించు।. నొకచెట్టుమొదల నర్చనక

చెట్టువడుమ। నొక చెట్టుతుదియు నుద్యుక్తిముట్టినను। ధరస్స్వర్గమర్త్య
పాతాళలోకముల। చరితంబులెల్ల నిశ్చయముగాన్పించు। నొకచెట్టు
మూలంబు నొకచెట్టునత్రి। నొకచెట్టుపుష్పంబు నొగిధరియింప। మాధి
బ్రింపహోమ్మహేంద్రరుద్రులలోన। వేడుక నేపొద్దు విహరింపుచుండు। నొక
చెట్టుకాయయు నొకచెట్టుపండు। నొకచెట్టుబీజంబు నొక్కటనదుల। తివు
టనుత్పత్తి స్థితిలయముల్ దక్క। శివుపుంఛుననుండు శివగణాలీల। కా
మించియవ్వడే కాలత్రియంబు। నామూమతరువుల నాహారముటగి।
నవిలిమూడేసి దినములాగమోక్త। కవితోపచార సంగతిభజియింప।
సాయూజ్యసామీప్య సాలోక్యమహిమ। లారంగసిద్ధించు నదెవారిమ
హిమ। దానెట్లుగాన్పించి దరువులంటేని। మానాకపాలూట మల్లికా
జునుని। నిత్యంబుబాలను। నేతబేర్వునను। ప్రత్యేకమవియ ముప్పం
దుమునందు। చెలువారజలకంబు జేసినపత్రు। కలశాభిషేకంబు గావించి
గొంగు। పూవులు దామరపూవులు గలువ। పూవులు వెయ్యేసిపూవుల
గుగ్గు। లమును మూడేసిఫలములర్పించి। ప్రమతి వెయ్యేసి హారతుల
లర్థినెత్తి। పాయసంబులు పంచభక్ష్యముల్ షడ్రస। సాయతాన్న
ములు సమర్పణజేసి। యానక్తిమూల పంచాక్షరిమూడు। జేసి జపం
బులుసేయంగ మూడు। దినములకీశుండు దివ్యదృష్టియును। ఘనతరజ్ఞా
నంబు గరుణించునపుడు। గానంగవచ్చు వృక్షత్రియంబందు। దానేక
ములు చోద్యములు వెండియును। అనుపమదివ్యవనాంతరంబదియు। విను
పంచయోజన విస్తీర్ణమందు। వేవెంటనొక్కొక్క వృక్షంబులగదు।
గోత్రలు దివ్యౌషధాకారంబులవియు। నల్లెంటినొక్కొక్క నపలతగలదు।
చల్లుసాధకఘన సేవ్యంబులవియు। జాట్లెంటనొక్కొక్క చోద్యంబుగ
లదు। యట్టున్నవారికి నెరుగంగరాదు। జేనొంటనొక్కొక్క శివమూ
ర్తిగలదు। దానభిమతఫలదత్తంబులవియు। మూరెంటనొక్కొక్క
మునివల్లెగలదు। భూరిశ్రుతిస్మృతి స్ఫురితంబులవియు। చేతెంటనొక్కొ
సెలయేరుగలదు। ఖ్యాతదివ్యాంగనా కవితంబులవియు। బారెంటినొ
క్కొక్క పర్వతముండు। నాహ్లాదదివ్య రత్నాంగంబులవియు। కూకెం
టన్కొగ్గ కూటంబుగలదు। యోగీంద్రసిద్ధిని యుక్తంబులవియు।

సంతతంతనొక్క హర్మ్యంబుగలదు। సంతతప్రమథప్రచారంబులవి
యు। పాలింటనొక్క భవనంబుగలదు। మేటివిరక్తుల కూటంబు
లవియు। సామటనొక్క యాద్యంబుగలదు। కాఘితలోన సంకలి
తంబులవియు। వదియునుగాక ఛాయాభ్రమనగ। మొదలుతుదయు
లేదు మొగుడునులేడు। పదపడియానీడపై బారునరుల। కొదవంగగ
లవు యిష్టోపభోగములు। తరులిదేచూడు మిత్త్రిరినీడలేను। ధరనదృశ్య
కరణి దానిమూలంబు। మోహినిగజమదే ముందటిదెసన। మాహిత
పృథుల శిలాకారగజము। సాధకుడెవ్వడే సాధించియెక్కు। క్రొధిల్లు
జనునట్ట కొనుర్ఘూళిసేయు। కుప్పించునురుకుమై నొప్పించునను। దప్పిం
చదలచును నుప్పరంబెగయు। బ్రిల్లననల్లంత బటుజిరిదిరుగు। నల్లాచుఱ
ఘిరిఘిరినుబాదుతారు। నిట్టవిజృంభించి నిటయటపడగ। బిట్టాడియ
లకక బెగడకచవక। తరగగతలకక తల్లడపడక। మొనగక లెక్క సేయ
కడిర్లపడక। వ్రాలకకొంకక వడకకయున్న। గ్రాలుచుమోహినీ గజ
మంతమెచ్చి। సర్వసిద్ధులునిచ్చు సాధకులకును। గుర్వగామదియు య
ల్లకుధరంబులీను। యీవనమధ్యమదించిరాగ్రమున। భావించుచూడు
బిల్వావనీరుహము। సామహిజముక్రిందనదెబిల్వవనశి। రోమణిబిల్వేశ్వరు
నిశివాలయము। సాధకుండద్దెపు సప్తరాత్రములు। బాధితనిష్ఠమై బా
యకకొలువ। భవుదీపతైల సంపాదితాజనము। దివిరిదాల్పగ దిద్యదృ
ష్టిబొల్పారు। కామారినగరోప కంఠదేశమున। ద్రామరియొక్క దద్దడ
మునునందు। లోనొక్కక్షేత్రపాలునిశ్శరీరంబు। గానంగమరిదాని లో
నభైరవుడు। యెడనెడసాధకుండేతెరదాను। గుడియుబెరుగును పక్రో
ధోక్తటాని। ముక్కునబొగలు సముద్ధతివెడలు। నెక్కొన్న మొగమున
నిప్పులురాల। కరముబ్బిమంటలు గన్నులగ్రమ్మ। దెరల్చుచు దేహంబు
తెకతెకనుడుక। మూవులఘంటల మ్రోతనొక్కటది। శావలిర్ఝూం
ఝూయటంచునుజప్ప। రించుచు నొరలుచు రేగుచు దప్ప। రించుచురాకు.
రాకంచుచుగహాక। హట్టహాసధ్వను లద్రులజేలగ। గట్టురువడిభీతి సుట్టిం
పనిలువ। కాభైరవునిభీక రాకారమునకు। దాభయంపడక సాధకుడున
ప్పుడును। యుబ్బుచునాచుఱచు నురవడించుచును। బొబ్బలుబొడచుచు

పొంగుచుమారు। గబ్బరించుచు కలగకులకల్లకనుచు। నిబ్బరంబొందుచు
నిక్కడునింత। గర్భిబ్బలయనుచును కచ్చించికొనుచు। నబ్బితినాకంను
చు నటనిల్వుమనుచు। వర తెంచియొగసి యావ్రతిమశిరంబు। వెరపింత
యునులేక విరగదన్నుడును। ధరమిట్టిపడియంత శిరముగవ్వుచును। బిరు
దులబిరుదన పృథుశౌర్యమునకు। సత్యంబునకు సాహసమునకునిభ-
యత్వంబునకును దారత్వంబునకును। మెచ్చితిదలకిలు పుచ్చితిమార్గ-
మిచ్చితిబిలమిపు జొచ్చితిగాక। నిక్కడనన్ను జయించినపిదప। నెక్కడి
దెక్కడి యెదురింకనీకు। వారకనాగళద్వారంబబిళము। ద్వారంబుజొరు
చొరు ద్రడయకయనుడు। నల్లనబిలములో తరసెదననక। యెల్లనధర
జేతులూదెదననక। మెల్లనతావలు మెట్టెదననక। వల్లిననులుకవ పా
యమానక। తలలనిభైరవు దండరుండంబు। గళగంహ్వరంబొదిగా
లోంతునూరు। మగనిల్వులువెడల్పు మరితత్ప్రమాన। మకుబిలముఖము
నందరిమురినురికి యంతదక్షిణ ముఖంబై యెంగనేంగి। నంతకంతనుచాల
నన్నువయైన। బిలమునకడ్డంబు బెట్టినయట్టి। తలుపుభావమున నంతక
మున్నవచ్చి। కుపితవేషంబున కుటిలభైరవుడు। తపసియైయున్న సాధకు
డువీక్షించి। యటయుండెపోదపోద మట్లురాలేని। యిటయెుండెదరమ్మ
తెర్విమ్మవెంమ్మనుడు। నేలయీకొడకనీ కింతడల్లడము। చాలమిచనాడు
నీసాధకత్వంబు। యిటగానియేబిరుదెరుగంగరాదా। కటకటశరణాధి-
కరువెజహ్వకును కరములువంగ వేశిరముచక్కటికి। పరమదారిద్ర్య
మేభక్తినీమతికి। తపసులమేము పెద్దలముపెక్కండ్లు। లుపవాసముల
బాయ కున్నారమిచట। మమలేభరముపేచి మనిపోయిబడయు। నమ
రత్వమైన నీకదిమంచియదియొ। యింతనబడసితే యిష్టార్థసిద్ధి। యంత
రంబెరుగవు యదియేలవేయు। చెప్పెదనామాట చెవియొగ్గివినుము। యి
ప్పటియట్ల కాదిటమీదమనును। అదెపులిముందట నడ్డమున్నదియు।
యదినూరుమగనిల్వు లోయున్నబిలము। మున్నునెక్కడగసు ముంద
టనుయ్యి। యున్నచందమున గార్యంబున్నయదియు। దిగనురక్కవచ్చు
బోడిగ్గుమగాన। యొగయనూర్మకనిప్పు లెల్లగుబిలము। తరలుముందర
లేవు। తావఖలేవు। అరయలో తెంత దానంత వెడల్పు। పోరాదు వెక్కను.

లోకముందరికి। లోఁరాదుబిలముల లోయోదమనిన। బూనినీపొద్దు బూ
జించులింగ। మీనిలియాబిలంబినో ప్రవయ్య। పృథివినద్భక్తులే బిలము
లుజొచ్చి ప్రసిద్ధితదృష్టాదృష్ట ఫలసిద్ధిగనిరి। పత్తితల్పంబు బట్టియెయుం
క। గర్వించితలక్రిందుగాబడియెదవు। కుడిచెడికట్టెడి కొమరుబ్రాయ
మున। కొడకయచ్చటిసేమి కుడువబిచ్చితివి। చలమునవచ్చితి చావగ
గాక। యిలసిద్ధసిద్ధుల కిదియె శ్రీగిరికి। బిలముచతుర్ద్వార బిలమును
వృషభ॥ బిలమును ఖేచర బిలమునుబావ। బిలమునాదిగగిరి పేరొక్కన్న
బిలము। రెలమినిర్వదిగోట్ల యేణ్బన్నారునందు। భుక్తిప్రదస్థానములు
నూరుగోట్లు। ముక్తిప్రదస్థానములు వేయుగోట్లు। వలరియేకైక ప్రదస్థా
నకార్య। ముల నంతకోటులు గలవందులోన। వినుకొన్ని బిలములు విస్త
రించెదను। చనువాడవెట్లును జనియెదుగాక। ననవుడుమూర్ఖత
యరుగంగనేల। యనుచునాకణిక్షంప నభిముఖుఁడగుచు। తపసిచెప్ప
దొడంగె దానొక్కనాడు। విసినాంతరంబున। విహరింపనంత। యొలసిత
దీము వనోపకంఠమున। పాలుపారుకొలనిలో బుగ్గనబాడిచి। దివ్యాం
గదీధితుల్ దివ్యాంబరములు। దివ్యాభరణములు దివ్యచిహ్నములు।
నుల్లసితంబుగా నురమున నొప్ప। మల్లెపూవులపెక్కు మాలికెలమర।
కుసలకపసిడి తామరవిరగేల। కనలారనిడి మల్లికార్జున దేవు। పుర
ముదిక్కేఁగ నేబోయియుయ్యూయయ్య। చరణాబ్జములుమోవ జాగిలిమ్రొ
క్కి। పరవనాంతర సరోవరమధ్యమమున। కరముద్భవించిన కారణం
బేమి। నరుడవో నీవు కిన్నరుడవో భక్తి। పరుడవో బ్రచ్ఛన్నహరు
డవో ప్రమథ। వరుడవో బాతాళచరుడవో యమృత। కరుడవో తరు
ణభాస్కరుడవో కాంతి। మరుడవో దానవేశ్వరుడవో వహ్ని। ధరుడ
వో గొక్కనిజరుడవో చెపుమ। యేలోకమునుండి యేగుదెంచి
తివి। యేలోకమునకింక యేగెదవనుడు। వినుముతపోమూర్తి విస్మ
యంబొందు। వినవయ్యనాపోవు విధముజెప్పెదము, కరవీరుడనగ రాక్ష

### కరవీరునికథ.

సవిభుండొక్క। డరుదరుదనగ నీయచలంబునందు। రతిగరవీరేశ్వరంబ
నప్రమథ। పతిప్రతిష్ఠించి తపంబాచరింప। హర్షుడుబ్రత్యక్షమై యడు

గడుగునునిన। వరదాని వేరొండు పశ్నము సేనొల్ల। భువినిసర్వాంగములు
నుధాతువులు। వివిధసూక్ష్మస్థూల వృత్తరూపములు। గావించితత్స
ముక్తతిపుష్పవితతి। నీవెప్పుడునుబి్రయాన్వితుడవై తాల్పు। మే దొకిచ్చి
ద్ధళంబైననిన్నూర్వన్ప। నొండదేవేంద్రత్వమొసగుమత్యుక్షలకు నటుగా
కనాపుష్పమంతయు నొకడు। పటుభక్తిమీాపదాబ్జములు బూన్ప। మరి
పూర్వజన్మ సమాధులులేని। నెఱిముక్తిగరుణింపు నిజమట్లుగాక। యొక
పూవునినుబూన్ప నొరుశైనబనుప। సకలేశమత్త కుంజరసహాసమ్ములు।
ధరవాజిపేయ శతంబులుశ్రుతుల। వసుదగుకోటి కన్యామహాదాన।
ములఫలంబులుబొంద ముక్కంటిరెయొనగు। బిలిబిలివరములు బ్రియముగా
వనుడు। వసమాత్రుదొసగె నట్లుదియానిగాగ। సుధనీకరవీర వనమొప్పె
మరియు। నావిభ్రమంబయ్యె సఖలలోకములు। గావింపజను బహుకర
వీరజాతి। యకృతాత్మలకు వరిదియివ్వనము। సుకృతాత్మలకు గాన
మలభమివ్వనము। పూనినీబా్రక్తిన పుణ్యఫలమున గానంగనయ్యెనీ కర
వీరవనము। అట్టునుగాకదివ్యాంజనతిలక మెంటిన్న వాడవీమీాదినమందు।
యెట్టిపుణ్యుడవొ నీవిచ్చోటనుండ। కట్టెదుటమున్ను గానంగబడియె।
తదలకుమీావింక కదిలితివేని। కదసిచూచిన మముగానంగరాదు। అదిగ
రవీర మహాత్మ్యమీాకొలను। విదితప్రభావంబు వినుతపోధనుడు। యరు
దగుసురదీర్ఘి కాంశమీాకొలను। వరగభాగీరధీ పాయయీాకొలను।
నివురుభోగవతిని నిట్టయీాకొలను। ఘుృవముగోదావరి తోవ్రయీాకొ
లను। వరకుండతీర్థాల వాలమీాకొలను। వరిమల్లికాకుండ సరణియీా
కొలను। పోలుపారజలదునీ బీజమీాకొలను। ఘనకీర్తిశివమాళి గంగ
యీాకొలను। యిందులపద్మంబు లీశుబూజించి। సుందరి దేవకీ సుతువిష్ణు
బడసె। యీాదామరలశౌరి యీాశానుబూన్ప। కాదెచక్రంబును కన్ను
నుబడసె। సరసిజగర్భ డీ సరసిలోనొక్క। సరసిజంబునగాదె। సంభవం
బయ్యె। కరపద్మములలోటి కలువఙగాఁ। నరిదాల్చులీలాంబుజములివి
గ్గావె। తరుణియీాపద్మమైత్ర్యముజేసిగాదె। స్ఫురితతేజోవృద్ధి బోదతె
లోకముల। యీాపద్మములగాదె యింతియాకుంతి। పాపారిబూజించి పడ
సెపాండవుల। చెంతియాపద్మముల్ శివుబూన్చికాదె। సుందరిభృగు

